# మన్వంతరం



★

రచన

తారాశంకర్ బెనర్జీ

అనుకృతి

మదిపట్ల సూరి



★

ప్రకాశకులు

ఆంధ్ర బుక్ హౌస్

హైదరాబాద్ (దక్షిణ)

# మన్వంతరం

ఇరవయ్యో శతాబ్దంలో నలభై రెండో సంవత్సరం గడచిపోతోంది. ప్రపంచపు గొడవలన్నీ ఎత్తటం యెందుకుకాని—వంగదేశంమటుకు వంగదేశం యెంతో మారిపోయింది...ఒక శతాబ్దంక్రితం చక్రవర్తి వంశీయులు జీవిత సంగ్రామాల్లో విజయాన్ని సాధించుకున్నారు. గోదాలోంచి తిరిగివస్తూ శరీరాన్ని అంటుకున్న దుమ్మును దులుపుకునే వస్తాదులాగా—శాదరబందీలన్నీ దులిపేసుకుని, ఒంటినిండా అత్తరువులు పూసుకుని పడక గదుల్లోచేరి, పట్టుశాలీసులకు చేరగిలపడి తలుపులు బిడాయించుకు కూచున్నారు. ఇంక జీవితసమరాలమాట తలపెట్టలేదు. మళ్ళీ అక్కడనుంచి బైటికి రాలేదు. బయట వాయువుల్ని ఆ గదుల్లోకి దూరనివ్వలేదు; తత్ఫలితంగా వారు ఇప్పటికీ మానసికంగా మధ్యయుగంలో నివసిస్తున్న మానవుల్లాగానే వుండి పోయారు. మల్లయుద్ధ సాధన చేసేవారు తమ సాధన చటుక్కున మధ్యలో మానేసి, కేవలం బాదంపర్బతులు మాత్రమే తాగుతూ కూర్చుంటే అగ్నిమాంద్య మయినా పుట్టవచ్చు—లేదా మహోదరమయినా

రావచ్చు. దేహారుధ్యానికి రెండూ అపాయకరమైనవే. అలాగే ఎంత ఐశ్వర్యవంతులయినా—డబ్బు సంపాయించే మార్గాల నన్నిటినీ వదులుకుని, భోగా లనుభవించటమే ప్రధానంగా పెట్టుకోవటంకూడా అపాయకరమే. రెండు వైపులా గొట్టాలుండే నీళ్లటాంకుకు —నీళ్లువచ్చే గొట్టాన్ని బిగించేసి, నీళ్లుపోయే గొట్టం మూత మాత్రం తీసేస్తే ఫలితం నీళ్ళు కారిపోవటమేకాదు; ఆ నీళ్ళన్నీ పోయాక ఆ టాంకు పగులు చూపుతుంది. దానిచుట్టూ తేళ్ళూ పాములూ మొదలైన విషజీవాలు స్థావరం యేర్పరచుకుంటాయి. ఒట్టిపోయిన టాంకు దుమ్ములో — విషకీటకాలతో నిండిపోతుంది.

సుఖమయ చక్రవర్తి ఆరోజుల్లో సాటిలేని కార్యశూరుడు. కలకత్తానగరంలో ఎంతలేదన్నా పదిహేను ఎకరాల స్థలంలో పేదవాళ్ళకు నివాసాలు కల్పించి, అక్కడ వారి ఆధిపత్యాన్ని నెలకొల్పాడు. రాంబాగాన్, సోనాగాఛి ప్రాంతాల్లో పది—పదిహేను అద్దెల ఇళ్లు కట్టించాడు. సుమారు వెయ్యిన్నర గజాల స్థలంలో రెండు భాగాలుగా పెద్ద భవంతి కట్టించుకున్నాడు. బ్యాంకులో కొన్ని లక్షలు కూడపెట్టి, క్రొత్తగా కట్టించిన వీధి సావడిలో జాలీసులకు చేరగిలపడి హుక్కా త్రాగుతూ—జీవితంలో పాదుషా దర్జా వెలిగించాడు.

అంతేకాకుండా అతడు గుర్రపుబగ్గీ తోలుకుంటూ ముఖ్యమనుకున్న నాలుగైదు ఇళ్ళలో జరిగే సభలకూ సమావేశాలకూ వెడుతూఉండేవాడు. దేశోపయోగ కరమైన కార్యాలకు చందాలిచ్చేవాడు. గంగానదిలో మయూర నౌకా విహారాలు కూడా చేసేవాడు. కాని ఆయనకొడుకులు మాత్రం, అవికూడా వదిలేసి కేవలం బాదంపర్బతులు మాత్రమే త్రాగుతూ కూర్చునేవారు. ఈ చక్రవర్తి వంశంలో రెండోతరంవారిది అన్ని విధాలైన జీవిత సమరాలూ చల్లారిపోయినస్థితి. ఇంక ఉన్న సంఘర్షణను—ఇంచుమించు ఆత్మ విధ్వంసంలాంటిదని చెప్పవచ్చు.

అన్నదమ్ములు ముగ్గురూ భార్యలను చావకొడుతూఉండే వారు. చీట్లపేక ఆడేవారు. రేస్‌లకు పరుగెత్తేవారు. మస్తుగా మద్యపానంచేస్తూండేవారు. బయటవైపున ఉన్న ఇంట్లోకి ప్రతి రోజూ వేశ్యలను రప్పించుకునేవారు. ఇవాళ కొన్న గుర్రాలను మర్నాడు అమ్మేసి, మళ్ళీ క్రొత్తవి కొంటూఉండేవారు. అంతః పురస్థితికూడా దీనికి తగినట్లుగానే ఉంది. ఆడవాళ్లు ఎప్పటి కప్పుడు పాతనగలన్నీ చెరిపించి క్రొత్తక్రొత్తరకాలు చేయించు కుంటూ ఉండేవారు. ఇవాళ కొన్న చీరెలు, జాకెట్లు మర్నాడు మూలపారేసి, మళ్లీ క్రొత్తరకాలు కొంటూ ఉండేవారు.. ఆత్మీ యుల ఇళ్లకువెళ్ళి వాళ్ళేమేమి కొంటూఉంటారో తెలుసుకుని వచ్చేవారు. శని ఆదివారాలొచ్చాయంటే నాటకాలకు వెళ్ళే వారు. మిగతారాత్రులు భర్తల రాకకోసం తెల్లవార్లూ జాగరణ చేసి, నిద్రమత్తుతో ఎప్పుడూ జోగుతూ ఉండేవారు. ఇంతేకాదు వారి జీవితంలోకూడా అప్పుడప్పుడు మార్పు అంటూ వచ్చేది. ఆవచ్చే మార్పు కడుపుచిచ్చు. వీరివంశంలోని సంతానం చాలా భాగం పురిటిగదుల్లోనే గతించేది. ఇంకా ఇప్పటికీ అలాగే గతి స్తోంది. చక్రవర్తి వంశీయుల సంతానం అదృష్టం చాలాగొప్పది. అంచేతనే వారికి సూతికాగృహాల్లోనే విముక్తి లభిస్తోంది. ఆ అదృష్టం లేనివారు ఎలాగో బ్రతికేవారు. కాని బ్రతకలేక వారూ, బ్రతుకుతున్నవారికి చాకిరీ చెయ్యలేక తల్లులూ నానా బాధలూ పడేవారు. అది చెప్పశక్యంకాని బాధ. ఎముకలు బైటపడి, ఎండిపోయిన శరీరాలతో—పిల్లలు ఉబ్బసపురోగుల్లాగా ఎప్పుడూ హైరానపడుతూంటే—తల్లులు ఏదో తెలియనిబాధతో వాళ్ళముఖాలకేసి చూస్తూ కూర్చునేవారు. చక్రవర్తి వంశీయుల వ్యాధి తొలిబీజాలు అప్పుడే వాళ్లలో కనిపిస్తూ ఉండేవని—డాక్టర్లు అంటూ ఉండేవారు.

వ్యాధి ఇప్పుడు ఈ వంశంయొక్క సర్వావయవాల్లోనూ ఉన్నట్లు స్పష్టంగా బైటపడింది. ఇప్పుడు చక్రవర్తులకు బాదం

పర్భుతులు జీర్ణంచేసుకునే శక్తి లేదు. అసలు బాదంపర్భుతులూ ఆఖరయినాయ్. బ్యాంకుల్లోని లక్షలన్నీ ఖర్చయిపోయాయ్. బీదలకు నివాసాలు కట్టించిన ఆ పదిహేను యెకరాల స్థలంలో ఇప్పుడు గట్టియిళ్లు చాలాలేచాయి. రాంబాగాన్, సోనాగాఛీ ప్రాంతాల ఇళ్ళమీద వీరి యాజమాన్యం పోయికూడా చాలాకాల మయింది. రెండుభాగాలుగా కట్టించుకున్న వీరి భవంతిమీద మొత్తం ఎంత లేదన్నా యాభై—అరవై రావిమొక్కలూ—మర్రి మొక్కలూ మొలకెత్తాయి. ఏటేటా వాటిని కొట్టిస్తున్నా, మళ్లీ మొలుస్తూనే ఉన్నాయి. ఆ మొక్కలు అట్టే పెద్దవికాక పోయినా వాటి వేళ్ళుమాత్రం ఆ గోడల్లో రాతిరాతిమధ్యకి చొచ్చుకు పోయాయ్. అర్ధరాత్రులప్పుడు రంయ్‌మని గాలి వీస్తూంటే— ఎక్కడినుంచో ఎవరో ఈలలు వేస్తున్నట్లుంటుంది:

రెండోతరం చక్రవర్తులు ముగ్గురు అన్నదమ్ములు—అంటే సుఖమయ చక్రవర్తికి ముగ్గురు కొడుకులు. ముగ్గురిలోనూ ప్రస్తుతం జీవించివున్నది రెండోఅతడు చినబాబు ఒక్కడే. అతడి కిప్పుడు ఇంచు మించు అరవైఅయిదేళ్ళుంటాయి. ఒకప్పుడు అందగాడే కాని ఇప్పుడు ముఖానికి పక్షవాతం వచ్చింది. పళ్లు చాలాకాలం క్రితమే ఊడిపోయాయి. ఘాడుపడిన కొంపలాగా— రోగంతో శరీరం తూట్లుపడి వికృతమైపోయినా ఇంకా బ్రతికే ఉన్నాడు. అతడి హాయాంలో అతడు నాటకాల భక్తుడు— ఉపన్యాసధోరణిలో తప్ప మాట్లాడేవాడు కాదు. చేతికి బరువైన రవ్వల ఉంగరాలుండేవి. 'నే నేం అపరాధంచేశాను ప్రభూ?' అంటూ ఇప్పుడు రోజు భగవంతునికి మొరపెట్టుకుంటూ వుంటాడు. 'పాపంమూలంగా అధర్మంమూలంగా అంతా నాశనమై పోతోందిలే' అని లోకాన్ని దుమ్మెత్తిపోస్తూ వుంటాడు. 'సంభవామి యుగే యుగే'అని పరమాత్మ స్వయంగా చెప్పుకున్నాడు—అలాగే సమస్తం ధ్వంసంచెయ్యటానికిగాను తాను జన్మించినట్లు—తనసుతానే సమాధానపరచుకుంటూ ఉంటాడు. ఇప్పుడు రోజూ నియమంగా,

భగవంతుని నామావళి ముద్రించిన పాత పట్టుగుడ్డ పైనకప్పుకొని, సంధ్యా వందనాదివిధులు నిర్వర్తిస్తూ ఉంటాడు. గీతాపారాయణం, చండీపారాయణం చేస్తూఉంటాడు. వారానికొకసారి పురోహితుణ్ణి పిలిపించుకుని ఆపదుద్ధారక మంత్రాలు చెవినివేయించుకుంటూ వుంటాడు. అర్ధరాత్రివేళ నల్లులు కుడుతూండటం మూలంగా కోపంవచ్చికాని, గాలి ఆడక ఉక్కపోస్తూవుండటం వల్ల చిరాకువచ్చికాని, అరవైయేళ్ల ఇల్లాలిని పట్టుకుని చేతిలోని విసనకర్ర తిరగేసి కొడుతూవుంటాడు. ఒకొక్కపుడు తలుపులు తీసి ఆమెను బయటికి గెంటేస్తూ వుంటాడు. అరవైయేళ్ళ ఆ యిల్లాలికి ఇదేమంత అన్యాయంగా తోచేదికాదు; అవమానమని అనిపించేదీ కాదు ఆమె ఇవేమి పట్టించుకోకుండానే, వాతరోగం, మూలంగా గుదులుకట్టిన కాళ్లతో కుంటు కుంటూపోయి, ఆ విశాలమైన భవనంలో ఏమూలనో కొంగుపరుచుకుని పడుకునేది. తెల్లవారకమునుపే మళ్లీలేచి వికృతమైన ఉచ్చారణతో ఈశ్వర ప్రార్థన చేసుకుంటూ వుండేది—దాని అర్థం ఆమెకు తెలియకపోయినా అందులో ఒక ఆశయంమాత్రం వుండేది. ఆ ఆశయ సాఫల్యంకోసమే ఆ ప్రార్థన—'అభావాన్ని తొలగించి, శుభాన్ని చేకూర్చు భగవాన్'అని...అదికాగానే భర్తకు వుపచారాలు మొదలెట్టేది. వేడినీళ్ళు, కచ్చిక, తాటాకు, మందుసీసా. నల్లమందుడబ్బీ—అన్నీ సిద్ధంగా అమర్చిపెట్టేది. టీ తయారుచేసేది. ఇంచు మించు నగ్నంగావున్న భర్త శరీరానికి స్నానానికి ముందు నూనెరాచేది. అతడు టీ తాగి బైటికి వెళ్ళాక, ఇహ ఆమె నిశ్చింతగా వుండగలిగేది చినబాబు ఆది కాలంనాడు తానే గుర్రపు బగ్గీలు కొంటూ వుండేవాడు— అమ్ముతూవుండేవాడు. కాని ఇప్పుడు మాత్రం వీటిని కొనేవాళ్ళకోసం కొంపలవెంట వెతుక్కుంటూ తిరుగుతూంటాడు— అంటే చినబాబు ప్రస్తుతం బళ్లవ్యాపారంలో బ్రోకరు. ఆ హయాంనాటివారిలో ఆయన విధవ మరదలు ఒకామే వుంది. దనదవలాడే శరీరం, చెవుడు, ఆచారం. చాదస్తం, ఆమె గొడవేమిటో ఆమెదే.

రెండోతరంలోని ముగ్గురు అన్నదమ్ముల సంతానం—మొత్తం పదకొండు మంది. ఏడుగురు మగవాళ్ళు—నలుగురు ఆడవాళ్ళు. రెండోతరం వారిలో చినబాబు ఇంకా బ్రతికేవున్నా—ప్రస్తుతం ఇది మూడోతరంవారి హయాం. కూతుళ్ళు అత్తవారిళ్ళకు వెళ్ళిపోయారు. ఇహ కొడుకులూ, వాళ్ళ పెళ్ళాలు, వాళ్ళ సంతానం—ఇది ప్రస్తుతం ఉన్న సంసారం. ఇప్పటి స్థితి యిదివరకుకన్న అధ్వాన్నంగానూ, అయోమయంగానూ వుంది. వంశంయొక్క ప్రౌఢత్వం—మూడోతరంతో సంపూర్ణమై—నాలుగోతరంలో వార్ధక్యంతో శిథిలమైపోయే సూచనలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. మూడో తరంలోని యేడుగురు అన్నదమ్ములూ—నలుగురు అక్కచెల్లెండ్రలో అయిదుగురు వెర్రిబాగులవాళ్ళు. ఇహ మిగిలిన వాళ్ళ జీవితగమనం—అప్పులవాళ్ళ భయం మూలంగా దొడ్డిదారిని వంకర టింకర సందులనుంచి—ప్రాణభయంతో చాటు మాటున సంచరించే జంతువుల జీవితంలాగా—సాగుతోంది. పగలంతా అసలు వాళ్ళగొంతుకలే వినిపించవు. చీకటిపడిన తర్వాత పరస్పరం కక్షలు సాధించుకోటానికి తీవ్రంగా కలహించుకుంటూవుంటారు. వారి సంతానాన్ని ప్రపంచంలో యేవిధమైన దురభ్యాసాలకు లోనుకాకుండా తప్పించి—వాళ్ళను ఆరోగ్యవంతులుగానూ, గుణవంతులుగానూ చేయాలని కఠినంగా శాసిస్తూంటారు. ఆ విషయంలో లోపమేమి జరగటంలేదు. అయినా మళ్లీ వాళ్ళు చూపించే ఆదరానికి అంతుఉండదు. ఫలితంగా ఆ సంతానంలో ఒకడు పద్ధెనిమిదేళ్లవాడైనా, అతడికింకా మానసికంగా కుర్రతనం వదల్లేదు. పదకొండేళ్ల ఒక అమ్మాయి కాస్తసందు చిక్కిందంటే చాలు వీధినపడి—'మా నాన్న మంచాన పడ్డాడు. ఒక్క కానీ ధర్మం చెయ్యండి బాబూ' అంటూ—బిచ్చమెత్తుకుంటూ తిరుగుతూ ఉంటుంది. తిరిగి తిరిగి రాత్రి పదింటికి యింటికి చేరుకుంటుంది. బిగ్గరగా పాటలు పాడుకుంటూ ఆ అమ్మాయి యింటికి తిరిగి వచ్చేవేళ—ఆ గొంతు వినపడితే ఆ వాడ వాడంతకి పదిగంట లయినట్టు గుర్తు.

వీరిలో పెద్దఅయిన పెద్దకొడుకు ఎలాగో ఆరోగ్యవంతుడూ సహజమైన ప్రకృతికలవాడూ అయినాడు. అదొక విచిత్ర విషయం. యమ్. ఎస్‌సి. చదువుతున్నాడు. నియమంగా కాలేజీకి వెడతాడు. ఒకపూట ప్రైవేట్ ట్యూషన్ చెపుతూ ఉంటాడు. బయట ఎక్కడయినా నిస్సంకోచంగానే తిరుగుతాడు. కాని ఇంట్లోకి వచ్చేసరికి మాత్రం—ఏమిటో హడలి బేజారయిపోతూ ఉంటాడు. ఈ ఇంటి అంటు—జాడ్యం తనకుకూడా సంక్రమిస్తుందేమో అని భయపడుతూంటాడు. అంచేత ఎక్కువకాలం బయటనే గడుపుతూంటాడు. రాత్రివేళల చినబాబు కేకలు విని, నిద్రపట్టక ఈ వెర్రిబాగులవాళ్లు ఇటు అటు తిరుగుతున్న అడుగుల చప్పుడు విని అతడు పక్కమీద బోర్లగా పడుకుని ఏడుస్తుంటాడు. దీనినుంచి తనకి రక్షణ మార్గం లేదు. తన రక్తంలోనూ ఆ విషం ఉంది—ఆ ఉన్మాదరోగం, ఆ బధిరత్వం, వంశంలోని శిశుమరణాలు, వారు ఒకవేళ బ్రతికినా వాళ్ళ శరీరాల్లోని శైథిల్యం, అస్వాభావికంగా వినిపించే వాళ్ళ నిట్టూర్పుల్లో ఏ రోగంతాలూకు విషం అభివ్యక్తమవుతూఉందో—ఆ విషం తన రక్తంలో కూడా ఉంది. తన తండ్రిమిత్రుడైన డాక్టరు చెప్పిన మాటలు మరిచిపోదామన్నా అతడికి మరుపురావటంలేదు. ఈవంశానికి ఇంత వైపరీత్యం ఎలా దాపరించిందా అని మధ్యమధ్య ఆలోచనలు వస్తూఉంటాయి. అలా రాకపోయినట్లయితే ఆ మందమతులతో, ఆ వెర్రిబాగులవాళ్లతో కలసిపోయి అతడూ హాయిగా ఉండకలిగేవాడే. విచారంకాని భయంకాని అతణ్ణి ఇంతగా పీడించగలిగేవికావు. మళ్ళీ వెంటనే మరో ఆలోచన వచ్చేది— నిజానికి, 'మానవులలో చెడుకన్న మంచే ఎక్కువ అయినప్పటికీ ఈ వంశంలో గూడుకట్టుకున్న చెడుఅంతా మిగిలిన వాటిన్నటిని మించిపోయి చివరకు ఇలా పరిణమించి ఉంటుంది'...ఈ కుటుంబంలోనివారందరిమీద అతడికి మనస్సులో బోలెడంత మమకారం ఉంది పింతండ్రులు, పింతల్లులు, తమ్ములు చెల్లెళ్లు అందర్నీ ఆపేక్షగానే చూస్తూఉంటాడు. ఈ కుటుంబం ఒక అందాలగని. తమవంశంలో ఉన్న— ఇలాంటి సౌందర్యం

ప్రపంచంలో అరుదు అని చెప్పవచ్చు. వీరందరి భారం తనమీద వుంది. తల్లితో ఏకాంతంగా కూర్చుని మాట్లాడేటప్పుడెప్పుడూ అతడికీసంగతి స్ఫురిస్తూనేఉంటుంది. అతడితల్లి నిజంగా బంగారు ప్రతిమలా ఉంటుంది. చేతులకు రెండు దంతపు గాజులు తప్ప ఆమెకు వేరే ఆభరణాలేవీ లేవు. ఎప్పుడూ పాత జరీపట్టుచీరెలు—చిరుగులు పైకి కన్పించకుండా, ఎదుటి వారికి ఆశ్చర్యం కలిగించే టంత నేర్పుగా కట్టుకుంటూఉంటుంది. కాని కానాయ్‌కి అదేమంత పెద్ద ఆశ్చర్యకరమైన విషయంకాదు. తనతల్లి చిన్నతనంలో పొందిన శిక్షణ ఒక్కటే అతడికి ఆశ్చర్యంగాను, గొప్పగాను కన్పించేది. తన జీవితంలో అనుభవంలోకి వచ్చిన విషయాలన్నిటికన్నా ఇది అతడికెంతో గౌరవంగాకూడా తోచేది. అతడితల్లి పేదయింటి బిడ్డ. వాళ్ళవంశంలో ధనవంతులంటూ ఎన్నడూలేరు. ఇప్పటికి కానాయ్ నాయనమ్మ, పింతల్లులు— అతడి తల్లిసంప్రదాయాన్ని, వారి పొదుపరితనాన్ని చూసి, దరిద్రవంశీయుల సంకుచితత్వంమీద వారిలోభితనంమీద— చాటుగానేగాదు బహిరంగంగా కూడ వ్యాఖ్యానాలుచేస్తూ ఉంటారు. కానాయ్ వ్యంగ్యంగా నవ్వేవాడు. ప్రపంచంలో దరిద్రులయినవారికి తిండిమీద ఆకాంక్షఉండటం—ఆకాంక్షే కాదు ఆశ ఉండటమయినా అపరాధంకాదు, ఆ ఆకాంక్ష వారి ఆకలికి గల హక్కు. అది ఆందోళనతో కూడుకున్నది, పిరికిది. దుర్బలమైన ఆ హక్కును ఆపేక్షిస్తే ఆ ఆకాంక్షను సహించవచ్చు. కాని దాన్ని అసహ్యించుకోవటం—అపహాస్యం చేయటందేనికి? అదీకాక ఎవరైతే ఇలా అపహాస్యంచేస్తుంటారో వారికయినా తిండిమీద ఉండే వాంఛ తీరిపోదు, వారి భోజనంలో ఎన్నోరకాల పదార్థాలున్నా—అది ముఖ్యంగా పుష్టినివ్వటానికిబదులు—వివిధ రుచులతో కేవలం విలాస భోజనంగా పరిణమించింది. అన్ని పదార్థాలు సమకూర్చుకున్నా వాటిని కెలికేసినట్లు కాస్త కాస్త తిని, మిగిలినవి పెంటపోగుమీద పారేసి, దుబారాగా చెయ్యటం తమకు లెక్కలేదని వెల్లడి చేసుకుంటారు. అలాంటి తత్వం క్షమించ తగిందికాదు, క్షంతవ్యం కాకపోవటమేకాదు; అసలలాంటి విలాసభోజనం మూలంగా

వారి కండరాలన్నీ కొవ్వుగా మారిపోయి, వారి ఆకారం ఎంత వికృతంగా హాస్యాస్పదంగా తయారవుతుందో, అద్దంలో చూసుకున్నప్పుడైనా వాళ్ళకి తెలియకుండా ఉంటుందా? అతడి తల్లి హక్కులో ఉన్న పిరికితనం అతడికి లజ్జా హేతువు కాదనికాదు; కాని అతడితల్లి తమవంశంలోంచి ఎలాంటి విషాన్ని తీసుకొచ్చి—వీరి వంశరక్తాన్ని కలుషితంచెయ్యలేదు. అదే కానాయ్‌దగ్గిర తల్లికిఉన్న గొప్పహక్కు కానాయ్‌కు వున్నకోపమల్లా మాతామహుడి మీదనే రత్నగర్భకదా అని సముద్రం ఉప్పునీళ్ళలో అతడు బంగారు ప్రతిమను తీసుకొచ్చి పడేశాడు.

కానాయ్‌కి మరొక వ్యక్తిమీద కూడా భక్తివుంది—ఆమె కోసం కానాయ్ కంటతడికూడా పెట్టుకుంటూవుంటాడు. ఆమె అతడి ప్రపితామహి——తమ వంశానికి మూలపురుషుడైన సుఖమయ చక్రవర్తి భార్య. ఆమెకిప్పుడు తొంభై యేళ్ళు. చూపు కనపడదు, మాట వినపడదు. అయినా యింకా ఎండిపోయిన మాంసపు ముద్దలా అలాగే పడివుంది. చినబాబు ఆమెకు 'నికష' అని పేరు పెట్టాడు. రావణాసురుని తల్లి పేరు నికష. తన వంశం అంతా నాశనం అవటంచూచికాని ఆమె చావలేదు. చినబాబు రోజూ ఉదయం తల్లికంటపడినప్పుడల్లా—తనచుట్టూ మృత్యువునీడ సోకుతున్నట్లు భావించేవాడు, ఇంకా గర్భశోకం తీరకనే తనతల్లి బ్రతికివున్నదనే నమ్మకం అతడికి రోజు రోజుకూ బలపడుతూ వచ్చింది. సుఖమయ చక్రవర్తి కొంత ఆస్తి ఆ వృద్ధురాలి పేరు పెట్టి గతించాడు. చినబాబు బ్రతికివుండగా ఆమె చనిపోతే—ఆమెకు బ్రతికివున్న పుత్రుడు అతడొక్కడే కనుక ఆ ఆస్తి అతడికే దక్కుతుందని ఆశ. అంచేతనే తల్లివిషయంలో అతడి అసహనం ఆనాటికానాటికి పెచ్చుమీరి పోతోంది.

ఇంట్లో ఇహ మిగిలినవారంతా చినబాబు చావును కోరుతున్నవారే. కానాయ్ మణిబాబాయ్ అని పిలిచే——చినబాబు ఏకైకపుత్రుడు—మణిలాల్ చక్రవర్తికూడా తన తండ్రి మృత్యు

వును కోరుకుంటున్నాడు. కారణం మరేంలేదు. ఆయన చచ్చిపోతే—అంతో యింతో మిగిలిన ఆస్తి అదైనా తనచేతికి వస్తుందికదా అని ఆశ. ఒకవేళ చినబాబుకూడా తన తల్లిలాగా పరమాయుర్దాయం కలవాడైతే...? ఆ ఆలోచన వచ్చినప్పుడు మణిలాల్‌కు ఎంతో కోపంవచ్చేది...! ఆలాంటి రోజున అతడిపిల్లల దురదృష్టం చెప్పటానికివీల్లేదు. అసలతడికే తల పగలకొట్టుకోవాలనిపించేది. కాని అలాపగలకొట్టుకుంటే వెంటనే ఎంతబాధకలుగుతుందో తెలిసినవాడవటంవల్ల—మణిలాల్ తన తల పగలకొట్టుకోలేక పోయేవాడు. తనపిల్లలు ఏమాత్రం అల్లరిచేసినా కోపంతెచ్చుకుని వాళ్ళతలలు గోడకేసి కొట్టేవాడు.

ఇతడిలా పిల్లల్ని శాసించటం చూసి, చినబాబు గదిలో కూర్చునే సంతోషిస్తూ—"మంచిపనిచేశావ్. మా మంచిపనిచేశావ్ ముప్పైఆరుకోట్ల యాదవవంశం—దయ్యాలదండు – ఆమాత్రం శాస్తిచెయ్యకపోతే బాగుపడదు..." అనేవాడు.

కానాయ్ తెల్లవారు ఝూమున లేచి ముందరివైపు డాబా మీద నుంచున్నాడు. ఈ డాబా పైభాగం ఒకప్పుడు—ఈ ఇంట్లో జరిగే నృత్య గానసభలకు రంగస్థలంగావుండేది. కార్యకరామతులేవైనా వచ్చినప్పుడు ఈ డాబామీదే తాటాకుపందిళ్ళు వేసి, విందులూ, వినోదాలూ అక్కడే జరుపుతూండేవారు. ఇప్పుడీ డాబాఅంతా పగుళ్లు చూపింది. అక్కడక్కడ రాతిముక్కలూడి కన్నాలుకూడా పడ్డాయి. ప్రక్కనుండే పిట్టగోడరాళ్లు చాలా వూడిపడిపోయాయి. ఈ డాబాకు దక్షిణ వైపునవున్న మూడంతస్తులమేడ వరండాలోని కిటికీతలుపుల అద్దాలు కొన్ని పగిలిపోయాయి. దర్వాజాల తలుపులవీ, కిటికీతలుపులవీ కొన్ని గడియ లూడిపోయాయి. మూడో అంతస్తులో పడమటివైపున వరుసగా మూడు స్నానాల గదులున్నాయి. డాబామీదవుండే నీళ్ల టాంకు చిల్లులుపడిపోయింది. పంపుగొట్టాలకు కూడా రంగు పోవటం మూలంగా తుప్పుపట్టి అక్కడక్కడ సన్నటి బెజ్జాలు పడ్డాయి. నీళ్ల టాంకు ప్రక్కనే మొలిచిన మర్రిమొక్క ఒకటి

యేపుగా నాలుగడుగుల యెత్తుపెరిగింది. దానివేళ్ళు డాబా పగుళ్లలోకి చొచ్చుకుపోయాయి. పది పన్నెండు వేళ్ళుగోడను అంటుకునే క్రిందినేలలోకి దిగుతున్నాయి. ఉదయంపూట చల్ల గాలికి అవి ఊగిసలాడుతూంటే నాగపాశాల్లా కన్పిస్తాయి. కానాయీ, అతడి తల్లితప్ప ఇంట్లో ఇంకెవరూ లేవలేదు. ముందు వైపు డాబా క్రిందిభాగం అద్దెకిచ్చేశారు. అందులో ఇద్దరు ట్రాం కండక్టర్లూ కొందరు పత్రికలమ్ముకునేవాళ్ళూ కాపరంవుంటున్నారు. వాళ్ళందరూ అప్పుడేలేచి తమ తమ పనులకు వెళ్ళిపోయారు. అతడి తల్లిలోపలి యింట్లో—తమభాగంలో పాచిపని చేసు కుంటోంది. మిగతా భాగస్వామినులకు మాత్రం ఇప్పటికీ దాసీ వాళ్ళులేందే గడవటంలేదు. వాళ్ళకు రోజుకొక క్రొత్త దాసీది. ఇవాళవచ్చి, మర్నాడు డబ్బులడిగిందంటే ఏదో వంకపెట్టుకుని దానితో పోట్లాడి, మెడపట్టుకుని బైటికి గెంటేస్తారు. మళ్ళీ మరొక క్రొత్తదాసీది వస్తుంది. దాశీవాళ్ళందరూ లేచారు. పంపునీళ్ళకోసం వాళ్ళ కీచులాట ప్రారంభమైంది. క్రింద పంపు దగ్గిర రెండు బిందెలూ, రెండు బాల్చీలూ పడేసి, వాళ్ళు రోజు అంతకీ సరిపోయే పోట్లాటలు మొదలెడతారు. పైన రెండో అంతస్తు—మూడో అంతస్తు డాబాల అంచుల్ని పావురాలు బారులు తీర్చి కూర్చున్నాయి—మధ్యమధ్య ఎగిరి పల్టీలు కొట్టి మళ్ళీ అక్కడి కేవచ్చి వాలుతున్నాయి. అవి వారి పూర్వ పురుషుల విలాస సాధనాల బాపతువి. వర్ణసాంకర్యం రక్తసాంకర్యంలేని, ఈ రకరకాల పావురాల జాతుల్ని వాళ్లు చాలా ఎక్కువ డబ్బు ఇచ్చి తెప్పించారు. ఇప్పుడవి నిరభ్యంతరంగా అడివి పావురాలతో— ఇంకా ఇతరవాటితో కలిసిపోతూ వుండటంవల్ల విచిత్రమయిన ఒక క్రొత్తజాతివిలాగా మారిపోయాయి. తమ యజమానులతో వాటికిప్పుడు సంబంధాలు సన్నగిలాయి. ఇప్పుడు వాటి ఆహా రాన్ని అవే సంపాదించి తెచ్చుకోవాలి. అయినా ఆ యింట్లో చిన్నపిల్లల చేతుల్లో తినుబండారాలేవైనా కన్పిస్తే—వాటిల్లో అసలు

జాతిగల పావురాలు ధైర్యంగా వచ్చి వాళ్ళ తలలమీదనో, బుజాల మీదనో వాలి, ఆ తినుబండారాలను తన్నుకుపోతూ వుంటాయి. ఆహారధాన్యాదులు ఎండబెట్టుకుంటే వాటిమీదకీవస్తాయి. చక్రవర్తుల ఇంట్లో మాంస భోజనంమీద ఆసక్తిగల పిల్లలు—రాత్రిళ్లు బల్లమీద బల్లవేసి యెక్కి, ఆ పావురాల గూడు అందుకుని, వాటిల్లో ఒకటి రెండింటిని పట్టుకుని కూరవండించుకుంటారు. చినబాబు మాత్రం ఇప్పటికీ గుప్పెడు గింజలు తెచ్చి వాటికి చల్లుతూవుంటాడు, ఆ గింజలకోసం వాటల్లో అవి పోట్లాడుకున్నా, ఒకదాని నోటి దగ్గిర గింజలు మరొకటి వచ్చి పరుకునితిన్నా వాటిని గట్టిగా తిట్టేవాడు. చచ్చిన పావురాలను గురించి వాటిని పెంచేవాడు ప్రశ్నిస్తే ఆ నేరం పిల్లులమీధకి తోసేస్తూవుంటారు. అతడు పిల్లుల్ని తిట్టుకుంటూ—చెవుల్లో విలాసంగా పెట్టుకుని త్రిప్పుకునేందుకు ఉపయోగించే ఆ పావురాల రెక్కల్ని మాత్రం ఏరి తెచ్చి, భద్రంగా పాత డ్రాయర్లలో దాస్తూవుంటాడు.

ఈ ఇంటికి పడమటివైపున ఒక పేటవుంది. ఒకప్పుడు సామాన్యస్థితిగల సంసారులై వుండి, ఇప్పుడు దరిద్రులైన వాళ్ళు—దరిద్రులైనా, దరిద్రుల జీవిత విధానాలను అనుసరించటానికి సిగ్గుపడుతూ, శారీరికంగా, మానసికంగా బాధ పడుతున్నవాళ్ళూ—నివసిస్తున్న పేట అది. చీకటి కొట్టులావుండే పెంకుటి కొంపలూ, రేకుల షెడ్‌లూ, సాధరణంగా మురికి పేటల్లోవుండే అసౌకర్యాలూ—మోసం—అన్నీ ఆపేటలో పరిపూర్ణంగా వున్నాయి. ఇన్ని వున్నా వాళ్ళుమాత్రం యెలగో మర్యాద చెడకుండా జీవిత యాత్రలు సాగిస్తున్నారు. వాళ్ళకి తగాదాలనేవి పనికిరావు. కీచులాటలు గిట్టవు. సాధారణంగా కిటికీలకూ—గుమ్మాలకూ పాత చీరెల తెరలు కట్టుకుంటారు. డాబాయిళ్ళ వరాండాల్లో తమలమ యిరుకు భాగాలు కేటాయింపుగా ఉండేందుకు గోనె పంచులతోనూ, వాసపుముక్కలతోనూ, అడ్డంకట్టుకుంటారు. అక్కడక్కడ నాలుగయిదిళ్లకువున్న తెరలు మాత్రం పాత

గుడ్డలుకావు. తళతళలాడుతూ బైటికి కన్పించే రంగు తెరలను బట్టి ఆయిళ్ళు తెలుస్తూనే వుంటాయి. ఆయిళ్ళకువున్న ప్రత్యేకత మరొక విధంగాకూడా తెలుస్తూనే వుంటుంది. యిళ్ళముందు దణ్ణేలమీద చవకపారు అభిరుచులను తెలియచేసే రంగు రంగుల చీరెలు, జాకెట్లూ చొక్కాలూ, ఫ్రాకులూ మొదలైనవి ఆరవేసి వుంటాయి. ఆ పేటలో యేగలభా బయలుదేరినా అది యీ యిళ్ళలోంచి బయలుదేరిందే అయివుంటుంది. వాళ్లూ ఒకప్పుడు దరిద్రులే. ఇప్పటికే చేసే వృత్తినిబట్టి శ్రామికవర్గానికి చందుతారు. కాని తామిదివరకు నుంచీ వున్నశ్రేణికన్న ఉన్నతశ్రేణికి పోవాలని మెల్లిగా ప్రయాణం సాగిస్తున్నారు. వాళ్ళ ఇళ్ళలోంచే సిగరెట్ పొగలు లేస్తూవుంటాయి—ఆ సిగరెట్ పీకెలను ఆ యిరుకు సందుల్లోనే పారేస్తూవుంటారు. క్రొత్తరకం చేపల కూరలు, మాంసపుకూరల వాసనకూడా అక్కడినుంచే వస్తూవుంటుంది. రాత్రి పదీ, పదకొండు గంటలప్పుడు త్రాగి వచ్చిన ఆ యిళ్ళలోని మగవాళ్ళ తందనాలు విన్పిస్తూ వుంటాయి.

తెలతెలవారుతూవుండగనే మగవాళ్లందరూ మళ్ళీ లేచి కాకీనిక్కర్లు, కాకీచొక్కాలు, క్రొత్తక్రొత్త మేజోళ్ళూ వేసుకుని టిఫిన్‌కారియర్లు చేతపట్టుకుని కార్ఖానాలకు పరుగెత్తారు. ఆ ఇళ్ళలోనివారు జీవితం అంటే ఏమిటో ఇటీవలనే చవిచూడటం మొదలెట్టారు. వీరి ఈ క్రొత్త జీవితం—చవకపారు నృత్యాలతో, సంగీతాలతో నిండివుండే సినిమాల పద్ధతులతో ప్రారంభమైంది. వాళ్ల ఇళ్లలోవుండే పిల్లలు అప్పుడే లేచి సినిమా పాటలు, పాడటం కూడా మొదలెట్టారు. కేవలం ఎవరికివారు పాడుకోవటంకాదు—ఈ ఇంట్లో ఒకరు పాట మొదలెడితే ఆ ఇంట్లోంచి మరొకరు ఆపాటనే అందుకుని 'కోరస్' పాడుతున్నట్లు పాడేస్తున్నారు. ఒకరి యింట్లో పాత గ్రామ్‌ఫోన్‌కూడా పాడటం మొదలెట్టింది. సౌండ్ బాక్సు పాడవటం వల్లకాబోలు ఆ గాయకుడిగొంతు ఎవరో నొక్కివేస్తున్నట్లుంది. ఈపాట ఇహప్రొద్దు క్రుంకేదాకా విన్పిస్తూనే

ఉంటుంది. కనీసం ఆఎదుట క్రొత్తయింటివారి రేడియో ఎంత వరకు విన్పిస్తూ ఉంటుందో అంతవరకైనా విన్పిస్తుంది.

మిగిలిన ఇళ్ళన్నీ దైన్యంతో, దారిద్ర్యంతో బాధపడుతున్న వారి యిళ్ళు. వారి మనస్సులలో విషాదం, శరీరాల్లో నిస్సత్తువ—ఉన్నప్పటికీ పైకి బెట్టుగా కాలక్షేపం చేస్తున్నారు. వారి యిళ్ళుకూడా చడీచప్పుడూ లేకుండానే ఉన్నాయి. ఆ ఇళ్లలోని వారు చాలా సేపటిక్రితమే లేచారు. లేచి ఆ పరదాల చాటున దుర్బల శరీరాలతో అటూ ఇటూ మెల్లిగా తారట్లాడుతున్నారు. ఒకరి యింట్లో ఎక్కడో బక్కచిక్కిన శిశువు ప్రాణాలు పోయేటంత బిగ్గరగా ఏడుస్తోంది. ఆ యిళ్ళలోని పాత్రసామానుల చప్పుడుకూడా వినిపిస్తోంది—కాని అదీ అంత పెద్దచప్పుడుకాదు. ఒక డాబా వరండాలో ఒక పెద్దమనిషి చొక్కా లేకుండా లుంగీ మాత్రం కట్టుకుని, బీడీ కాలుస్తున్నాడు. వీధి గుమ్మాల ముందర పనులు చేసుకుంటూన్న ఆడవాళ్లలో చాలామంది చిక్కి శల్యాల్లా ఉన్నవాళ్లే. వారి ముఖాల్లోనూ ఒకప్పుడు రూపురేఖలూ కళాకాంతులూ ఉండేవి. కాని ఇప్పుడు చిక్కి పాలిపోయిఉండటం వల్ల ఆ రూపురేఖలు మాసిపోయాయి. ఇలాంటి ఇళ్ళ మధ్య—ఒక ఇంట్లోంచి పధ్నాలుగు పదిహేనేళ్ళ బాలిక, చిన్న పూలసజ్జ ఒకటి చేత పట్టుకుని, క్రిందివంకే చూసుకుంటూ, మెల్లిగా నడుస్తూ వీధిలోకి వచ్చింది.

ఆమె పూలకోసమని, దగ్గిర లోనేఉన్న ఆ తోటఇంటికి వెడుతుంది.మాసిపోయిన బ్లౌజు తొడుక్కుని, అలాంటిదే చీరెకట్టుకుంది. ఆమె చూపులకు నల్లగాఉన్నా ఆమెది చక్కని కళగల ముఖం. అన్నిటికన్నా ఆమె జుట్టు—మహా అందమైన జుట్టు.నల్లగా—ఒత్తుగా—తుమ్మెదరెక్కల్లా ఉంటుందనవచ్చు. కానాయ్ ఆమెను బాగా యెరుగు. వాళ్లు అక్కడ చాలారోజుల నుంచి ఉంటున్నారు. కానాయ్ చెల్లెలు ఉమతో చిన్నప్పుడు కలిసి ఆడుకునేది. ఇప్పుడూ ఉమకు స్నేహితురాలే. తరచు వాళ్ళఇంటికి వస్తూనేఉంటుంది

చాలామంచి అమ్మాయి. ఆమెపేరు గీత. ఆతడు అతివాత్సల్యంగా "పూలు ఏరుకు రావటానికి వెడుతున్నావా?" అని పలకరించాడు.

గీత కొంచెం సిగ్గుపడుతూ తలయెత్తిచూసి నవ్వి ఊరుకుంది.

ఆకాశంలో ఏమూలనో విమానాలు ఎగురుతున్నధ్వని విన్పిస్తోంది. ఇరవయ్యో శతాబ్దంలో రెండో ప్రపంచ మహాయుద్ధం జరుగుతోంది. ధ్వనినిబట్టి విమానాలు ఎటు వైపున ఎగురుతున్నదీ చెప్పలేము. అనేక పర్యాయాలు ధ్వని ఒకవైపునుంచి విన్పిస్తే మరొక వైపునుంచి విమానాలువచ్చి పడటం సంభవించింది. కానాయ్ ఆకాశంలోకి చూశాడు. నాలుగువైపులా ఎంత చూసినా ఆకాశంలో సంచరించే ఆ ఇనపడేగలు కన్పించనేలేదు. కానాయ్ ముఖం క్రిందికివంచి యిటు చూసేసరికి, గీత యింకా తనకేసే చూస్తూ నుంచునివుంది ఉభయుల కళ్ళూ కలుసుకునే సరికి ఆమె మరీ సిగ్గుపడుతూ—"విమానాలు కన్పించలా" అంటూనే మళ్ళీ తలవంచుకుని నడవసాగింది.

"కానూ! టీ అయిందిరా" అంటూ అతడి తల్లి లోపలివైపు గుమ్మంలోకి వచ్చి నుంచుంది.

కానాయ్ వెనక్కితిరిగి తల్లికేసిచూసి "వస్తున్నా" అన్నాడు.

టీ త్రాగి అతడు శిష్యుడికి ట్యూషన్ చెప్పటానికి బయలుదేరాలి. తల్లి అక్కడినుంచి వెళ్ళలేదు; ఇంకా_స్త దగ్గిరకు వచ్చి నెమ్మదిగా "ఈ నెలజీతం వాళ్ళు ఇంకా ఇవ్వలేదా?" అని, అడిగింది.

కానాయ్ మళ్ళీ తలయెత్తి తల్లి ముఖంకేసి చూశాడు. తల్లి తలవంచుకుని "ఇంట్లో సరుకులన్నీ అయిపోయాయి నాయనా!" అంది.

# ౨

పంచదార, కిరసనాయల్ రేషన్‌షాపుల ముందు అప్పుడే రోడ్ల మీద జనంచేరి 'క్యూ'లో నిలబడ్డారు. అవి రెండూ బజార్లో అసలు దొరకటమేలేదు. జావా మొదలైన దీవులనుంచి పంచదార దిగుమతులు నిలిచిపోయాయి. బర్మా జపానువారిచేతిలోకి పోయింది. అక్కడినుంచి కిరసనాయిల్ ఈ దేశానికి మాత్రం దిగుమతికావటంలేదు. మైదాకూడా దొరకని వస్తువైపోయింది. రోజురోజుకీ ధర పెరుగుతోంది. రెండణాలనుంచి—మూడు—నాలుగు—అయిదు—ఆరుఅణాలు—ఇలా ధర ఇంకా ముందుకు దుముకుతూనే ఉంది. బట్టలబజారు మరీ మండిపోతోంది. దసరాకుముందే ధోవతి ఆరురూపాయలూ, చీరె ఏడురూపాయలూ. తర్వాత నవంబరులో ధరలు ఎంత పెరిగిందీ సరిగ్గా తెలియదు. ఎంతలేదన్నా కనీసం ఎనిమిది—తొమ్మిది రూపాయలైనా అయి ఉంటాయి. అంతవరకు ఖాయం.

దసరాకు కానాయ్ తనకు బట్టలు కొనుక్కోనేలేదు. అప్పుడు తల్లికి, ఆమె ముఖంచూసి రోగిష్ఠివాళ్ళైన చెల్లెళ్ళకూ గుడ్డలుకొనేసరికి రెండునెలల ట్యూషన్‌జీతం అఖరయింది. తండ్రి రెండు చొక్కాలు కావాలంటున్నాడు. ఇస్తేమంచివే కొనిఇయ్యి కాని చవకరకంవి వద్దంటున్నాడు. సామాన్యధరలో ఉండే వస్తువులు ఏవీ ఇప్పటికీ ఆయనకంటికి ఆనటంలేదు. ఇదివరలో—దుబారాగా ఖర్చుచేసే రోజుల్లో—కొన్నవన్నీ చిరిగిపోయాయని, ఈ ఖర్చు గుర్తుకువచ్చినప్పుడు కానాయ్‌కి కష్టమూ విచారమూ కలుగుతూ ఉంటాయి. కాని రంగు రంగుల క్రొత్త దుస్తులు ధరిస్తే తన చెల్లెళ్ళూ—తమ్ముళ్ళూ యెలా ఉంటారో వాళ్ళ రూపు రేఖలు ఊహాకుతోచినప్పుడు ఎంతో సంతృప్తికలిగేది. సహజంగా సౌందర్యవంతులయినా, ఇంకా ఎంతో అందంగా కనిపించేవారు.

ఇప్పుడు చక్రవర్తి వంశస్థులకు సంపదలన్నీ పోతేపోవచ్చు కాని వస్తుతఃగౌరవనీయులు, కులీనులూ, దానికితోడు ఒకప్పుడు ధనవంతులూ కనుక—పుష్పరాశిలోంచి పద్మాలను ఏరుకున్నట్లు—స్వజాతీయులలోని రూపవతులయిన కన్యలనుయెంచుకుని కోడళ్ళ నుగా తెచ్చుకున్నారు. అలా చెయ్యటంవల్ల జీవశాస్త్రరీత్యా తమ వంశీయుల రూపురేఖలు ఎలా ఉండబోయేదీ వారికి మొదట్లో తెలియకపోవచ్చు. కాని వైజ్ఞానికంగా జరగవలసిన దానికి వ్యతి క్రమంమాత్రం జరగలేదు. వీరివంశంలోని పిల్లలసౌందర్యం చూస్తే జన్మాంతరంలో శాపభ్రష్టులైన దేవతలేమో అనిపిస్తుంది. అంచేతనే అపురూపసుందరవతులైన చెల్లెళ్ళను చూచినప్పుడు కానాయ్ కళ్ళు చెమ్మగిలుతూ ఉంటాయి. పాడుపడ్డ కొంపల్లో పాములు నివాసాలు కల్పించుకున్నట్లు—అనువంశికంగా వీరి రక్త నాళాలమాటున విషం గూడుకట్టుకుంటూ వస్తోంది. ఆ విషం ఇది వరకు స్వచ్ఛంగా ఆరోగ్యంగా ఉన్న రక్తకణాలనూ, వాటిలోని పవిత్రశక్తిని ధ్వంసంచెయ్యగలదు. అపురూప, రూపలావణ్యాలు—ఆరోగ్యవంతమైన స్నాయువులతో, స్వచ్ఛమైన రక్తంతో మిశ్రిత మైతే—అవి భూమ్మీద స్వర్గాన్ని సృజించగలవు; కాని విరుద్ధమైన కలయికవల్లనైతే మాత్రం అవి ప్రపంచలో మానవుల్ని విషమ యుల్నిగా చేయగలవు.

ప్రక్కనే పెద్ద ప్రహరీ—అందులో రాజప్రాసాందలాంటి పాత మేడ. దాన్ని తరతరాలవారు పంచుకుంటూ రావటంవల్ల ఆ మేడ అనేక భాగాలుగా విభక్తమైంది. కొంతమంది వాటా దార్లకు చెందిన భాగంలోకి; ఇప్పుడు మార్వాడీలు వచ్చి కాపరం వుంటున్నారు. ఆ మిగిలినవాళ్ళ స్థితికూడా ప్రస్తుతం చక్రవర్తి వంశీ యుల స్థితిలాగానేవుంది. బహుశా వాళ్ళ రక్తంకూడా విషకలుషిత మైపోయి వుండవచ్చు. సాధారణంగా ప్రపంచంలో పెద్ద పెద్ద లోగిళ్ళలో అన్నింటిలో ఈ తంతు సాగుతూవుందని చెప్పవచ్చు

ఆ ప్రహారీకి యెదురుగా—రోడ్డమీదనే ఎ. ఎఫ్. యస్. వారి దళం ఒకటి కాంప్ చేసివుంది. నీలిరంగు యూనిఫారంల్లు ధరించి, బరువైన 'హోస్ పైపులు' బుజానవేసుకుని మోస్తూ ట్రైనింగ్ అవుతున్నారు. ఈ రోడ్డు—పెద్దరోడ్డుతో కలిసేకూడలిలో మిలిటరీ లారీలు చీమలబారుల్లా పోతున్నాయి. కాకీ యూనిఫారంలూ, ఎర్రటోపీలూ, చేతులకు M.P అని ఎర్రటి అక్షరాలతో వున్న బాడ్జీలూ ధరించిన మిలిటరీ పోలీసులు రోడ్డుమీద నిలబడి రాకపోకలను ఆపుతున్నారు. ఆ లారీలలో కట్టెపేళ్ళు దగ్గర నుంచి—మెషిన్‌గన్‌లూ, రెండు మూడు తేలికరకం టాంకులు వరకూ—రకరకాల సామానులున్నాయి. ఆ లారీల మధ్యనుంచి ఎ. ఎఫ్. యస్. వారి చక్కని వాన్ ఒకటి—యెలాగో దారిచేసుకుని వెడుతోంది. వీటి ప్రక్కనుంచి ఒక 'మెసెంజర్' మోటారు సైకిల్‌మీద విపరీతమైన వేగంలో పోతున్నాడు--అతడి నెత్తిన వుక్కుతో తయారైన హెల్మెట్, కళ్ళకు గాగుల్స్‌కు బదులు 'ప్లాస్టిక్ ప్రొటెక్టర్సు' వున్నాయి. పైన నాలుగు విమానాలు ప్రచండమైన ధ్వనితో 'V' ఆకారంలో ఎగురుతున్నాయి. ఆ మిలిటరీ లారీల మధ్యనుంచి నేర్పుగా దారిచేసుకుని, జనంతో కిటకిటలాడుతూ రెండు సిటీ బస్సులు వచ్చాయి. నలుగురైదుగురు యూరోపియన్ సైనికులు ఫుట్‌బోర్డులమీదే నుంచునివున్నారు. బస్‌లు ఆగగానే వారు క్రిందికి దుమికారు. అందులోని ప్రయాణీకులూ కొందరు దిగారు. వారిలో కొంతమంది భారతీయ సైనికులుకూడా వున్నారు.

హఠాత్తుగా—యెవరో అధికారంతో ప్రచండంగా గర్జిస్తున్నట్లు—'ఆపండి' అన్న కేక వినపడింది.

ఆ కేకతోపాటు 'పోయింది—యింకేముంది?' అని జనం కేకలు వెయ్యటం కూడా విన్పించింది.

కానాయ్ ఉలిక్కిపడి కంగారుగా వెనక్కి తిరిగిచూశాడు. మిలిటరీ లారీల నడక మందగించింది. ఏక్కడివక్కడ ఆగిపోయి

వున్నాయి. అటువైపున చౌకులో ఒక కౌపీనధారి రొమ్ము విరిచుకుని. నిలబడి వున్నాడు. అతడి ముఖ కవళికచూస్తే—ఈ పోతున్న లారీలను అతడే బ్రేకులు లాగి, ఆపి, అడ్డంగా నుంచున్నాడా అనిపిస్తోంది. ఈ వాడలోనే తరచు తిరుగుతూవుండే జాగాయ్ పిచ్చివాడు. వీధులవెంట తిరిగి తిరిగి, డస్ట్ బిన్లలోదొరికే ఎంగిలి మెతుకులు తింటూవుంటాడు. అలాంటి జాగాయ్‌కు హఠాత్తుగా యింత శౌర్యం యెందుకో! మరు క్షణంలోనే జాగాయ్ ముందు లారీదగ్గరకు పరిగెత్తాడు. ఆ లారీ క్రిందనుంచి నెత్తురు ముద్ద అయిపోయిన శిశుదేహాన్ని చేతులతోయెత్తుకుని యివతలికి వచ్చాడు. ఆ పోతున్న లారీ శిశువుమీద యెక్కేసింది. జాగాయ్ వెంట జనం కోలాహలంచేస్తూ కాలిబాటమీద మూగారు. ఎమ్. పి. ఈల బిగ్గరగా వినిపించింది. ముందుకు వెళుతున్నట్లు సంజ్ఞలుచేస్తూ లారీలన్నీ మళ్ళీ యథాప్రకారంగా సాగిపోతున్నాయి.

ఈ పరుగెత్తుతున్న లారీల మధ్యనుంచి రాస్తాదాటి అవతలి వైపుకు వెళ్ళటమంటే అసంభవం. వెనకవైపునవున్న దుకాణంలోని గడియారంకాబోలు టంగ్‌మని గంటకొట్టింది. కానాయ్ వెనక్కి తిరిగి చూశాడు. పదున్నర అయింది. శీతకాలం, డిసెంబరు నెల—దానికితోడు కొత్తటైము—ఇండియన్ స్టాండర్డ్ టైము—అతడు ట్యూషన్ చెప్పవలసిన సమయం యెనిమిది గంటల నుంచి తొమ్మిది గంటలవరకు. అతడు వెళ్ళాల్సింది బౌబజారుకు. కానాయ్ ట్రాం డిపో కేసి గబగబా నడుస్తున్నాడు. అతడి ప్రక్క నుంచి కూరగాయలతో, ఇతర ఆహార పదార్థాలతోవున్న రెండు మామూలు లారీలు దూసుకుపోయాయి. మామూలు లారీ డ్రైవర్లయినా వాళ్ళకీ కాకీ దుస్తులూ—నెత్తిన హెల్మెట్లూవున్నాయి.

జాగాయ్ భయంకర గర్జన కానాయ్ చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తూనేవుంది. ఆ కర్ణాంతంసారించిన ధనస్సులాగా—తన బలాన్నంతా ఉగ్గబట్టి రొమ్ము విరుచుకుని నిలబడ్డ అతడిరూపు యింకా కళ్ళముందు మెదుల్తూనేవుంది. ట్రాం పక్క కానాయ్

ఆ సంఘటనను గురించే ఆలోచిస్తూ కూర్చున్నాడు. ట్రాం డిపో ముందు తుపాకి ధరించిన సెంట్రీ పహారా యిస్తున్నాడు.

రాస్తాకు రెండువైపులా ఉన్న గోడలనిండా ప్రకటనల కాగితాలే... '......థియేటర్లో' నృత్యనాటిక. '......థియేటర్'లో సినిమా 'ప్రేమకుసుమాలు'. '......థియేటర్'లో సినిమా 'అడ్రస్ లేని ఉత్తరాలు'. '......థియేటర్'లో 'నవయుగంలోని భారత నారి పాతివ్రత్య మహాత్మ్యం'ట ! 'నటసమ్రాట్ నగేన్ రాయ్ పిచ్చివాడివేషం—అపూర్వం...అద్భుతం.' వరుసగా ఉన్న నాలుగు సినిమాహాల్సులో అప్పుడే ఫోర్తుక్లాస్ ఫుల్—థర్డ్‌క్లాస్ ఫుల్—అని బోర్డులు వ్రేలాడుతున్నాయి. ఒక హాలుముందు హౌస్‌ఫుల్ అని బోర్డు ఉంది...ఇవాళ శనివారం. రెండువైపులా కాలిబాటల మీద కంటికింపుగా కళకళలాడుతున్న దృశ్యాలు...ట్రాముల్లో—బస్సుల్లో రంగురంగుల చీరెలుధరించిన ఆడవాళ్ళ సమూహాలు... ఆశ్చర్యం ! వాళ్ల యింటిచుట్టూ ఉన్న మురికిపేటే కలకత్తా నగరమంతా వ్యాపించినట్లుంది. కానాయ్ నవ్వుకున్నాడు. సరిగ్గా అతడికి వెనుక కూర్చున్న వయసుమళ్ళినవ్యక్తు లిద్దరు జన్మాంతర వాదాన్నిగురించీ, కర్మఫలాన్ని గురించీ చర్చించుకుంటున్నారు—"ఇది అంతా ఏ జన్మంలోనో చేసుకున్న పాపఫలం. అసలు కలియుగంలో ధర్మమే ఒక పాదం. అదీ పూర్తిఅయిపోయింది." "చేతావని చదివారా? ఈ శ్రావణమాసంలో నేట—"

మొదటివ్యక్తి అతడిమాట సాగనివ్వలేదు. "ట—ఏమిటి? అందులో సందేహం ఏమీలేదు. ఈసారి ప్రళయానికి ఉపోద్ఘాతం తుపాను. మీరు చూస్తూ ఉండండి—మేదినీపూర్‌లో ఏంజరిగిందో అంతే జరుగుతుంది—అంతేకాదు, దాంతోపాటు భూకంపంకూడా—అదే ప్రళయమంటే"

ఎదురుబెంచీమీద ఇద్దరు యువకులు రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు. "ప్రియమైన జాన్ మహాశయా! అని అడ్రస్‌చేస్తూనే శ్యాంప్రసాదబాబు ఎంత ఘాటయిన ఉత్తరం రాశాడనుకున్నావ్!

ఫజుల్ హక్ సాహెబుమాత్రం శ్యాంప్రసాద్‌ను ఏమన్నాడు? పులి బిడ్డ ఎలాగైనా పులే అన్నాడు.''

మేదనీపూర్! విద్రోహులతో రెచ్చిపోయిన మేదినీపూర్ ప్రచండమైన ప్రభుత్వరోషానికి గురిఅయి నలిగి పోయింది. సరీగ్గా ఆ సమయంలోనే హఠాత్తుగా తుపానూ, వరదలూకూడా వచ్చి జిల్లా అంతనీ అస్తవ్యస్తంచేసేశాయ్. సముద్రపుకెరటాల్లో మనుష్యులు—పశువులు—లక్షలకొద్దీ జీవాలు కొట్టుకు పోయాయి. శవాలతో మేదినీపూర్ శ్మశాన వాటికయిపోయింది...మళ్లీ అతడు బైటికి చూసేసరికి మేదినీపూర్ సహాయనిధికిగాను ప్రదర్శిస్తున్న నృత్యనాటిక ప్రకటన కంటపడింది. మేయర్‌సహాయనిధి ప్రకటన కాగితాల రంగులింకా చెరిగిపోలేదు. మార్షల్ చాంగ్—కై—షేక్ తుపానుబాధితుల సహాయనిధికి యాభై వేలరూపాయలు విరాళమిచ్చినట్లు నిన్నపత్రికల్లోపడింది. ఇవాళ కనుక జీతంవస్తే అయిదు రూపాయలైనా—మేయర్ సహాయనిధికో—లేదా—'ఆనందబజార్' సహాయనిధికో—పంపాలి.

ట్రాం దేనికో గుద్దుకున్నట్లు చటుక్కున ఆగింది. ఒక రిక్షావాడు అతిధైర్యంగా ట్రాముకు అడ్డంగా రిక్షా లాక్కుని పోతున్నాడు. కనురెప్పపాటు వ్యవధానం వుండటంవల్ల బ్రతికి పోయాడు. డ్రైవరు వాణ్ణి బూతులు తిట్టటం మొదలెట్టాడు. రిక్షావాడు తలవంచుకుని నవ్వుకుంటూ వెళ్ళి పోయాడు. రాస్తామీద కన్పిస్తున్న ఆ ప్రదేశంచూసి కానాయ్ వణికిపోయాడు. ఇటు ప్రక్క శివనారాయణదాస్ వీధి—అటు ప్రక్క సిమ్లా స్ట్రీట్—యెదురుగా ఆర్యసమాజ మందిరం. పోయిన ఆగస్టులో అక్కడే—ఆ రక్తసిక్త ప్రదేశం కళ్ళకు కట్టినట్లయింది. ఆ సంఘటన కానాయ్ కళ్ళయెదుటే జరిగింది. 'యెలాంటి రోజు అది!' కానాయ్ పెద్దగా నిట్టూర్చాడు ఆ సంఘటన, ఆదృశ్యం గుర్తుకొచ్చేసరికి అతడి శరీరం వణికింది. ఎందుకో తెలియదు కాని, అతడి మనస్సులో మిల్టన్ వాక్కులు ధ్వనించాయి. 'Give me the

liberty to know, to utter and to argue freely according to my conscience.' (నా అంతరాత్మ నిర్దేశించి నట్టు స్వేచ్ఛగా తెలుసుకొనటానికీ, పలకటానికీ, వాదించ టానికి నాకు స్వాతంత్ర్యం ఉండాలి.)

దూరంగా హారిసన్‌రోడ్డు మలుపులో పోలీసు లారీ నిలబడి ఉంది. సైడ్‌కార్ కూడా వున్న మోటార్‌సైకిల్ యిద్దరు సార్జంటులతో, రోడ్డుప్రక్కన నడుస్తున్న జనాన్ని రాచుకుంటూ, అతి వేగంగా వుత్తరపువైపుకు పరుగెత్తింది.

'లేవండి మహాశయా! లేడీస్ సీట్; విన్పించటంలా?' కానాయ్ త్రుళ్ళిపడి, సీట్ వెనుకవైపున 'లేడీస్' అని రాసిన అట్టవుందేమో అని తడిమిచూశాడు. పరధ్యానంగా అతడు లేడీస్ సీట్‌లోనే కూర్చున్నాడు.

ప్రక్కనున్న రాస్తాకేసి చూశాడు—కేశవసేన్ వీధిమలుపు.

సరేకాని ఏరీ? లేడీస్ ఏరీ—

'లేవండిసార్!'

కానాయ్ ఈసారి లేచినిలబడ్డాడు.

"మీరా?" స్త్రీకంఠస్వరంతో చకితుడై కానాయ్ వెనక్కి తిరిగిచూశాడు. నీలా సేన్ నుంచునివుంది. నీలా సేన్ నిరుటి వరకూ తమ కాలేజీలోనే తమతోపాటు చదువుకుంది. విద్యార్థి సమితిలో ఉత్సాహవతియైన సభ్యురాలు నీల. ప్రస్తుతం ఆ సమితిలో అందరికన్నా అతి ఉత్సాహవంతుడైన నేపీ అనే సభ్యుడి సోదరి.

నీల పొడుగ్గా, చామనచాయగా వుంటుంది. అంత అందకత్తె కాదు. కాకపోయిన ఆమెది చిత్రమయిన కళగల ముఖం. కానాయ్‌తో ఆమెకున్న పరిచయం కొంచమే. రెండు మూడు సార్లు సమితి సమావేశాల్లో చూసింది. ఒకసారి ఒకటి రెండు మాటలు మాట్లాడింది. మాట్లాడాలనే అభిలాష వున్నట్లున్న ఆమె

చిరునవ్వుచూసి, కానాయే పలకరించాడు—'కులాసా?' 'ఆఁ.' అన్నది నీల. ఆమె ముఖంలో అభాసమాత్రంగావున్న చిరునవ్వు—వేకువజామునందలి శేఫాలికా కుసుమంలాగా—ప్రస్ఫుటమయింది.

"లేచారెందుకు? కూర్చోండి."

"థాంక్స్! నేనిక్కడ కూర్చుంటానులెండి. మీరు కొంచం విశ్రాంతిగా కూర్చోండి"—కానాయ్ సరిగా ప్రక్క సీటులో కూర్చున్నాడు. మధ్య ప్రయాణీకుల దారి మినహాయిస్తే ఇద్దరూ ప్రక్క ప్రక్కగా కూర్చున్నట్లే; చలువచేసిన మిల్లు చీరెమీద నీల తొడుక్కున్న చాక్‌లెట్‌కలర్ వున్నికోటు ఆమెకెంతో బాగుంది. తల దువ్వుకుని, మెడలమీదికి ముడివేసుకుని, దానికి హెయిర్ నెట్ వేసుకుంది. అంటీ అంటకుండా కొంచెంగా అద్దుకున్న పౌడరు—ఆమె చామన చాయముఖానికి మరింత అందాన్నిస్తోంది.

"ఏదీ! మీరీమధ్య కొన్నాళ్ళనుంచీ సమితి కార్యాలయంలో కన్పించటమేలేదే! మీరు బహుశా అలహాబాద్ కాన్ఫరెన్స్‌కు వెళ్లారేమో అనుకున్నాను" అన్నాడు కానాయ్.

"ఉహుఁ. నేను వెళ్లలేదు" నీల ముఖం చిన్నపోయింది. అలహాబాద్ విద్యార్థి సభలకు నీల వెళ్లాల్సిందే అసలు. డబ్బులేక వెళ్ళకపోయిఉండవచ్చు. లేదా సమితి తరఫున వెళ్ళే అధికారం ఆమెకు ఇవ్వకపోయిఉండవచ్చు—అంటే ఆమెను ప్రతినిధిగా ఎన్నుకోలేదన్నమాట!

అంచేత కానాయ్, నీలసోదరుడు— నేపీ ప్రసక్తి ఎత్తి ఈ ప్రసంగాన్ని మార్చేశాడు. "సరేకానీండి, నేపీ సంగతులేమిటి?" నీల చిరునవ్వు నవ్వింది. "వాడికి క్షణంతీరిక లేకుండా ఉంది. ఒకొక రోజున ఇంటికి వస్తాడు. ఒకొకరోజున రానేరాడు. అదిసరే కానీండి, మీరు అలహాబాద్ ఎందుకు వెళ్లలేదు? వెళితే బావుండేది" కానాయ్ నవ్వుతూ అన్నాడు — "మీకు తెలియందేముంది? 'ఉత్థాయ హృది లీయన్తే'—" ఆపైమాట పూర్తిచేయలేదు.

"మీ రామాట చెప్పలేదే?...ఇంట్లో ఎవరికో సుస్తీగా ఉన్న దని అన్నట్లున్నారు?" అని నీల ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఆ మాటా పూర్తిగా అబద్ధంకాదు. మా యింట్లో జన సంఖ్య చిన్నా పెద్దా అందరూ కలిసి ముప్పైమంది. జలుబో, న్యుమోనియాయో రోజూ ఎవరికో ఒకరికి సుస్తీ చేస్తూనేవుంటుంది. కనుక నేచెప్పింది అబద్ధంకాదు. అయినా ఆ కారణంమూలంగానే నేను వెళ్ళలేకపోయాను అన్నదికూడా నిజంకాదు. మనస్సులో యెన్నో కోరికలుపుట్టి, మనస్సులోనే లీనమవుతూ వుంటాయి. కాని అది పైకి చెప్పతగిన సంగతికాదు; కనీసం ఈనాటి సమాజంలో చెప్పకూడదు..."

నీల మెదలకుండా వూరుకుంది. అతడు చెప్పింది నిజమే. విద్యార్థిసమితి సభ్యులలో కానాయ్ మంచివక్త అని అందరికీ తెలుసు. అతడి—ఉపన్యాసం ధారాళంగా ఉండదు. ఉద్రేక పూరితంగానూ వుండదు. కాని యుక్తిప్రధానంగా వుంటుంది. ఆ యుక్తి ఖండించటానికి వీల్లేనంత కరుగ్గా వుంటుంది విశేషించి యెవరైనా యెలాగో అలా ఆ యుక్తిని ఖండించారంటే అతడి ముఖవైఖరి మారిపోతుంది. అప్పుడిహ అతడు మరింత కరుకుగా ఉపన్యసిస్తాడు. ఆధోరణిముందు ప్రతిపక్షులు నిలబడగలగటం అసంభవం.

"మీరింత పెందరాళే—"అని ప్రశ్నించబోయి—కానాయ్ మధ్యలోనే మనస్సును అదుపులోకి తెచ్చుకుని ఆగిపోయాడు. నీలతో అతడికి వున్నకాస్త పరిచయాన్ని బట్టి యిలాంటి ప్రశ్న అడగటం ఉచితంకాదు. కాని ఆ అడిగినకాస్తలోనే అడగతల చిందంతా వ్యక్తమయింది. నీల కొంచం నవ్వుతూ సమాధానం యిచ్చింది—

"మీకు బహుశా తెలియదనుకుంటాను. నేను సప్లై డిపార్ట్మెంట్ వుద్యోగంలో చేరాను."

"ఉద్యోగంలో చేరారా? అయితే ఇంక చదవరా."

"ఉహూఁ. చదివినందువల్ల ఏమిటి లాభం? చదివి ఏంచెయ్యను? కానాయ్ జవాబు చెప్పలేక పోయాడు. నిజమే. 'ఏమిటి లాభం!' చదువుసంధ్యల్లో నీల లాంటి కొంచెం తెలివి తేటలుకల యువతి యెలాగో అలా యమ్. ఏ. సెకండ్ క్లాస్‌లో ప్యాసవగలదు. కాని దానివల్ల మాత్రం ఏమిటి లాభం? మహా అయితే ఏ గరల్స్ హైస్కూలులోనో ప్రధాన ఉపాధ్యాయిని కావచ్చు. నలభైయో, యాభైయో జీతం యిస్తారు. డెబ్భై అయిదుకో—నూటికో జీతాల పుస్తకంలో సంతకం పెట్టించుకుంటారు. నీల చామనచాయ ముఖంలో లాలిత్యంవున్నమాట నిజమే. కాని అంత మాత్రాన ఐ. సి. యస్. బి. సి. యస్. కాని అయి, అన్ని యోగ్యతలూవున్న బెంగాలీ యువకుడెవడూ ఆకర్షింపబడడు. కనుక నైరాశ్యజనకమైన విద్యార్థి జీవితాన్నే యింకా కొనసాగించాల్సిన అగత్యం యేముంది?

"కుప్పలు కుప్పలుగా పడిఉన్న ఫైల్సుతో ఆఫీసు ఎస్. ఎస్. ఎల్. సి. హెడ్ ఎగ్జామినర్ ఇల్లులా—తయారైంది. అంచేత కాస్త 'ఓవర్‌టైం' చేద్దామని వెడుతున్నాను. 'మోస్ట్ ఒబీడియంట్ అండ్ ఫెయిత్‌ఫుల్ సర్వెంట్'ని—తెలుసా?" అని నీల ఈసారి కొంచెం బిగ్గరగానే నవ్వింది. కానాయ్‌కూడా నవ్వాడు.

మళ్ళీ నీలే అడిగింది—"మీరిప్పుడు ఎక్కడికి వెడుతున్నారు?"

"శిష్యుడి చెవులు మెలెయ్యటానికి. ప్రైవేట్ ట్యూషన్ ఒకటుంది—బౌబజారులో".

"బౌబజారు!" నీల ఆశ్చర్యంగా అతడి ముఖంకేసి ఒకసారి చూసి, మళ్ళీ బయట వైపుకు చూసింది.

"ఈ మలుపుతిరిగి కొంచెం పైకివెళ్లాక సెంట్రల్ ఎవెన్యూ జంక్షన్—అరె! ఇదేమిటి! వెల్లింగ్టన్ స్క్వేర్! ఇది డల్హౌసీ ట్రాం కాదూ?"

వెనకనుంచి తోటిప్రయాణీకుడు కానాయ్‌మీద ఏదో ఛలోక్తి విసరబోయాడు. కానాయ్ వెనక్కి తిరిగిచూశాడు. ఆ ప్రయణీకుడింక ఇతడిముఖంకేసి చూడలేకపోయాడు. ప్రక్కకు తిరిగిచూస్తే నీలముఖం—ఆమె తల్లి రోజూ ఉదయం ముఖం కడుక్కోటానికి ఉపయోగించే రాగిచెంబులా—ఎర్రపడిపోయింది. ట్రాం నెమ్మదిగా మలుపుతిరుగుతోంది. కానాయ్ లేచినుంచున్నాడు. "హూఁ. చాలా ఆలస్యమైపోయింది" ఈమాటలు అతడికి తెలియకుండానే అనేశాడతడు.

"అయిన ఆలస్యం ఎలాగో అవనే అయిందికనుక ఇంకొంచెం దూరం రండి. నన్ను పంపించి వెడుదురుగాని".

నీల ఇలా అడగటం కానాయ్‌కు చాలా తృప్తిగాఉంది. అతడి మనస్సు పట్టుబడినట్లు అనిపించింది. ఒక స్నేహితురాలి కోసం—ఒక ప్రాతఃకాలాన్నయినా వ్యర్థంచెయ్యలేని వ్యక్తి—తనకు తానుమాత్రం ఏం ఉపయోగపడగలడు? అతడు మళ్ళీ కూర్చున్నాడు. ఈసారి నీలప్రక్కనే ఖాళీగాఉన్న చోటులో కూర్చున్నాడు.

'మురుగు కాల్వలో మూగిన చేపపిల్లలముందు—చెట్టుమీది నుంచి చక్కని పండు ఒకటిరాలింది. ఆవాసన పసికట్టి, ఆపండు కోసం చేపపిల్లలు గెంతుకుంటూ పోతున్నాయి—' అన్న పంక్తి ఎక్కడిదో కానాయ్‌కు జ్ఞాపకంవచ్చింది.

ఎస్ప్లనేడ్ దగ్గిర నీల దిగింది— "రండి కాఫీత్రాగి వెళుదురుగాని—తర్వాత నేను ఆఫీసుకుపోతా".

"కాఫీత్రాగా!" కానాయ్ ముఖం వెలవెలపోయింది—అతడి జీతం గుర్తుకొచ్చింది.

నీల నవ్వుతూ అన్నది—"క్రొత్తగా ఉద్యోగంలో చేరితినా; పెద్దయెత్తున మిత్రులందరినీ పిలిచి భారీగా విందుచేసే తాహతు లేనేలేదు. మహాతీసుకుంటే కాఫీ సాండ్‌విచ్—అంతేగా!"

ఇంతకుమునుపు అతడెప్పుడూ కాఫీ హోటల్‌కు వెళ్ళలేదు. లోపలికివెళ్ళగానే అక్కడ రకరకాల నాగరికతల నీటి బుడగలు—రంగురంగుల రబ్బరుబెలూన్లలాగా యెగురుతున్నట్లనిపించింది.

3

ట్యూషన్ అయిపోగానే కానాయ్ ఇంటికివచ్చి, తర్వాత కాలేజీకి వెడతాడు. కాలేజీ విడిచిపెట్టగానే మళ్ళి యింటికిగాని లేకపోతే సమితికార్యాలయానికిగాని వెడుతూఉంటాడు. ఆతర్వాత ఇహ నవనాడులనూ క్రుంగతీసేట్లుండే చక్రవర్తుల గృహవాతావరణం ఎటూ తప్పదు—ఇదీ అతడి నిత్యజీవితం. ఆ వాతావరణంలో మరీ ఉక్కిరిబిక్కిరయే పరిస్థితి వచ్చినప్పుడు కానాయ్ తన వంశాన్నంతనీ తిట్టుకునేవాడు. వీధిగుమ్మందాటి రాస్తామీదికి వచ్చి నాలుగడుగులు వెయ్యగానే—రాచబాటకు రెండువైపులా ఉన్న పెద్ద పెద్ద మేడలు కంటపడేవి—ఇటుచూస్తే కాలిబాటలమీద తిండిలేక నకలకలాడుతున్న దరిద్రులు కన్పించేవారు—వెంటనే అదివరకుదాకా తనవంశాన్ని తిట్టుకోవటం అతడిమనస్సుకెంతో తప్పుగాతోచేది. మానవులు నిస్సహాయులు. కేవలం తమ పూర్వపురుషుల తప్పుమాత్రం ఏముంది? ఎప్పుడూ ఏదో ఆందోళనతో కానాయ్ క్రుంగిపోతూఉండేవాడు. దానికి కారణం అతడికి తెలును. ఆ కారణం అతడి రక్తనాళాలమాటునే ఉంది.

ఇవాళ రోజంతా చాలావరకు అతడికి ఒడుదుడుకులు లేకుండానే గడిచిపోయింది. ట్యూషన్‌జీతంతెచ్చి, ఇంట్లోకి కావలసిన సరుకులన్నీ కొనుక్కునివచ్చి, ఇంకా నాలుగు రూపాయలు సొంత ఖర్చుకోసం మిగుల్చుకొన్నాడు. కాని అది అతడితల్లికి నచ్చలేదు. ఆమెపొందిన శిక్షణ, ఆమెకు ఉన్న సంస్కృతీ రెండూ సహజంగా ఆత్మనిగ్రహంవైపుకే మొగ్గు చూపుతూ ఉంటాయి. తన కుటుంబంలోనివారి సుఖ స్వాతంత్ర్యాల కోసం,తన సర్వస్వం త్యాగంచేసి, కష్టాల్ని అనుభవించడమే ఆమెకు ఆనందంగా ఉంటుంది. అదే ఆమె ఆదర్శం. తన కొడుకుకూడా

ఆ ఆదర్శానికే బద్ధుడై ఉండాలని ఆమె ఉద్దేశం. కానాయ్‌కి ఆమెను నొప్పించటం ఇష్టంలేదు. ఆ ఆదర్శానికి కట్టుబడకపోయినా ఆమె ఆదేశాన్నిమాత్రం అతడు తృణీకరించలేడు. "నాలుగు రూపాయలెందుకు నీకు? మన సంసారంలో నాలుగు రూపాయ లంటే ఎంత విలువగలవో తెలుసా?" అన్నది తల్లి.

అదే మరొకరోజున అయినట్టయితే కానాయ్ మళ్ళీ ఆడబ్బు కావాలనేవాడుకాడు. కాని ఇవాళతడు సగం నిజంచెప్పి, ఆ డబ్బు తనదగ్గరే ఉంచుకున్నాడు. "కాలేజీలో చెల్లించాలి" అన్నాడు.

కాలేజీలో చెల్లించటానికి రెండు రూపాయలు కావల్సిన మాట నిజమే. మిగతా రెండురూపాయలు తనకు కావాలి—నీలయిచ్చిన ఆతిథ్యానికి బదులు తీర్చుకోటానికి. తానుకూడా ఆమెను ఒకరోజున కాఫీహోటల్‌కి తీసుకెళ్ళాలి. లేకపోతే భావ్యంగా ఉండదు. సాయంత్రమప్పుడు అతడు తనగదిలోకూర్చుని ఈ సంగతే ఆలోచించుకుంటున్నాడు. హఠాత్తుగా బైట ఏదో గలభా విన్పించింది. అదివిని అతడు ఉలిక్కిపడ్డాడు. ఏం జరిగింది? తనగదిలోనుంచి బయటికి వచ్చాడు. వచ్చాక ఆ గందరగోళం తమ యింట్లోదికానందుకు తృప్తిపడ్డాడు. అది ఆ మురికి పేటముందు రోడ్డుమీద జరుగుతోంది. ఎవరో విదేశీయుడు ఉరుదూలో కేకలేస్తున్నాడు. మధ్య మధ్య వచ్చీరాని బెంగాలీ పదాలనుకూడా కలుపుతున్నాడు. ఆ పేటలో ఉన్న వారిలో ఎవరితోనో అతడికి తగాదా వచ్చింది. ఆ విదేశీయుడి మాటలో ధాష్టీకం వెల్లడిఅవుతోంది. "పారెయ్, నాడబ్బు నాకు పారెయ్." అతడు డబ్బుకోసం పీడిస్తున్నాడు.

అవతలివ్యక్తి గొంతుమాత్రం హెచ్చించకుండా...అనవసర మైన వాదన చేస్తున్నాడు. మాటలన్నీ స్పష్టంగా విన్పించటంలా. అక్కడక్కడ ఒకటి రెండు మాటలుమాత్రం గట్టిగావిన్పిస్తున్నాయి విన్పించినంతవరకు—ఆ గొంతునుబట్టి, అది గీత ఆ నల్లటి

అమ్మాయి తండ్రి కంఠస్వరం అని కానాయ్ పోల్చుకున్నాడు. గీతతండ్రితో అతడికి అంత పరిచయంలేదు. కాని గీత తనచెల్లెలు—ఉమకు స్నేహితురాలు. ఒకప్పుడు ఆమె రోజూ తమయింటికి వచ్చి ఉమతో ఆడుకుంటూ ఉండేది. స్కూల్లో కొన్నాళ్ళు ఉమతో కలిసి చదువుకుంది. అప్పుడు ఎప్పుడైనా తనదగ్గిరకువచ్చి, తెలియని పాఠం చెప్పించుకుంటూఉండేది. ఆ అమ్మాయి చాలా బుద్ధిమంతురాలు. అనవసరమైన జోక్యాలకు పోయేరకంకాదు. ఎంతో అణకువగా ఉండే స్వభావం. తమ కుటుంబంలో దరిద్రం ఎక్కువవుతున్నకొద్దీ ఆమెలో ఒదిగిఒదిగిఉండే స్వభావం కూడా ఎక్కువవుతూ వస్తున్నది. ఇప్పుడు స్కూలు మానేసింది—ఇటీవల తమయింటికీ తరుచు రావటంలేదు. గీత ఎప్పుడైనా వచ్చిందంటే—ఆమె ఏదో వస్తువు అడగటంకోసమే వచ్చిఉంటుందని కానాయ్ గ్రహించేవాడు. ఆమె వీధిలో నడుస్తున్నప్పుడు ఏదో మోయలేనిభారంతో క్రుంగిపోతున్నట్లు తోచేదతడికి. అది దారిద్ర్యభారం అన్న సంగతి కానాయ్‌కి తెలుసు. దారిద్ర్యపీడనంతో గీతలోని జీవశక్తి సన్నగిలుతోంది. మరీ తిండికూడా లభించని స్థితి అయితే దాపురించలేదు. దారిద్ర్యపు అస్పృశ్యజీవితంవల్ల కలిగిన సంకోచం ఆమెముఖాన్ని తేజోవిహీనంగా చేస్తోంది. అలాంటి గీత తండ్రి కనుకే అతడు గదిలోంచి బైటికి వచ్చాడు.

అవును, గీతతండ్రే. ఓ కాబూలీవాడు అతణ్ణి రోడ్డుమీద చెయ్యిపట్టుకుని నిలవేశాడు. ఆ కాబూలీవాడికి ఎన్నో ఏళ్ళుండవు. అతడు కానాయ్‌కి రెండుపూటలా కన్పిస్తూనేఉంటాడు. రోజూ ఈ వీధికి వచ్చి, అతడు ప్రొద్దస్తమానం ఎవరి వసారాలోనో కూర్చుంటూ వుంటాడు. ఎంతో దూరంనుంచి—ఆఫ్ఘనిస్తాన్, పెషావర్ ప్రాంతాలనుంచి— అతడిక్కడికి వచ్చి వడ్డీ వ్యాపారం అనే వలపన్ని కూర్చున్నాడు. పైలాపచ్చీస్‌గా తిరుగుతూ, తమతండ్రి ఎప్పుడు చస్తాడా అని ఎదురుచూస్తూఉండే కొంతమంది ధనవంతుల బిడ్డలు ఆతగాడి దగ్గిర అప్పులు పుచ్చుకుంటూఉంటారు.

వాళ్ళేకాదు, కొంతమంది సామన్య సంసారులు—పరిస్థితులను బట్టి ఆరోజుకారోజు మరీ దరిద్రస్థితికి దిగజారిపోతూ ఉండే వాళ్ళు కూడా అతడిదగ్గిర అప్పులుచేస్తూ ఉంటారు.

గీత తండ్రి సన్నటిగొంతుతో అరుస్తున్నాడు—"నన్నుకొడితే నీడబ్బు యెక్కడినుంచైనా అమాంతం వచ్చిపడుతుందను కుంటున్నావా యేం? లేందే యెక్కడినుంచి తీసుకురమ్మంటావ్?"

"వడ్డీ అక్కడ పెట్టుముందు, వడ్డీ, రెండు నెలలనుంచీ వడ్డీబాపతు ఒక్కదమ్మిడీ అయినా యివ్వలేదు."

కానాయ్ ముందుకువచ్చి, "ఏయ్. సాయెబూ! విడిచి పెట్టు. ఏమిటిది? నీ జబర్దస్తీ యిక్కడకాదు" అని దబాయించాడు.

కాబూలీవాడు కానాయ్‌వైపుకు తిరిగి నవ్వుతూ "మావొంట్లో సత్తువవున్నంతవరకు యెక్కడైనాసరే జబర్దస్తీచేసే అధికారంవుంది మాకు" అన్నాడు.

కానాయ్‌కి శరీరమంతా విద్యుత్ ప్రసరించి నట్లయింది. అయినా అప్పటికీ అతడింకా తమాయించుకుని, చిరునవ్వుతో యింకొంచెం ముందుకు వచ్చాడు. వస్తూనే కాబూలీవాణ్ణి చెయ్యి పట్టుకుని "సరిగ్గానే చెప్పావు నువ్వు. ప్రపంచంలో అధికారం చెలాయించటానికి బలమే ప్రధానమైన అదృష్టమన్న మాట నిజమే. కాని ఆ బలమనేది మాత్రం నీ ఒక్కడి సొత్తేకాదు. విడిచిపెట్టు ముందు పెద్దమనిషిచెయ్యి విడిచిపెట్టు" అని గద్దించాడు.

కాబూలీవాడు విస్తుపోతూ కానాయ్ ముఖంకేసి చూశాడు. కానాయ్‌కన్న యెంత లేదన్నా కనీసం తానో జానెడుపొడుగు వున్నాడు. రెట్టింపు లావున్నాడు. అలాంటి తననుపట్టుకుని యితడు 'బలమనేది నీ ఒక్కడిసొత్తేకా' దని దబాయిస్తున్నాడు.

ఇలా మరొకవైపునుంచి తనకు సానుభూతిరావటం చూసి, "చూడండి, చూడండి. ఈ అత్యాచారం చూడండి! ఈ యుద్ధం

మూలంగా రెండు నెలనుంచీ వుద్యోగం కూడాలేదు. రెండు పూటలా జరుగుబాటుకే గిజాటుగావుంటే, పైగా ఈ జబర్దస్తీ చూడండి'' అంటూ గీత తండ్రి బావురుమని యేడవటం మొదలెట్టాడు.

''ఊఁ. విడిచిపెట్టు'' అని కానాయ్ కాబూలివాణ్ణి మళ్ళీ గద్దించాడు. నిజానికి కానాయ్‌నిచూసి భయపడికాదు; కాని అతడి నిర్భయత్వమూ, స్థానబలిమీ, తాను పరాయి దేశపువాడు కావటం—యివన్నీ ఆలోచించుకుని, తానెంత బలవంతుడైనా కాబూలీవాడు తన కాతాదారుడిచెయ్యి వదిలేశాడు—''సరే ఐతే. మీరు పెద్దమనుషులు. నాబాకీ మీరే వసూలు చేయించి యిప్పించండి. మీరే నాకు మధ్యవర్తి. పోనీ అసలంతా ఇవ్వలేకపోతే రెండు నెలలవడ్డీ—ఆరురూపాయల నాలుగణాలు—అదైనా యిప్పించండి. యాభైరూపాయలకీ రెండు నెలలకయిన వడ్డీ!''

యాభైరూపాయలకీ రెండునెలలకీ ఆరుంబావలా వడ్డీ! నెలకి రూపాయకి అణావడ్డీ! కానాయ్‌కి కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు. అతడితో యేమని వాదించటం? విస్తుబోయి చూస్తూ మాత్రం యెలా వూరుకోవటం? ఏమీ తోచట్లేదు. ఇహ యీగొడవంతా యింకా యెంతదూరందాకా పోతుందో:...కాని హఠాత్తుగానే తేలిపోయింది. ఆవీధి కెదురువైపు నుంచి ఒక వయసు మళ్ళినామె వచ్చిందింతలో. వస్తూనే ''ఏడీ? ఏడీ కాబూలీ సాయెబు?...ఇదుగో తీసుకోవోయ్‌బాబూ, నీరెండు నెలల వడ్డీ. తీసుకో,'' అని ఆరుంబావలా అతడి చేతిలో పడేసింది.

కానాయ్‌కి ఇదీ ఆశ్చర్యంగానే ఉంది. ఆ వచ్చినామెను కానాయ్ యెరుగు. ఆమె ఈ వీధిలోనే కొంచెంపైన ఉంటూ ఉంటుంది. ఆపేటలో ఆమెను అందరు ''బామూన్‌దీ'' అంటారు. కొంతమంది చాటుగా 'బామూన్‌దా' అనికూడా అంటూఉంటారు. ఆమెను మగరాయుడని అనవచ్చు. మగవాళ్ళలాగానే చెప్పులూ గొడుగూ వేసుకుని, ఎక్కడికివడితే అక్కడికి తిరుగుతూ ఉంటుంది.

ట్రాముల్లో, బస్సుల్లో తిరుగుతూవుండగా ఆమెను కానాయ్ చాలా సార్లుచూశాడు. సంబంధాలు, మనువులూ కుదురుస్తూ వుండటం ఆమెవృత్తి. ఏదైనా వస్తువు తాకట్టుపెట్టించుకుని, చిన్నచిన్న అప్పులిస్తూ—అలా ఓపాతిక ముప్పై రూపాయలు వడ్డీలకు తిప్పుతూ వుంటుంది, అలాంటి ఆమెకు దయాధర్మాలుంటాయని ఊహించటం కష్టం పోనీ కనీసం ఆమెను గురించి లోకులు చెప్పుకోవటాన్నిబట్టి అయినా అలా వూహించటం అసాధ్యమే. అలాంటి ఆమె వచ్చి ఆరుంబావలా ఇచ్చేసేసింది! గీత తల్లికాని, తండ్రికాని అప్పుతీసుకుని వున్నట్లయితే, ఈ డబ్బుకూడా ఇప్పుడు వాళ్ళ చేతి మీదగా ఇప్పించినట్లయితే బావుండేది.

"ఇరుగూ—పొరుగు. పైగా ఇబ్బందుల్లో వున్నారు! పెద్దమనిషినిపట్టుకుని అవమానం చేస్తున్నాడాయె—ఎలా చూస్తువూరుకోవటం! పోతేపోయింది నాడబ్బు!" ఆమె తనలోతాను ఇలా అనుకుంటూ గీత ఇంటివైపుకు వెళ్ళింది.

గీత తండ్రి ఇంట్లోకూర్చుని, 'భయంకరమైన యుద్ధం! భయంకరమైనయుద్ధం! న్యాయాన్యాయాలు నీవే విచారించు భగవాన్! నీవే విచారించు" అని ఆక్రోశిస్తున్నాడు.

కానాయ్ మనస్సులో 'బామూన్‌దీ' ఆచరణే మెదులుతోంది. ఆమె అలాచేయటం అతడి మనస్సుకు కొంతవరకు సాంత్వనగానేవుంది. ఇంటికి వచ్చికూడా అతడింకా అదే ఆలోచిస్తున్నాడు. ఆ ఆలోచనతోపాటు—అసలప్పుడు ఆ డబ్బు తాను ఇచ్చినట్లయితే బావుండేదనికూడా—అతడికి యెన్నోసార్లు తట్టింది. రేపు గీతనుపిలిచి ఆడబ్బు కాస్తా ఇచ్చేద్దామని నిశ్చయించుకున్నాడు. గదిలోంచిలేచి, ముందరి ఇంటి డాబామీదికివచ్చి నుంచున్నాడు. అక్కడనుంచుంటే గీతావాళ్ళ ఇల్లంతా కన్పిస్తోంది. గీతతండ్రి పక్కమీద పడుకుని ఆయాసపడుతున్నాడు.

ఆ అభాగ్యుణ్ణి చూస్తూంటే అతడిమనుస్సుకు చాలా వ్యథ కలిగింది. అసాధ్యమైన వ్యాధి! దానికితోడు శీతకాలం. దగ్గు—ఆయాసం సహజంగా చలికాలంలో ప్రకోపిస్తూ ఉంటుంది.

గీతతండ్రి ప్రద్యోతన భట్టాచార్యకి ఉబ్బసంకాదు. ఈ వ్యాధి మొదట ప్రారంభమయే నాటికి ప్రద్యోతనుడి సిరిసంపద లింకా చెడలేదు. దానికి తగినట్లు అతడు బహు విలాస పురుషుడు. కాశ్మీర్ శాలువలేమిటి. చెస్టర్‌ఫీల్డు కోట్లేమిటి—వేటికీ కొరత వుండేదికాదు. ఇప్పుడనేమీలేవు. కొన్నిటిని చాలాకాలం క్రితమే తాకట్టుపెట్టాడు; మళ్ళీ వాటిని విడిపించుకోలేదు. ఖరీదైన శాలువలన్నీ ఏనాడో అమ్మేశాడు, చవకరకంవి అన్నీ చిరిగిపో యాయి. ఆ చిరిగిపోయిన ముక్కలు మాత్రం మూడో నాలుగో ఇప్పటికీవున్నాయి. రాత్రిళ్ళు చలివేస్తే వాటిల్లోదే ఒకటి మెడకు చుట్టుకుని పడుకుంటూ వుంటాడు.

అతడికీ దగ్గూ—ఆయాసం, అసలు అజీర్ణం మీదినుంచి పుట్టు కొచ్చాయి. ప్రద్యోతనుడికి మంచి దుస్తులమీద మోజుకన్న, మంచితిండి మీదనే రంధి యెక్కువ. ఈ వ్యాధికి మూల కారణ మైన అజీర్ణం ఇప్పుడంత ముఖ్యంకాదు. ఇప్పుడు ముఖ్యకారణం తిని, జీర్ణంచేసుకో దగినంత ఆహారం లేకపోవటమే. ఈ అభావం వల్ల అతడిశరీరం శుష్కించింది. పొట్ట అప్పడంలాగా అంటుకు పోయింది. కడుపు నిండుగా లేనప్పుడుకూడా బీడీలు తెగకాలుస్తూ వుంటాడు. దగ్గుతూ వుంటాడు. ఆ దగ్గుతో ఆయాసం యెగే సుకువస్తుంది. గ్రుడ్లు రెండూ వూడి పడిపోతాయేమో అన్నట్లు బైటికి వెళ్ళుకొస్తాయి. చలికాలమయినా శరీరమంతా చెమట పడుతుంది. నాలుగు యెక్కిళ్ళువచ్చి యే క్షణంలో గుటుక్కుమన్నా గుటుక్కు మనవచ్చు అనిపిస్తుంది. కేవలం బీడీలు కాల్చి నందువల్లనే రోగం ఎక్కువవటంకాదు; కాని ఏమాత్రం శక్తికిమించిన వుద్రేకం కలిగినా రోగంబయటపడి ఆయా

సం ప్రారంభ మవుతుంది. దాంతోపాటు దగ్గుకూడా వుక్కిరి బిక్కిరి చేసేస్తూ వుంటుంది.

ప్రద్యోతన్భట్టాచార్యులు, కలకత్తా పరిసరాల్లో ప్రసిద్ధికెక్కిన ఓ అగ్రహారంలోని శ్రోత్రియుల కుటుంబంలో జన్మించాడు. అతడి పూర్వీకులకు మంచి మాన్యాలుండేవి, గట్టి డాబాయిల్లొకటి వుండేది. పేరుప్రతిష్ఠలు వుండేవి. అతడి ముత్తాత మంచి నైష్ఠికుడూ, ప్రసిద్ధికెక్కిన పండితుడు. ఈస్ట్ ఇండియా కంపెనీ మొదటిరోజుల్లో ఫోర్ట్ విలియం కాలేజీకి అధ్యాపకుడిగా రమ్మని అతడికి ఆహ్వానం వచ్చింది. కాని మ్లేచ్ఛుల నౌకరీ అని దాన్ని అతడు తిరస్కరించాడు. మ్లేచ్ఛులదాకా యెందుకు—శూద్రుల దానాల్నికూడా అతడెన్నడూ పట్టియెరుగడు. ఆనాటి అతడి ఆచార ప్రభావంవల్లనే ఈనాటికీ ప్రద్యోతనుడి యింట్లో వుల్లిపాయలను 'సాలిగ్రామా' లని వ్యవహరిస్తూవుంటారు. వాటికి ఆపేరు పెట్టింది మాత్రం ఆయనకాదు. అతడు చనిపోయాక అతడి కొడుకు హయాంలో, అతడి మనుమడు—అంటే ప్రద్యోతనుడి తండ్రి వాటికా పేరు కల్పించాడు.

అతడి కొడుకు—అంటే ప్రద్యోతనుడి తాత 'గురుగిరి' చేస్తూ ఉండేవాడు. ఆ రోజుల్లో కలకత్తాలోనికాయస్థులూ—వైశ్యులూ చాలామంది కంపెనీలకు బ్రోకర్లుగా వుంటూ, సంఘంలో పలుకుబడినీ, ధనాన్నీకూడా ఆర్జించారు. ఆంగ్లేయుల జీవితవిధానాలను అలవాటు చేసుకోవాలనేఆసక్తి, జీర్ణంకాని ఆధ్యాత్మిక విషయాల మీద ఆదరణ యీ రెండూ వారి ఐశ్వర్యానికీ హోదాకీ తగినట్లు సమానంగానే వుండేవి. ప్రద్యోతనుడి తాత అలాంటివారిలో తన ఉపదేశాలను బాగా విస్తరింపచేశాడు. అలా చెయ్యటంవల్ల అతడూ బాగానే లాభంపొందకలిగాడు. అదివరకున్న డాబాపైన మరో అంతస్తు కట్టించాడు. అప్పటికీ అతడికిమాత్రం మనస్సులో ఇంకా కించగానే వుండేది. తనకు శిష్యులన్న మాటేగాని నిజానికి సంఘంలోవాళ్ళే అధికులు. అంచేత తన శిష్యులు ఏ నేర్పువల్ల

ఇంత ఆధిక్యాన్ని సంపాయించగలిగారో ఆ విద్యలో తన కొడుకునుకూడా ఉత్తీర్ణుణ్ణి చేయాలనుకున్నాడు. గురుపీఠంమీద వుంటే యెన్నో బహుమతులూ, నమస్కారాలూ వచ్చేఅవకాశం వున్నప్పటికీ తన పుత్రుడికి—ప్రద్యోతనుడి తండ్రికి—మాత్రం ఇంగ్లీషు చెప్పించటం మొదలెట్టాడు. బ్రాహ్మణధర్మంలోని కట్టుబాట్లనూ, విధినియమాలను అన్నిటినీ తెంచుకుని అతడికొడుకు యెంత ఉత్సాహంతో రంగంమీదికి వచ్చాడో—అంత భాగోతం మాత్రం ఆడలేక పోయాడు. 'సాలిగ్రామా' అని పేరుపెట్టి ఉల్లిపాయలవంటకు వేరేపొయ్యి వేయించటంలో మాత్రం నెగ్గగలిగాడేకాని, ఆ కుర్రవాడు ఆ సంవత్సరం మెట్రిక్యులేషన్ మాత్రం గట్టెక్కలేకపోయాడు. అంత మాత్రాన అతకిడివచ్చిన ఆటంకమేమీలేదు. తన తండ్రిశిష్యుడైన ఒక ప్రసిద్ధుని అనుగ్రహంవల్ల ఒకవర్తకుని ఆఫీసులో నౌకరీ దొరికింది. జీతంమాత్రం ఆట్టే వచ్చేదికాదు. అంచేత తండ్రి చనిపోగానే దొరల పద్ధతిని ముందు క్రాపూ—తమ సంప్రదాయానికి అనుగుణంగా వెనక కాస్త పిలక పెట్టించుకుని ఇంట్లో దేవతార్చన మొదలైనవి చేస్తూ పైసంపాదనకు, పౌరోహిత్యాన్ని ఉపవృత్తిగా స్వీకరించాడు.

అతడి కొడుకు ప్రదోతన భట్టాచార్యుడు.

ప్రద్యోతనుడి తండ్రి తనకొడుకును స్వతంత్ర వ్యాపారిని గాని, బ్రోకర్నిగాని చెయ్యాలను కున్నాడు. స్వతంత్ర వ్యాపారం మీదనే ప్రబలమైన వాంఛవుండేది. అప్పటికి బెంగాలీ ధనిక వర్తకులు కుర్చీలూ-బల్లలూ వేసి దొరలపద్ధతిని ఆఫీసులు పెట్టటం మొదలెట్టారు. పెట్టుబడి పెట్టటానికి డబ్బులేదు కనుక, ప్రద్యోతనుడి తండ్రి బ్రోకర్ వ్యాపారమే భేషయిందనుకున్నాడు. తాను గుమాస్తాగా వుంటూ సంపాయించిన అనుభవాన్నిబట్టి, కొనేవాడి దగ్గిర-అమ్మేవాడిదగ్గిర చెయ్యిచాస్తే రెండువైపులనుంచీ కొద్దో గొప్పో లాభిస్తుందని బాగా తెలిసివచ్చింది. బ్రోకర్లకు వచ్చే కమీషనూ, మామూలు వర్తకులకు వచ్చే లాభాలు బేరీజువేసి చూసు

కుని, చివరకి కొడుకును బ్రోకర్నే చెయ్యాలనే నిర్ణయానికి వచ్చాడు. బ్రోకరుకి ముఖ్యంగా కావలసిన మూలధనం మాటల మూట-అంటే మాటలుచెప్పి యెదుటివారిని ముగ్ధుల్ని చెయ్యగలిగి వుండాలి. ఆధనం ప్రద్యోతనుడికి కావలసినంతవుంది. ఇహా ప్రద్యోతనుడు కేవలం 'సాలిగ్రామా' లతోనే తృప్తిచెందక మరో మెట్టు పైకియెక్కి, 'పురోడాశం' కూడా రుచి చూడసాగాడు. ఉన్న పిలకను మొదలంట కత్తెరేయించు కున్నాడు.

ప్రద్యోతనుడి ముత్తాతపేరు హరిదాసు. తాత పేరు నవీన్‌బాబు. అతడి కొడుకు చారుచంద్రుడు. చారుచంద్రుని పుత్రుడు ప్రద్యోతనుడు—ఇతడే ఇప్పుడు బ్రోకర్ వ్యాపారం మొదలెట్టాడు. మొదటిరోజుల్లో అతగాడికి వ్యాపారంలో బాగానే లాభం కన్పిస్తూవచ్చింది. సాయంత్రమయేసరికి రోజూ అంతో యింతో కమీషన్‌డబ్బు జేబులోవేసుకుని ఇంటికి వస్తూవుండే వాడు. అతిగా తినటం అప్పుడే అలవాటయిందతడికి. శరీరంలో వ్యాధి బీజాలూ అప్పుడే ప్రవేశించాయి. పార్టీలను పెద్దపెద్ద హోటళ్ళకు తీసుకువెళ్ళి, వాళ్ళతోపాటు తానుకూడా చాప్సూ-కట్‌లెట్సూ తింటూ వుండేవాడు.

బ్రోకరు వ్యాపారంలోంచి క్రమంగా 'సేల్ పర్చేజ్ బిజినెస్' చెయ్యటం మొదలెట్టాడు. అప్పుడీ చోప్సూ—కట్‌లెట్సూ తినటం అభ్యాసంగా పరిణమించింది. తర్వాత ఒకప్పుడు—వ్యాపార యుక్తులలో పరిపూర్ణ ప్రజ్ఞావంతుడనయినా ననుకుని, అప్పులవాళ్ళ నెత్తిన మాత్రం చెయ్యిపెట్టి, తనకురావలసినవి మాత్రం చాటుగా రాబట్టుకుందామన్న ఊహతో ఐ. పి. దాఖలు చేసి, పిత్రీయమైన ఇల్లు అమ్మేసి, కలకత్తాలో భార్యపేర ఒకటో రకం మేడకొన్నాడు. ఆ క్రొత్తమేడలో కూర్చుని, కుర్మా, పలావ్, కట్‌లెట్సూ—మొదలైన మత్స్యమాంసాలతో తయారైన తిళ్ళుమాత్రమే తింటూ, నిర్వ్యాపారంగా కాలక్షేపంచెయ్యటం మొదలెట్టాడు. ఆ రోజుల్లోనే వ్యాధిబీజాలుమొలకలు పోసుకు

న్నాయి పొట్ట వుబ్బరిస్తూవుండేది. కూర్చున్నవాడు కూర్చున్నట్లే వాంతులుచేసుకునేవాడు.

అటునుంచి దర్యాప్తు ప్రారంభమయింది. తెలివిగా మోసగించటంలో అతడి చేతకానితనం బయటపడి, మోసం వెల్లడై అసలు ఫాయిదాలతోసహా కోర్టు ఖర్చులుకూడా కట్టాల్సివచ్చింది. దాంతో బ్యాంకిలో పెళ్ళాంపేర దాచిన డబ్బు ఖాళీ అయింది. చివరకు ఆమె పేరవున్న మేడకూడా అమ్మి, అప్పులవాళ్ళకికట్టి నడివీధిలో నిలబడాల్సిన గతిపట్టింది. ప్రద్యోతనుడు అప్పటికీ అలవాటుమూలంగా బజారులో చవకగాదొరికే నూనెతో తయారైన చిరుతిళ్ళు తింటూ, కట్ లెట్స్‌మీది వ్యామోహాన్ని తగ్గించుకున్నాడు. అంతర్గతంగావున్న వ్యాధి యీదశలో పల్లవించింది. వాయువు ప్రకోపించి, దగ్గు—ఆయాసం అప్పుడే ప్రారంభమయింది.

తర్వాతకూడా మళ్ళీ ప్రద్యోతనుడికి నౌకరీ దొరకింది. ఇల్లుపోయింది కనుక, కలకత్తా శివార్లలోనే ఎక్కడో ఒక ఇల్లు అద్దెకుపుచ్చుకుని, దగ్గు—ఆయాసాన్ని వెంటపెట్టుకుని ఆలాగే ఆఫీసుకు వెడుతూవుండేవాడు. నూనె సరుకులు తినటం అప్పటికీ మానలేదు. అప్పుడప్పుడు చవకవస్తువుల మార్కెట్‌కి వెళ్ళి బురదచేపల్నికూడా కొనుక్కు తెచ్చుకుంటూ ఉండేవాడు. అతడి జీవితం బహుశా ఇలాగే గడిచిపోయేదేమో! కాని హఠాత్తుగా పోలెండ్ గడ్డమీద ఎక్కడో ఒకమూల యుద్ధం ప్రారంభమయింది. మందు గిడ్డంగికి నిప్పు అంటుకున్నట్లు-చూస్తూ చూస్తూండగానే ఆ యుద్ధజ్వాలలు యూరప్ అంతటా వ్యాపించాయి. వాటి తాలూకు వేడి భారత దేశానిక్కూడా సోకింది. ఎన్నో వేలమైళ్ళ దూరాన— ఎక్కడో బయలుదేరిన యుద్ధజ్వాలలకు—మధ్య ఏడు సముద్రాలడ్డంవున్నా—ఇక్కడి వెండి బంగారలన్నీ కరిగి ప్రవహించ సాగాయి. వర్తకమాంద్యం ఏర్పడింది. రిట్రించ్‌మెంట్ ప్రారంభమయింది. అది ప్రారంభంకాగానే ప్రథమ కబళంకింద ప్రద్యోతనుడి ఉద్యోగం

కాస్త వూడింది. ఉద్యోగంపోగానే ఈ మురికిపేటకు మకాం మార్చుకున్నాడు. ఇప్పుడసలు బొత్తిగా డబ్బు లేకపోవటం మూలంగా చిరుతిళ్ళేమీ తినటం లేదు. అసలు రెండుపూటలా తిండికే గిజగిజగావుంది. అయినా రోగం మాత్రం పెరిగి పెద్ద వృక్షంలా అయింది. అతి—తిండివల్ల ఆరంభించిన వ్యాధి, అసలు తిండిలేనిదశలోకూడా వృద్ధిఅవటం మానలేదు. ఆ వృక్షం తాలూకు వేళ్ళు బక్కచిక్కిన అతడి శరీరంలో ప్రతి కోశానికీ వ్యాపించి అక్కడవుండే రసాన్నంతనీ పీల్చుకున్నాయి. ఇంక అవి జీర్ణకోశంలోని అజీర్ణరసాన్ని కూడా ఏమాత్రం మిగల్చలేదు.

గీతతల్లి సరోజని నూనె కొంచం వెచ్చచేసి తీసుకువచ్చి ప్రద్యోతనుడి రొమ్ముకు రాస్తోంది. పదమూడేళ్ళ కొడుకు అతడి తల్లిదగ్గిర విసురుతూ నుంచున్నాడు. గీత ఆదరాబాదరా నీళ్ళు వెచ్చచేస్తోంది. వేడి నీళ్ళలో కొంచెం సోడా-బైకార్బ్ వేసి యిస్తే ఆయాసం కాస్త తగ్గుతుంది. కాని ఇవాళ అదికూడా లేదు—ఒట్టి వేడినీళ్ళే. వాటి మూలంగామాత్రం కాస్త ఉపశాంతిగా వుండకపోతుందా అని ఆశ.

బామూన్‌దీ అక్కడే కూర్చుని, ఎన్నెన్నో కబుర్లు చెపుతూ అతడిని ఓదార్చుతోంది. ప్రద్యోతనుడితో ఆమెకు బాగా పరిచయంవుంది. అతడు ఆయాసపడుతూనే "ఇంక మీరు వెళ్ళిరండి" అన్నాడు.

"అలాగే వెళ్ళివస్తా...ఇదుగో హీరేన్! నా తో రా నాయనా! ఓ శేరు బియ్యం తీసుకొద్దువుగాని" అన్నదామె.

ప్రద్యోతనుడు మళ్ళీ ఆయాసం ఎగేసుకువచ్చి కాబోలు అట్టువైపుకు ఒత్తిగిలి పడుకున్నాడు.

౪

కానాయ్ మర్నాడు ప్రొద్దున్నే లేచి, చొక్కా తొడుక్కుని, చేత్తో జేబుతడుముకుని, త్రుళ్ళిపడ్డాడు. ఏదీ తనడబ్బు? ఏమయిపోయింది? ఎవరు తీసుకున్నారు? మరుక్షణంలో తనలో తానే జాలిగా నవ్వుకున్నాడు. తీసుకునే వాళ్ళకేం తక్కువ తన ఇంట్లో? అయితే దాసీవాళ్ళుమాత్రం ఎవరూ లేరింట్లో. వాళ్ళు కాక మరెవరో తీసుకునివుంటారు. ఎవరు తీసుకున్నదీ కని పెట్టాలంటే మాత్రం షెర్లాక్ హోమ్సుకయినా తరంకాదు. ఒక్క సారి పెద్దగానిట్టూర్చి, గదిలోంచి బైటికివచ్చాడు. ఈ వెళ్ళటం వెళ్ళటం మళ్ళీ ఇహ ఈ ఇంటికి రాకూడదనే బుద్ధికూడా పుట్టింది.

"కానూ!"

కానాయ్ వెనక్కి తిరిగిచూశాడు. తల్లి వస్తోంది. అక్కడే ఆగాడు. ఆమె దగ్గిరకు వచ్చింది.

"ఏమిటి?" అని అడిగాడు కానాయ్.

"ఏంలేదు. రాత్రివచ్చి ఆ నాలుగు రూపాయలూ నేనే తీసి కెళ్లాను."

కానాయ్ ఆమె ముఖంకేసిచూస్తూ వూరుకున్నాడు. ఏం మాట్లాడలేదు. కాని అతడి చూపుల్లో వేడిమాత్రం వ్యక్తమవు తోంది.

"కాలేజీలో చెల్లించవలసింది వచ్చే నెలలో చెల్లిద్దువుగానిలే. అలా చూస్తావేమిటి? సంసారంసంగతికూడా కాస్త ఆలోచించాలి మరి!"

"నిజమే—మరి నాసంగతి ఆలోచించేదెవరమ్మా?" అని కానాయ్ నవ్వాడు.

"ప్రపంచంలో అన్నిటికన్నా స్వార్థ త్యాగమే ఉత్తమధర్మం నాయనా!...నువ్వు ఇదివర కిలా వుండేవాడివి కాదు. ఇలా మారి పోతున్నావు ఎంచేత?"

కానాయ్ సమాధానమేమీ చెప్పకుండానే బైటకి వెళ్ళి పోయాడు.

ఇవాళ ఆదివారం, వస్తుతః ట్యూషన్‌కి వెళ్ళాల్సిన అవసర మయి తేలేదు. కాని శిష్యుడికి పరీక్షలు దగ్గిరకు వస్తున్నాయి; అందుకని ఆదివారమయినా వెడుతున్నాడు. ఇవాళ ఆదివారం అయినందున అతడి మనస్సు కుదటపడింది. నీల కంటపడుతుం దేమో అనే సంకోచం అక్కర్లేదు. ఆఫీసులకు సెలవు ఇవాళ.

కానాయ్ దురదృష్టం, నీల ఇవాళకూడా కేశవసేన్ స్ట్రీట్ మొగలో నిలబడివుంది. ఆమె ఒక్కతేకాదు. నేపీకూడా వున్నాడు. నేపీ వ్రేలితో నిర్దేశిస్తూ ఆమెకు ఎవర్నో చూపిస్తున్నాడు. అతడు చూపిస్తున్నది తననేనని కానాయ్ మరుక్షణంలోనే గ్రహించాడు. నీల, నేపీ ట్రాంయెక్కగానే "అరె! మీరేనా?" అని పలకరించారు.

కానాయ్ ముఖం చిన్నపుచ్చుకుని "ఆఁ...మీరు ఎందాకా వెడుతున్నారు? ఇవాళ ఆదివారంగా!" అన్నాడు.

"అదేమిటి? మీరు రావటంలేదా?" నీల ఆశ్చర్యపోతూ అడిగింది.

కానాయ్‌కి చటుక్కున గుర్తుకొచ్చింది. తమసమితి ఆధ్వ ర్యాన ఇవాళ ముఖ్యమైన సభ ఒకటి జరుగుతోంది; మేదినీపూర్ జిల్లాలోని తుపానుబాధిత ప్రాంతాలకు సహాయం పంపటం విషయమై చర్చ—కాదు ప్రతిఘటనంటేనే బావుంటుంది. కానాయ్ కొంచెం నిరుత్సాహంగా నవ్వి "ఓ! ఇవాళ మీటింగ్ సంగతా మీరనేది?" అన్నాడు.

"అవును, అదే. ఉపన్యాసకులలో మీరుకూడా ఉన్నారు."

"ఉన్నాను. కాని—"

" 'కాని' ఏమిటి? మీరు నిజంగానే రావటంలేదా? విజయదా లేడివాళ—అసలు కలకత్తాలోనే లేదు. మీరుకూడా రావటం లేదా? అదేమిటి?" నీల ఉత్తేజితురాలయింది—ట్రాములో ఇంకా జనం వున్నారన్న సంగతికూడా మరిచిపోయిందల్లేవుంది.

సేపీ కంగారుగా అతడి చేతులు పట్టుకుని "కాదు, కానాయ్‌దా; అలా పిల్లేదు. మీరు తప్పక రావాలి" అన్నాడు.

"వచ్చి ఏంచెయ్యను? అక్కడికివచ్చి, ఘాటుగా ఓ ఉపన్యాసం ఇచ్చినంతమాత్రాన వాళ్ళకష్టాలు తీరుతాయా? లేక ఈ మాత్రానికే ప్రభుత్వంవారు కంగారుపడిపోయి సహాయం చెయ్యటానికి పరుగెడతారా? ఇదంతా నాటకంలో 'భీముడి' పాత్రాభినయంలా ఉంటుం' దనిపిస్తోంది నాదృష్టికి." "కాని ప్రభుత్వ విధానాలను ప్రతిఘటించటానికి మనకున్న కొద్ది అధికారాలనయినా వినియోగించుకోకపోవటం కాపురుషత్వమే— ఆః కచ్చితంగా కాపురుషత్వమే అనిపించుకుంటుంది" అని నీల ముఖం అటువైపుకు తిప్పుకుని కూర్చుంది.

కానాయ్ స్తబ్ధులా కూర్చున్నాడు. ఆ తర్వాత సేపీకయినా మాట్లాడటానికి మంచి వీలు చిక్కలేదు. ట్రాములో జనం అప్పుడే ఈ సంఘటనకు చిలవలూ-పలవలూ కల్పించి, గేలిచేస్తూ చర్చించుకుంటున్నారు. నిగ్రహం పేరుతో, శ్లీలత పేరుతో —సాంఘిక శాసనాల మధ్య, అనేక బంధనాలతో బంధింపబడి మనస్సులలోనే అణగివుండే మానవుడు వాంఛలు చర్చలరూపంలో బైట పడుతూ ఉంటాయి. త్రాళ్ళతో పూర్తిగా బంధింపబడిన మానవుడు బంధనాలకు అలవాటుపడ్డా ఆ బంధనాలను మధ్యమధ్య పళ్ళతో కొరుక్కుంటూనే ఉంటారు.

ఎవరో మాట్లాడుకుంటున్న ఒకటి రెండు మాటలు చెవిని పడ్డాయి—"ఇప్పుడు ప్రతివాళ్ళకీ రాజకీయాల రంధేనోయ్; కాకపోయినా మరీ చవకయి పోయాయ్‌లే."

"ముఖ్యంగా వీళ్లాపార్టీయే— వీళ్ళపార్టీలో అసలు మగ వాళ్ళ కన్న ఆడవాళ్ళే యెక్కువటగా;" అంటున్నారు ఒకరు.

ట్రామ్ గోల్‌దీఘి దగ్గరకువచ్చి ఆగింది. ఎదురుగానే కోల్‌టోలా స్ట్రీట్. నీలా నేపీ, ఇద్దరూ దిగారు, 'యూనివర్సిటీ' ఇన్‌స్టిట్యూట్'లో సభ.

'బాప్ రే! వీళ్ళ వరవళ్ళను ట్రామంతా కదిలిపోయింది' అన్నారు ఒకరు.

కానాయ్ ఊరికే చూస్తూ కూర్చున్నాడు.

ట్రామ్ మెడికల్ కాలేజీ దాటివచ్చింది. కుడివైపున శివమందిరం. ఇటుప్రక్క మెడికల్ కాలేజీ ప్రహారి ప్రక్కనే కాలిబాటమీద పల్లెలనుంచి వలసవచ్చిన జనం గుంపుకూడారు. ఒక స్త్రీ గుండెలుబాదుకుంటూ ఏడుస్తోంది. ఆదృశ్యం చూస్తుంటే కానాయ్‌కి జాలేసింది. ఆతడు ట్రామ్‌లోంచి దిగాడు.

"అయ్యో, నాతండ్రీ! అయ్యో, నాబంగారు తండ్రీ! అంత తుపానులోంచికూడా నిన్ను బ్రతికించి తెచ్చుకున్నాగదరా! బాబు!" అని గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది.

వీళ్ళలో చాలామంది మేదినీపూర్ ప్రాంతాల జనం— వాళ్ళ కొంపా-గూడూ నేలమట్టమయినాయి. గొడ్డూ—గోదా కొట్టుకుపోయాయి. వరదలకు పొలాలన్నీ ఇసకమేటేశాయి. తిండిలేదు—తిండిదాకా యెందుకు—మంచినీళ్ళు తాగి దప్పిక తీర్చుకునే ఉపాయమైనాలేదు. ఎటుచూసినా అంతా ఉప్పునీరే. మేదినీపూర్‌నుంచి ఇంతదూరం వీళ్ళు తిండికోసం వెతుక్కుంటూ వచ్చారు. ఆ స్త్రీ పొద్దున్నే తమ జట్టులోంచి చీలి, ఆకలిబాధతో ఎంగిలిమెతుకులకోసం ఎవరి గుమ్మంలోకో వెడుతోంది. బక్క చిక్కినబిడ్డ తల్లి వెనకాలే నడుస్తూ రోడ్డు దాటపోతూ లారీక్రింద పడ్డాడు.

ఈ సంఘటన తన కళ్ళముందే జరిగిన ఒక దుకాణదారు— "అవునవును. దాటుతూ దాటుతూనే పడిపోయాడు" అన్నాడు.

"లారీనంబరు రాసుకోలేదుటండీ?" అన్నాడొకడు.

"రాసుకోలేదా? రాసుకున్నాం. పిండి మిల్లు లారీ—మైదా బస్తాలు వేసుకుపోతోంది. నంబరు—"

కానాయ్ వెనిక్కి తిరిగాడు. ట్రాంకోసం ఎదురుచూస్తూనుంచోటానికిష్టంలేకపోయింది. గబగబానడిచి 'యూనివర్సిటీఇన్‌స్టిట్యూట్'కు వచ్చేశాడు. సభ అప్పటికే ప్రారంభమైంది. నేపీ వాలంటీర్‌లాగా జనాన్ని సర్దికూచోపెడుతున్నాడు. కానాయ్‌ని చూసేసరికి అతడి ముఖం విప్పారింది. కానాయ్ చిరునవ్వునవ్వి, ఒక ప్రక్కకువచ్చి కూచున్నాడు. సుప్రసిద్ధరైతు నాయకుడు నురుల్‌హక్ ఉపన్యసిస్తున్నాడు. ప్రభుత్వాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తూ, ప్రాథమిక హక్కుల మీద గట్టిగా బల్లగుద్ది మాట్లాడుతున్నాడు." ప్రపంచములో మనమూ మానవులమే. మనకూ జీవించేహక్కు ఉంది. మనంకూడా ప్రపంచంలో సాటిదేశాల ప్రజలవలె జీవించాలని కోరుతున్నాం. మనమెందుకు చావాలి? మనమెందుకు పీడింపబడాలి? ఇది అన్యాయం—మహాఅన్యాయం. దీన్ని మనం ప్రతిఘటించాలి."

వేదికకు క్రిందుగా ఒకవైపున టేబిల్ చుట్టూ పోలీసు ఉద్యోగులు కూర్చుని, షార్ట్ హాండ్ నోట్స్ తీసుకుంటున్నారు. ఆ సాంకేతిక పదాలను మామూలు భాషలోకి మార్చుకుని, ఆ ఉపన్యాసకుడు ఎంతవరకు చట్టాన్ని ధిక్కరించి మాట్లాడిందీ అప్పుడు నిర్ణయిస్తారు. మరొకవైపున పత్రికావిలేఖరులు కూర్చున్నారు.

ఆ నాయకుని ఉపన్యాసం పూర్తికాగానే నీల మైక్ ముందరకువచ్చి నిలబడింది. ఇవాళ 'ఎనౌన్స్' చేస్తున్నది ఆమే." తర్వాత మా సహచరులు శ్రీకానాయ్‌చక్రవర్తి మాట్లాడాల్సిందసలు. కాని ఆయనరాలేదు.ఆయన బదులు మా మరొక సహచరులు మిస్టర్ రహమాన్‌మాట్లాడతారు."..."ఇలాసభజరిపిఉపన్యాసలిచ్చినంత మాత్రాన జరిగేదేమీలేదని మాకుతెలుసు. కాని ప్రతిఘటించటానికి మనకుగల హక్కును ఎందుకు వదులుకోవాలి? ప్రతిఘటన

వల్ల ఫలితం ఏమీవుండదని నిరాశతో ఏమీ చెయ్యకుండా ఇంట్లో కూర్చోటంకూడా అవిటితనంలాంటి ఒక రకమైన వ్యాధే అంటాను. కాపురుషులయినా ఏనాటికయినా సాహసించి వీరుల్లాగా నిలబడగలరు; కాని ఇలాంటి వ్యాధిగ్రస్తుల విషయంలో మాత్రం అలాంటి ఆశలు పెట్టుకోనక్కర్లేదు. వారు జీవించివున్నా మృతప్రాయులే.''

హాల్లో జనంమధ్యనుంచి దారిచేసుకుంటూ కానాయ్ ముందుకువచ్చి నిలబడ్డాడు. అతడు రావటంతోనే నీలముఖం వెలవెలపోయింది. వెనుకనుంచి అధ్యక్షుడు 'కానాయ్‌బాబు' అని మెల్లిగా చెప్పి అడుగోఅని వేలితో చూపించాడు. నీల అప్పటికీ మాట్లాడలేదు. అప్పుడిహ అధ్యక్షుడే లేచి, ''కానాయ్ బాబు వచ్చారు. కనుక కార్యక్రమం ప్రకారం, ముందు ఆయనే మాట్లాడతాడు. ఆతర్వాత మిస్టర్ రహమాన్ మాట్లాడతారు'' అని చెప్పాడు.

కానాయ్ మైక్ ముందుకువచ్చి నిలబడ్డాడు.

అతడు పెద్ద మాట్లాడిందేమీలేదు. ఇంతకుముందు జరిగిన సంఘటనుగురించి నాలుగు ముక్కలుచెప్పి, మేదినీపూర్‌నుంచి తిండి వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చిన ఆకుర్రాడు ఆఖరికి ఆహార పదార్థాలు—మైదాబస్తాలను—వేసుకుపోతున్న లారీక్రింద నేపడి మరణించాడు—అన్నమాటకూడా చెప్పాడు. ''ఈసంఘటనని చూస్తూంటే 'బ్రిటిష్ నౌకలన్నీ ఆహారపధార్థాలను తీసుకొచ్చి ఇంగ్లండ్‌లోని అన్ని రేవుపట్టణాలలోనూ కుమ్మరిస్తున్నాయి; కాని దుర్భిక్షంతో పీడింపబడుతున్న మాదేశంలో వారికి ఒక జిల్లానుంచి మరొకజిల్లాకు ఒక్క బండి ధాన్యమైనా చేర్చేందుకు అధికారం లేదు-'' అని శ్రీ రవీంద్రులు మిస్ రాథ్‌బోన్‌కు ఉత్తరములో రాసినమాటలు జ్ఞాపకం వస్తున్నాయి అని చెప్పి ముగించి, మైక్ ముందునుంచి వచ్చేశాడు.

నేపీ బయటగేటుదగ్గిర నుంచిని ఉన్నాడు. అతడు కానాయ్ రెండుచేతులూపట్టుకుని ఉద్రేకంతో''చాలా బాగుంది కానాయ్‌దా:''

అని మాత్రం అన్నాడు. అంతకన్న ఎక్కువ మాట్లాడలేక పోయాడు. ఎప్పుడూ మాట్లాడికూడా ఎరగడు. అతడిలో ఉత్సాహమూ ఉంది. ఉద్రేకమూ ఉంది. కాని అవి రెండూ అతడి కళ్ళలోనూ, ముఖంలోనూ మాత్రమే వ్యక్తమవుతాయి. అంతే, పాపం మాటల్లో వ్యక్తంచెయ్యలేడు. సహనత, సౌహార్ద్రిత మొదలైన ఆదర్శాలప్రభావం చిన్నప్పటినుంచీ అతడిమీద ఎంతబాగా ప్రసరించిందంటే, అతడిలో ఎంతజీవశక్తిఉన్నా అసలు పైకి ఉన్నట్లే కనపడదు. వెనుకముందులు ఆలోచించకుండా దేనికైనాసరే చొరవగా ముందుకు వస్తాడు. విధి-విరామం ఎరగకుండా పాటుపడతాడు. అయినా అతడిచేతల్లో ఆడంబరమేమీ కన్పించదు.

కానాయ్ స్నేహపూర్వకంగా "నీకు బాగుంటే నాకదే సంతోషం" అన్నాడు.

నేపీ అమాయకుడిలాగా నవ్వాడు. అది అతడి స్వభావం.

"సరే—నేనింక వెడతాను."

"ఒక్క మాట అడగాలనుకుంటున్నాను కాసూదా!"

కానాయ్ నవ్వుతూ "అడుగు" అన్నాడు.

"మేదినీపూర్‌కి రిలీఫ్‌వర్క్‌కోసం పార్టీనుంచి కొంతమంది వర్కర్లను పంపాలి. మీరు వెడతారా లీడర్‌గా? లేక—" అంటూ నేపీ బూట్ పైఅంచున అంటుకున్న మట్టి బెల్లికలను తీసి రోడ్డుమీదికి విసిరేస్తున్నాడు. నేపీ సిగ్గుపడుతున్నాడని కానాయ్‌కి స్పష్టంగా తెలిసిపోయింది నేపీ సిగ్గుపడుతున్నాడంటే—తప్పకుండా అది అతడి స్వవిషయమై ఉంటుంది. ఆ సంగతి కానాయ్ సులభంగానే ఊహించగలిగాడు.

కానాయ్ నవ్వుతూ "లేక—నిన్నే పార్టీలోకి తీసుకోమని చెప్పనా ఏం?" అని అడిగాడు.

"ఊఁ"

కానాయ్ దీర్ఘంగా నిట్టూర్చి, నీ సంగతి చెప్పమంటే చెపుతాను : కాని నాకు రావటానికి వీలుండదు తమ్ముడూ! నాస్టూడెంట్‌కు పరీక్షలు దగ్గిర కొచ్చేశాయ్'' అన్నాడు.

ఇలా మాట్లాడుతుండగానే తనకు చాలా ఆలస్యమైపోయిందని కానాయ్‌కి గుర్తుకొచ్చింది. ''సరే, అలాగే'' అంటూ అతడు ముందుకు సాగాడు.

నేపీ మెదలకుండా అక్కడే నుంచున్నాడు. లౌడ్‌స్పీకర్‌లో కామ్రేడ్ రహమాన్ ఉపన్యాసం విన్పిస్తోంది. దానికేం కాని, కానాయ్ చివరికన్న మాటల్లో జాలికలిగించేదేదో సూచనగా వ్యక్తమయింది. అంచేత నేపీ కొంచెం పరధ్యానంలో పడ్డాడు. నీల పిలుపుతో అతడి పరధ్యానం వదిలింది.

''నేపీ :''

''దీదీ ?''

''కానాయ్‌బాబు వెళ్ళిపోయారా ?''

''ఆ.''

నీల ఏమీ మాట్లాడకుండా కాస్సేపు అలాగే నిలబడిపోయింది. తర్వాత తనంతటతానే తన జడత్వాన్ని ఎలాగో వదిలించుకుని మీటింగ్ వైపుకు వెళ్ళింది.

నేపీ మాటలతో కానాయ్ మనస్సు కదల బారింది. అతడి జీవితం విషాదాంతంగా పరిణమించే శోచనీయస్థితికి దిగజారుతోంది. ఒక వైపునుంచి బయటిపిలుపు విన్పిస్తోంది. మరొక వైపునుంచి తమయింటితాలూకు వెయ్యిబంధనా లతడ్ని కట్టి వేస్తున్నాయి. తల్లి తన ఆదర్శంతో అతడ్ని బంధించి తన మార్గానికి లాక్కుపోతోంది. కేవలం ఇంటి కోసమని అతడీ ట్యూషన్ చెపుతున్నాడు....కాలేజీ స్ట్రీట్ దాటి, సెంట్రల్ ఎవెన్యూ కాలి బాటమీది కొచ్చేసరికి కానాయ్ ఉలిక్కిపడ్డాడు. ఇదేమిటి ? సైరన్ మోగుతోందిలా ఉంది! సైరన్ !

అతడిభ్రమ మరుక్షణంలోనే తొలిగిపోయింది. సైరన్ కాదది, అమెరికన్ మిలిటరీలారీ హారన్: వాళ్ళ హారన్‌లన్నీ అంతే! పెద్దపెద్దలారీలు వరసగా పోతున్నాయి.

ఎదుట కంట్రోల్ దుకాణంముందు పెద్ద క్యూ నిలబడి ఉంది—ఆడవాళ్ళక్యూ, హిందువులు-ముస్లింలు, హిందుస్తానీలు-బెంగాలీలు స్పృశ్యలు-అస్పృశ్యలు అన్ని తెగలకు చెందిన దానీ వాళ్ళూ అక్కడ నిలబడివున్నారు. సామాన్య కుటుంబాలకు చెందిన బాలికలు, సధవలు, విధవలూకూడా వరుసలో నిలబడి ఉన్నారు. ఎవరికీ ముసుగులుకాని, మేలిముసుగులుకాని, బురఖాలుకానిలేవు. తైలవిహీనాలైన వారి కేశాలు చిక్కుపడి, శీతగాలికి చిందర వందరగా రేగిపోతున్నాయి. వారిముఖాల్లో అంతులేని ఆదుర్దా వ్యక్తమవుతోంది. ఈ దుకాణంముందునుంచి ఈచెరవదిలిపోవటం ఎప్పటికో! ముఖాలు పైకెత్తి కళ్ళప్పగించి చూస్తూ నిలబడ్డారు. బహుశా వారి అవగుంఠనాలు, బురఖాలూ శాశ్వతంగా జారిపోయాయేమో! అవగుంఠనాలనుంచి విముక్తి వారికీ పరమ దుర్గతిమధ్య లభించింది. కానాయ్ ముఖంలో నవ్వుకన్పించింది—బాధాకరమైననవ్వు అది! కాలిబాటలమీదపడి ఉన్నవాళ్ళందరూ తిండిలేనివాళ్ళూ కొంపలులేనివాళ్ళే. బిచ్చమెత్తు కోవటం వాళ్ళవృత్తికాదు. కాకపోయినావాళ్ళు ఈనాడు బిచ్చగాళ్ళయినారు.

భయంకరమైన పరిస్థితులు. ప్రపంచానికిదివరకెన్నడూ ఇంత దుర్భరమైన పరిస్థితులు దాపురించలేదు. వీటినుంచి తప్పించుకుని బయటపడే ఉపాయంలేదు. యుద్ధంచేస్తున్న జాతులు—జాతులుకాదు-ఆ జాతినాయకుల సంజ్ఞలతో వారంతా పరస్పర ప్రతిహింసా భావంతో, పరివేదనతో, బ్రతకాలనే ఆందోళనతో, ప్రాణాలుగ్గపట్టుకుని పరుగెడుతున్నారు. ప్రపంచం లోని జీవశక్తినంతనీ తమ వెంట పరుగెత్తిస్తున్నారు. ఒక్క సంవత్సరం ఇరవై సంవత్సరాల పెట్టుగాఉంది. ఇరవై ముప్ఫై

సంవత్సరాల కలిమిబలిమి యావత్తూ ఒక్క సంవత్సరంలో హరించుకుపోయింది. ఇనుము రాగి, వెండి, బంగారం-అన్నీ ఆఖరయిపోయాయి. అంతదాకా యెందుకు ఇరవై సంవత్సరాలపాటు ఉపయోగపడే మానవుడి పరిశ్రమశక్తి అంతా ఒక్క సంవత్సరంలో నశించిపోయింది. ధనికుల ఇరవై సంవత్సరాలలో ఆర్జించగలిగినడబ్బంతా ఈ ఒక్క సంవత్సరంలోనే సంపాయించారు. పేదవాళ్లు మాత్రం ఈ ఒక్క సంవత్సరంలోనే ఇరవై సంవత్సరాల వంచనకు గురిఅయినారు. ' ఇరవై సంవత్సరాల అన్నదారిద్ర్యం, వస్త్ర దారిద్ర్యంతోపాటు, జీవితపు చివరిఘడియలు కూడా హఠాత్తుగా భయంకరరూపం దాల్చి, ప్రపంచ ప్రజానీకంమీదకి—ముఖ్యంకా ఈ అభాగ్యదేశంలోని దౌర్భాగ్యుల మీదికి—దురాక్రమణను సాగిస్తున్నాయి.

౫

ఈ యిరవై సంవత్సరాల పతనస్థితి చక్రవర్తుల గృహానికికూడా త్వరలోనే ప్రాప్తించేట్లుంది—చక్రవర్తుల గృహంకూడా ప్రపంచలో అంతర్భాగమే. ఇప్పటికీ వారికి ఇంకా అక్కడక్కడ చింకిచదరల్లాగా మిగిలివున్న భూమిని అమ్మటానికి ఆలోచనలు జరుగుతున్నాయి.

రెండు వారాలనుంచీ గీతయింటి పరిస్థితులు అడ్డంతిరిగే సూచనలు కన్పిస్తున్నాయి. ఇటీవల ఆ వయసుమళ్ళిన స్త్రీ రోజూ వీళ్లింటికి వచ్చిపోతోంది. ప్రద్యోతనుడి గొంతుమాత్రం ఇదివరకంత గట్టిగా ఇప్పుడు విన్పించటం లేదు. కానాయ్‌కి ఆ స్త్రీ అంటే గౌరవభావం కుదిరింది. ఆమెవచ్చి, కాసేపుకూర్చుని కష్ట సుఖాలు మాట్లాడుతూ వుంటుంది.

ఆ రోజున కానాయ్ చెల్లెలు ఉమ అతడి దగ్గిరకువచ్చి "గీతపెళ్ళిట" అనిచెప్పింది.

"పెళ్లా!" కానాయ్ ఆశ్చర్యపోయాడు.

"ఔనట! వాళ్లింటికి రోజూ 'ఘటకీ' † వచ్చి వెడుతోంది."

ఘటకీ రాకపోకల సంగతి కానాయ్ అంతగా పట్టించుకోలేదు. ఎంచేతంటే ఘటకీ వస్తున్నంత మాత్రాన ఆడపిల్లలకు పెళ్ళి సులభంగా అయిపోదు. ఆడపిల్ల పెళ్లికి ముఖ్యంగా కావలసింది డబ్బు. అయినా ఉమ చెప్పిన మాటల్నిబట్టి 'అయితే అవుతుందేమో' అనీ అనిపించింది కానాయ్‌కి. కట్నం అక్కర్లేకుండా పెళ్లిచేసుకునేవారుకూడా లేకపోలేదు. 'అలాగేఅవాలి' అని కానాయ్ మనస్ఫూర్తిగా కోరుతున్నాడు. దయతలచి గీతను ఎవరైనా పరిగ్రహిస్తే, వారిదయ సార్థకమైనదవుతుంది. దయకు యోగ్య

† (పెళ్ళిసంబంధాలు చూడటమేవృత్తిగా పెట్టుకున్న స్త్రీ.)

రాలు గీత. దయతలచికాక, ప్రతిఫలంగా మరేమయినా యిచ్చి ఆమెను పరిగ్రహించాలనుకుంటే ఆ సామర్థ్యం ఇంక దేనికీ లేదు.

తల్లి వచ్చి నుంచుంది. ఎప్పటిలాగానే ఆమెముఖం ఉదాసీనంగా ఉంది. ఆత్మత్యాగం వెల్లివిరుస్తున్న దృష్టి ఆమెది.

"కానూ!"

"ఏమిటి?" అంటూ చిరునవ్వు నవ్వాడు కానాయ్.

"ఈనెల ఇంకా జీతంవచ్చేరోజు రాలేదూ?"

"లేదు. ఇవాళింకా పదిహేనో తేదీయేగా!"

"అయితే డబ్బుకావాలేమరి!"

"డబ్బుకావాలంటే తెచ్చుకోవచ్చు, కాని—"

" 'కాని' ఏమిటి?"

"నా కాలేజీ జీతంబాకీ క్రితంనెలనుంచి అలాగే ఉంది.

"రెండుమూడు నెలలు బాకీవున్న ఫరవాలేదని నువ్వే చెప్పావుగా!"

"ఫరవాలేదు. కాని ఇకముందు రెండు మూడునెలల జీతంమాత్రం ఒక్కసారిగా ఎక్కడినుంచి తీసుకొచ్చి చెల్లించగలం?"

తల్లి దీర్ఘంగా నిట్టూర్చింది. "అయితే ఏదో ఉపాయం నువ్వేచూడాలిరా కానూ! పోనీ సాయంకాలంపూటకూడా మరో ట్యూషన్ ఎక్కడైనా చూసుకోరాదూ?"

కానాయ్‌కి నవ్వొచ్చింది. తానెప్పుడూ చదువుకునేదిమరి! ఆమాటంటే మళ్ళీ ఆమె తన ఆదర్శాలసంగతి యెత్తుతుంది, సమాధానం ఏమీ చెప్పకుండా "సరే, చూస్తాను" అన్నాడు.

తల్లిముఖం విప్పారింది. "రా, వచ్చి టీ తాగు. డబ్బు ఇవాళే తీసుకురావాలి నాయనా!" కానాయ్ తల్లివెంట వెళ్ళాడు.

ఆకాశంలో ప్రచండమైన ధ్వని తలమీదుగా విన్పిస్తూవెళ్ళింది విమానాలు వస్తున్నాయి, పోతున్నాయి. "అయ్యబాబోయ్! ఎన్నో—ఎన్నో!" అని ఇంట్లో పిల్లలంతా రణగొణ ధ్వనిచేస్తున్నారు.

"ఒకటి-రెండు-మూడు-నాలుగు—" అంటూ ఉమ ఉత్సాహంతో బిగ్గరగా లెఖపెడుతోంది.

కానాయ్ పైకిచూశాడు. నిజంగానే చాలా విమానాలు వస్తున్నాయి, కనీసం ఓ యాభై అయినా ఉంటాయి. టీతాగి అతడు వీధిలోకి వచ్చాడు. పెద్ద రాస్తామీదుగా ట్రామ్‌లైన్ దగ్గిరకు వెళ్లాలి. కాలిబాటలమీద బస్‌స్టాండ్‌ల దగ్గిరుండే ఆచ్ఛాదనలక్రింద నిరాశ్రయులు కాబోలు కొందరు పడుకున్నారు. వాళ్ళ సంఖ్య క్రమంగా రోజురోజుకీ పెరుగుతోంది. దాంతోపాటు కలకత్తా జనాభాకూడా పెరుగుతోంది. హఠాత్తుగా ఒక సందులోంచి ఎవరో "కానాయ్ బాబూ!" అని కేకేశారు. ఆడగొంతు. కానాయ్ ఇటుతిరిగి చూశాడు. నీల. ఆమె ప్రక్క సందులోంచి వస్తోంది. యూనివర్శిటీ ఇన్‌స్టిట్యూట్‌లో సభజరిగాక మళ్ళీ నీలను కలుసుకోలేదు. ఇంత పెందరాళే ఇక్కడికెందుకువచ్చిందో! ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు. "మీరు ఇక్కడికి—?"

నీల నవ్వుతూ "—ఎందుకు వచ్చారని అడుగుతున్నారా? శ్రీశ్రీ నేపీని వెతకటానికి" అన్నది,

"నేపీని వెతకటానికా ? ఎక్కడికెళ్ళాడు నేపీ ? అసలు మేదినీపూర్‌నుంచి ఎప్పుడు వచ్చాడు?"

"అక్కడనుంచి ఆ తర్వాత-వారంలోనే వచ్చేశాడు. వచ్చిన నాలుగైదురోజులకే మళ్ళీ మాయమయినాడు. మా నాన్న మహా కోప్పడుతున్నాడు. అమ్మ బెంగెట్టుకుంది. అందుకని రమేన్ దగ్గిరకని వచ్చాను. అతడు నిన్ననే వచ్చినట్టు పార్టీ ఆఫీసులో తెలిసింది."

రమేన్ పార్టీలో ఉత్సాహవంతుడైన సభ్యుడు. ఇంచుమించు నేపీ యీడువాడే. అతడు అక్షరాలా కామ్రేడ్.

"మరి కబురేమయినా తెలిసిందా?"

"ఆఁ. ఇవాళ ఉదయం రైల్లో వస్తాట్ట!" అని నవ్వుతూ "నాకో పెద్దచిక్కు వచ్చిపడింది. మా అమ్మ నెపమంతా నామీదికే

తోస్తుంది. మా నాన్న మా విషయాలు అంతగా పట్టించుకోడు. కాని నేపీమాత్రం దేనికోదానికి తెగతిరుగుతూఉంటాడు. మానాన్న వాడిసంగతి అడిగినప్పుడు నా అపరాధాన్ని నేను ఒప్పుకోకుండా ఉండలేకపోతున్నాను. వాణ్ణి పార్టీలో ప్రవేశపెట్టింది నేనే'' అన్నది.

కానాయ్‌కూడా నవ్వుతూ—''నేపీమాత్రం ఎన్నడూ ఎలాంటి అన్యాయాన్ని చెయ్యడు నేన్! అలాంటప్పుడు మీరేదో అపరాధం చేశామని అనుకోవటం దేనికి?'' అని అడిగాడు.

నీల ఏమీ మాట్లాడలేదు. బహుశా ఏమీ మాట్లాడలేకపోయి ఉండొచ్చు. తనతప్పు తాను ఒప్పుకోవటంలోగల విచారానికి—ఆ విచారంవల్ల కలిగే అశాంతికి కానాయ్‌మాటను కొంతవరకు సాంత్వన కలిగించిఉంటాయి. ఆమె కృతజ్ఞతాదృష్టితో కానాయ్‌కేసి చూస్తూ ఊరుకుంది.

''పదండి, ముందుకు. ఇంటికేగా వెడుతోంది?''

మనస్సు స్థిమితపడ్డట్టుగా నీల నిట్టూర్చి ''పదండి'' అన్నది.

కానాయ్ మాట్లాడుతూనే నడుస్తున్నాడు—''జీవితంలో అన్నిటికన్నా పెద్ద ట్రాజడీ ఏమిటో ఎరుగుదురా? కనీసం నా విషయంలో పెద్దట్రాజడీ ఏమైఉంటుందనుకుంటున్నారు?'' అని అతడు నిరుత్సాహంగా చిన్ననవ్వు నవ్వాడు.

నీల సమాధానం ఏమీ చెప్పలేదు. అతడు ఏంచెప్ప బోతాడో అని ఎదురుచూస్తూ మాటాడకుండా ఊరుకుంది.

''—జీవితంలో ఏమార్గాన పోదామనుకుంటున్నానో, దేన్ని ఆదర్శంగా భావిస్తున్నానో, ఆ మార్గాన నడవటానికీ-ఆ ఆదర్శానికి కట్టుపడి ఉండటానికి ఇంట్లో ప్రక్కనుండేవారి ప్రతిబంధకాలను తొలగించుకోలేకపోవటమే—ట్రాజడీ. నిజానికి ప్రక్కనుండే వారుకూడా అంతగా అడ్డుపడరు. నామనస్సులోని, మమత, స్నేహం, ఆపేక్ష-ఇవే అడ్డువస్తున్నాయి. నేపీ అసాధ్యుడు. ఈ వయస్సులో అతడు ఇలాంటి అవాంతరాలన్నింటినీ తప్పించు

కుని ఎలా బయటపడగలిగాడో తలచుకుంటే నాకుఆశ్చర్యంవేస్తుంది సేన్!''

నీల నవ్వుతూ ''నేపీలో మీకేమీ లోపంఉన్నట్లే కన్పించటం లేదా ?'' అని అడిగింది.

''ఉహుఁ. కన్పించటంలేదు. నిజంగానే కన్పించటం లేదు.'' అని కానాయ్‌కూడా నవ్వుతూనే అన్నాడు.

''కాని మా అమ్మా-నాన్నాసంగతి ఎలా మరిచిపోవటం చెప్పండి ? మా నాన్నను మీరు ఎరగరు. ఆయన బహు ఉదారుడు. ఆయనెప్పుడూ——''

ట్రామ్‌వచ్చేసింది ఇద్దరూ ట్రాం ఎక్కారు. నీల లేడీస్ సీట్‌లో ఒక ప్రౌఢాంగన ప్రక్కకూచుంది. కానాయ్ నుంచో వాల్సివచ్చింది.

నీల చెపుతున్న సంగతి అసంపూర్ణంగానే ఆగిపోయింది. తన తండ్రిసంగతులు తలచుకుంటూ ఆమె కిటికీలోంచి బైటకు చూస్తూ కూచుంది.

కేవళసేన్ స్ట్రీట్‌లోనే నీలయిల్లు. ట్రాం కాలేజీస్ట్రీట్ మార్కెట్‌ముందు ఆగింది. కాని నీల అక్కడ దిగలేదు. ఇంకొంచెందూరంవచ్చి కాలేజీస్క్వేర్ దగ్గిర ట్రాం ఆగగానే ఆమె దిగుతూ కానాయ్‌నికూడా రమ్మని పిలిచింది.

నీల ధైర్యంగా, చొరవగా- ఎలాగయినా కొంచెం గబగబా నడుస్తుంది. ఆచొరవలోకొంత స్వేచ్ఛకూడా ఉంది. ఎదుట గుంపుగా నుంచునిఉన్న జనంకేసి, 'దారియివ్వండి' అన్నట్లుగా చెయ్యివిసురుతూ సంజ్ఞచేసింది. అందరూ పక్కకు తప్పుకున్నారు.

ఆస్థితిలో ట్రాంలో 'ఊఁ' అన్నా, 'ఆఁ' అన్నా జనం చేపలు గెంతుతున్నట్లు ఒకరి మీదకు ఒకరిని తోసుకుని ఏవో గుసగుసలాడుకుంటారు: అంచేత కానాయ్ 'ఎక్కడికి? ఎందుకు?' అని

ప్రశ్నించకుండానే నీలతోపాటు ట్రాంలోంచి దిగాడు. నేపీని గురించిన ఆందోళన నీలకు ఇంకా పూర్తిగా తగ్గినట్లులేదు.

'గోల్ దీఘి' వద్దకు రాగానే "ఎక్కడైనా కూర్చుందామా?" అని అడిగాడు కానాయ్.

నీల కానాయ్‌ముఖంకేసి నిండుగాచూసి, "మీదగ్గిర నా తప్పును నేనింకా వప్పుకోలేదు. ఆ బాకీ అల్లాగేఉంది" అన్నది.

"అదేమిటి? ఏంతప్పు ?"

"ఆ రోజున యూనివర్శిటీ ఇన్‌స్టిట్యూట్‌లో నేను మిమ్మల్ని—"

కానాయ్ ఆమెమాటకు అడ్డువచ్చాడు—"అహఁహఁ చెప్ప వలసినమాటే చెప్పారుమీరు. నన్ను ఏమీ అనలేదు. ఏదో మామూలుధోరణిలో—"

నీలకూడా అతడిమాటలకు అడ్డువచ్చి, "అహఁహఁ. మిమ్మల్ని ఉద్దేశించే అన్నాను నేను. ఆ మాట ఒప్పుకుంటున్నాను" అన్నది.

కానాయ్ తెల్లబోయాడు. ఇద్దరూ మెల్లిగా ముందుకు నడుస్తూనే ఉన్నారు. నీల మృదవుగా "కానాయ్‌బాబూ!" అన్నది.

"మీరు ఆరోజున నన్ను ఉద్దేశించే అలా అన్నప్పటికీ మీతప్పు ఏమీలేదు సేన్! నా కర్తవ్యాన్ని నేను చెయ్యలేకపోయాను."

కానాయ్‌మాటలు వినేసరికి నీలకు అతడిమీద సానుభూతి కలిగింది. అతడి మనస్సులోని విచారాన్ని ఆమె లీలగా పసికట్టింది.

"ఏమయిందేమిటి కానాయ్‌బాబూ?" అని అడిగింది.

కానాయ్ ఏమీ మాట్లాడకుండానే నడుస్తున్నాడు,

"చెప్పటానికేమైనా అభ్యంతరమా ?" అని నీల మళ్ళీ ప్రశ్నించింది.

"అభ్యంతరమా!" కానాయ్ దీర్ఘంగా నిట్టూర్చి—"మా యింటిసంగతిలేండి. అదో పెద్దగాథ."అని మళ్ళీ కాసేపు ఆగి 'పార్టీవర్క్ నావల్ల ఎమీ కాదనుకుంటాను సేన్!" అన్నాడు.

"ఎందుకని ?"

"చెప్పానుగా అదో పెద్దగాథని ! అదీ గాక—"

నీల ఒక్కక్షణం ఆగి, "కామ్రేడ్" అన్నది మళ్ళీ.

"కామ్రేడ్ మాట అలా ఉంచండి. ఆ గాథంతా ఎప్పుడో చెపుతానుగా !"

నీల మెదలకుండా ఊరుకుంది.

కానాయ్ మళ్ళీ—"బహుశా భవిష్యత్తులో నేనెప్పుడో—"

అని చెప్పబోయి ఆగాడు.

'—ఎప్పుడో పిచ్చివాడినయిపోతానేమో' అని చెప్పబోయాడు, కాని చెప్పలేక పోయాడు.

నాలుగడుగులు ముందుకువచ్చాక తలఎత్తి స్విమ్మింగ్‌క్లబ్ టవర్‌గడియారంకేసి చూసి, కంగారుగా, "నాకు చాల ఆలస్యమయిపోంది సేన్! ఎనిమిదికూడా కొట్టేసింది" అన్నాడు.

అతడు గబగబా కాలేజీస్ట్రీట్‌వైపుకు సాగివెళ్లాడు. నీల మాత్రం అక్కడే చెరువుచుట్టూఉన్న కటకటాలనానుకుని నుంచుంది. కొంచంసేపయాక ఆమెకు ఆఫీసు వేళయిందన్న సంగతి గుర్తుకొచ్చింది.

నీల తమ వీథిగుమ్మంముందుకు వచ్చి చూసింది. అక్కడో పెద్దగుంపు చేరిఉంది. గుంపుచూసి ఆమె యేమీ కంగారుపడలేదు. ఎంచేతంటే ఆ గుంపులోంచి ఎవరిదో పాడుతున్నగొంతు విన్పిస్తోంది. వాళ్ల నాన్న సరదాగా అప్పుడప్పుడు పాటలుపాడే బిచ్చగాళ్ళను - దారినపోతూంటే పట్టుకొస్తూ ఉంటాడు. విశేషించి అంతో ఇంతో 'మెరిట్' ఉన్నవాళ్లయితే ఇహ చెప్పనే అక్కర్లేదు. ఈపాటకచ్చేరీ అలాంటిదే అయివుంటుందని నీల గ్రహించింది. ఇవి మరీ ప్రతిదీ మండిపోతూన్న రోజులవటంవల్ల తనసరదాలను చాలా

వరకు తగ్గించికోవాల్సి వచ్చినందు కతడు ఎంతో విచారపడుతూ ఉంటాడు. ఆ సంగతి నీలకీ తెలుసు.

దేవప్రసాద్ పెదవివిప్పి ఎప్పుడూ ఏ విషయమూ పైకి చెప్పడు. ఎప్పుడైనా ఉద్రేకంలో ఏదయినా మాటజారితే—దానికి మళ్ళీ అమాయకుడిలాగా ఇంట్లో అందరిదగ్గిరా సంజాయిషీ చెప్పుకోపోతాడు—ఇటీవల ముఖ్యంగా నీలముందు సంజాయిషీ చెప్పుకోవటం మొదలెట్టాడు. కుటుంబంఖర్చు తాను గడుపుతూ ఉండటమే, దానికి కారణమై ఉంటుందని నీలగ్రహించింది: అతడిలా చెయ్యటం నీలకు ఎంతో కష్టంగా ఉంటుంది. అయినా ఇలా కష్టంవేసినప్పుడు తండ్రీ, కూతురూ ఇద్దరూకూడా ఏమీ యెరగనట్లే నటిస్తారు.

దేవప్రసాద్ నీలను చూడగానే—"విను. విను అమ్మాయీ: ఈ ముష్టివాడిపాట విను. పైగా ఈ పాట వాడే కట్టాట్ట అమ్మాయీ! ఎక్కడో కుగ్రామంలో ఉండే ముష్టికుర్రవాడు—"

దేవప్రసాద్ ఖిగ్గరగా మాట్లాట్టంచూసి, ముష్టివాడు పాట ఆపేశాడు. "కాదు బాబయ్యా. మేం ముష్టోళ్ళంకాదుండీ! మాది వర్ధమాన్‌జిల్లా. మాకూ కొంపగోడూ ఉండాయి. మాఅయ్య యగసాయంసేత్తుండు. కాని మద్దెలో మాయదారియుద్ధంవొచ్చి అంతా తారుమారు సేసేసిందండి. ఖియ్యందర సూడండి. మండిపోతుండాది. సేరు అర్ధ రూపాయి. ఇప్పుడయ్యా కూలిసేసుకు తింటుండాడు. నాకోసెయ్యిలేదండి! సూడండి" అంటూ వాడు కుడిచెయ్యి బైటపెట్టాడు. విరిగి వాడిపోయిన కొమ్మలాగా వేలాడుతోంది ఆ చెయ్యి. వాడు మళ్ళీ నవ్వుతూ "మా అమ్మ లేదండి. అయ్యకొచ్చేకూలే తక్కువ. మండిపోతుండ దరల్లో అది ఆడితిండికే సాలటంలా. అబద్ధం కాదండి, సత్తెప్రెమ్మాణికంగా సాలటంలా. నానందుకని ఇట్టాపాటలు పాడుకుంటూ

అడుక్కుంటూ తిరుగుతుండా. మళ్లీ యుద్దం - గిద్దంపోయి దరలు తగ్గాక మాఊరే పోతానండి. ఒకేల ఏంసెప్పుగలల్నేండి, దారి మద్దెలోనే ఎక్కడన్నా గుటుక్కు మంటానేమో!'' అంటూనే వాడు కిందపడుకుని, నాలిక బైటపెట్టి, గుడ్లుతేలేసి చచ్చిపోయినట్లు అభినయించాడు. భలేవాడు. దారిలో ఎకడైనా చస్తానేమోనని ఊహించుకుని నవ్వుతున్నాడు-కల్లా కపటంలేని నిర్మలమైననవ్వు.

వాడి మాటలకు అందరూ అలాచూస్తూ ఉండిపోయారు.'

''ఇనుకుంటారా అమ్మా! నాపాట యినుకుంటారా? యిమానంపాట. యిమానాలు సూశారా? సూడకపోటం యేంటిలెగండి మిరంతా దొరసానుల్లో లెక్క. కలకత్తాలో యిమానాలకేం తక్కువ? అయితే యినండిపాట—'' అని వాడు ఆ ఒక్కచేత్తోనే తొడమీదదరువు వేసుకుంటూ తెలిసీ తెలియని భాషలో పాడటం మొదలెట్టాడు—

('ఆకాశంలో విమానా లెగురుతున్నాయ్. వాటినిండా బాంబులే. ఆ బాంబుల భయంతో జనం అంతా కలకత్తా ఖాళీచేసి వెళ్ళిపోతున్నారు. యుద్ధంమూలంగా ఇక్కడ కూడుగుడ్డా లేకుండాపోయిన జనానికి జపానువాళ్లొచ్చి డబ్బు విరజిమ్ముతారుట'-అని ఆ పాటభావం.)

''ఈ పాట రాసుకుంటే బాగుండునే'' అన్నది నీల.

దేవప్రసాద్‌కు కళ్లు చెమ్మగిలాయి.

''తొమ్మిదయిపోయిందే నీలా!'' అని తల్లి లోపలినుంచి కేకేసింది.

''నువ్వు వెళ్లమ్మా! కావాలంటే నేను రాసివుంచుతాలే పాట'' అన్నాడు దేవప్రసాద్.

నీల తండ్రి దేవప్రసాద్ ఆదర్శాలను అంటిపెట్టుకునివుండే కోవకు చెందినవాడు. అతడు న్యాయవాది. తత్వశాస్త్రంలో

ఎం. ఏ. ప్యాసయి, తర్వాత లా చదివి ప్లీడరయినాడు. అతడి జీవితంలో పెద్ద పొరపాటు జరిగిందక్కడే. జీవితంలో న్యాయవాది మనస్తత్వానికి—ఆదర్శాలమీద ఆసక్తికీ మధ్య తత్వశాస్త్రం వచ్చి అడ్డుపడుతూవుండేది. దానిమూలంగా ఈ రెండింటికీ పార్టిషన్ దావాలా తుదివరకు సంఘర్షణ వస్తూనేవుంది. ఆ రెండింటికీ రాజీ కుదరలేదు—యేపక్షానికీ విజయమూ కలగలేదు. ఒకే వస్త్రాన్ని చుట్టబెట్టుకున్న నలదమయంతులకు జరిగినట్లే-ఇక్కడ కూడా వృత్తి మనస్తత్వానికీ-ఆదర్శాల మనస్తత్వానికీ మధ్యనున్న తత్వశాస్త్రం కలిపురుషుడిలాగా ఆ వస్త్రాన్ని రెండు ముక్కలుగా కత్తిరించినట్లయితే దేవప్రసాద్‌కు కొంతయినా ఉపాకారం జరిగేది. కాని అలా చెయ్యకుండా అతడి తత్వశాస్త్రం భగవద్భక్తుడైన నారదమహామునిలాగా ఆ రెండింటిమధ్యా కలహాలను ప్రేరేపించ సాగింది. అంచేత ప్లీడరీవృత్తిలో అతడేమీ ఎక్కిరాలేదు. సామర్థ్యంలేనివాడా అంటేకాదు. ఏదెలాజరిగినా జీవితంలో తన ఆదర్శాలను అంటిపెట్టుకునివుండటమే ప్రధానం అతడికి. అయినా అదివరకుదాకా వుంటూవచ్చిన సంపాదనతో అతడికి బాగానే గడుస్తూవుండేది. కొడుకులకీ—కూతురికీ చదువుకోటానికి సమానమైన అవకాశాలు కలిగించాడు. పెద్దకొడుకు అమరసేన్ యమ్. ఏ. ప్యాసయి, బెంగాల్ సివిల్‌సర్వీసు మొదలుకొని అన్నిరకాల ఉద్యోగాలకు చేసిన ప్రయత్నాలు వ్యర్థమై—చివరకు యాభై రూపాయల జీతంమీద బడిపంతులుగా చేరాడు. యుద్ధంవల్ల ఏర్పడిన ఆర్థికదుస్థితి మూలంగా అతడిజీతం యిప్పుడు ముప్ఫయిఅయిదు రూపాయలకు తగ్గింది.

ప్రస్తుతం దేవప్రసాద్ సంపాదనకూడా యించుమించు ఇదే స్థితిలోవుంది. ముఖ్యంగా మరీ కొన్నిమాసాలనుంచి సామాన్య సంసారుల ఆర్థికస్థితి చాలా అన్యాయంగావుంటోంది. తమకు న్యాయంగా ఉన్నహక్కులనుగాని, రావలసిన బాకీలనుగాని, కోర్టుద్వారా పరిష్కరించుకునేందుకు అవసరమైన చిన్న చిన్న

ఖర్చులకుకూడా వాళ్లచేతుల్లో డబ్బు ఆడటంలేదు. ఇళ్లు అద్దెల కిచ్చేవాళ్లు కొంతమంది క్లయింట్‌లు ఉన్నారతడికి. అద్దెలు వసూలుచేసుకోటానికో, యిళ్లుఖాళీలు చేయించటానికో వాళ్ల తాలూకు దావాలు యెప్పుడూ యేవో ఒకటి జరుగుతూనే వుంటాయి. కాని ఇవాక్యుయేషన్ వొత్తిడి ఒకటి రావటం మూలంగా కలకత్తాలో ఇళ్ల యజమానులు అద్దెలకోసం దావాలు చెయ్యటంమాట అలావుంచి, అసలు గట్టిగా అద్దెలు అడగనుకూడా అడగటంలేదు.

దేవప్రసాద్ దీనికేమీ విచారపడలేదు. ఎంచేతంటే అన్యాయమైన దావాలను అసలతడెన్నడూ ప్రోత్సాహించేవాడుకాదు. అంతదాకు యెందుకు—వకాల్తనామా పుచ్చుకున్నాక తన క్లయింట్లలో అక్రమం, అన్యాయం ఉన్నాయని తెలిస్తేచాలు ఆ వకాల్తనామా వదులుకునేవాడు. ఇన్నాళ్లనుంచీ తనకున్నది కొద్దిసంపాదనే అయినా దానికి అతడెన్నడూ అసంతృప్తిచెందలేదు. కాని ఇప్పుడు మాత్రం అతడికి విచారంపట్టుకుంది: తన కుటుంబంలోని వారికి అతడిప్పుడు రెండు పూట్లా కడుపునిండా తిండిఅయినా సంపాయించి పెట్టలేకపోతున్నాడు.

అతడు మొదటినుంచీ సాంసారిక విషయాల్లో ఉదాసీనంగానే ఉంటూ ఉండేవాడు. ఒక్క పిల్లల చదువులవిషయంలో మాత్రం నిష్కర్షగా వుండేవాడు. పెద్దకొడకు ఎం. ఏ ప్యాసయినాడు. కూతురు నీల చదువుకు అతడెన్నడూ అభ్యంతరం చెప్పలేదు ఆమెను ఈ చదివించటం—మంచి ఉద్యోగంలో ఉన్న అల్లుణ్ణి సంపాయించాలన్న ఉద్దేశంకాదు; కాని ఒక్క ఆలోచనమాత్రం వుండేది.

నీల సంసారం నిర్వహిస్తూనే, తానుకూడా సంపాయించగలిగితే, సామాన్య కుటుంబాల్లో సహజంగా వుంటూవుండే దారిద్ర్యం ఆమె కుటుంబంలో కొంతవరకైనా తప్పిపోతుందికదా అని అనుకుంటూ వుండేవాడు. కలకత్తాలో చదువుకున్న ఆడవాళ్ల సంసారాలను చూస్తూంటే అతడికెంతో సంతృప్తిగా వుంటూవుండేది. భర్తకు వంటచేసిపెట్టి పంపి, నీలకూడా ఏ బాలికా పాఠశాలకో ఉపాధ్యాయినిగా వెడుతూ వుండగలదని వూహించుకునేవాడు. ఉపాధ్యాయ వృత్తితప్ప ఆడవాళ్లకు మరొక అనువైనవృత్తివుంటుందని అతడి ఊహకు తోచేదేకాదు. కాని యుద్ధంమూలంగా వచ్చిన విపర్యయంవల్ల,కుటుంబంలో యేర్పడ్డకష్టాల్నిచూసి,నీల రహస్యంగా దరఖాస్తుపెట్టి, ఉద్యోగంవచ్చాక తండ్రితో "నాన్నా! ఉద్యోగంలో చేరాను" అని చెప్పింది. ఆ రోజున అతడి మనస్సుకు పెద్ద దెబ్బతగిలినట్లయింది. అయినా పైకిమాత్రం యేమీ అనలేదు. విశ్వవిద్యాలయపు చదువుతోపాటు—దుస్తుల విషయంలో, అలంకరణం విషయంలో నీలకూడా కొన్నిరకాల అభిరుచులకు అలవాటుపడింది. ఆ అభిరుచులను వదులుకోలేక ఆమె ఈ మార్గం త్రొక్కివుంటుందనుకున్నాడు. కాని నెలజీతం రాగానే, తన కాఫీ ఖర్చుకూ ట్రాంపాస్‌కు అవసరమైన పదిహేను రూపాయలు మాత్రం దగ్గిర వుంచుకుని, మిగిలిన జీతం తండ్రిచేతిలోపెట్టి నమస్కరించింది.

దేవప్రసాద్ చాలా స్థైర్యంకలవాడు. ఏమొచ్చినా పైకి పొంగే ఘటంకాదు. అతడెంత స్థైర్యంకలవాడంటే—అతడి కొడకు అమర్ సేన్‌కి—నీలికి మధ్యపుట్టిన పిల్లలిద్దరూ చచ్చిపోయినప్పుడుకూడా అతడు కంట తడి పెట్టలేదు. కాని - నీలవచ్చి జీతం చేతిలో పెట్టగానే అతడి కళ్లు చెమ్మగిలాయి.

అతడికి జీవితంలో విచారానికీ, అశాంతికీ కారణం, అతడి చిన్నకొడుకు నేపీ. నేపీ ఐ. యస్ సి. ప్యాసయి, బి. యస్‌సి.

చదువుతున్నాడు. కాని అది నామమాత్రానికే. అతడు రాత్రింబగళ్లు రాజకీయాల్లోనే పడి కొట్టుకుంటూ వుంటాడు. మరీ కొన్నిరోజులనుంచి అసలింటికే రావటంలేదని చెప్పవచ్చు. అతడు దేవప్రసాద్ కంటపడి నెల్లాళ్ళయింది. అర్ధరాత్రి యెప్పుడో వచ్చి, నెమ్మదిగా నీలను పిలుస్తాడు. దేవప్రసాద్‌కు చివరిరోజున-ఈ పిలుపుతోనే మెళుకువవచ్చింది. అతడు కోప్పడకుండా వుండ లేకపోయాడు.

"ఫో - యింట్లోంచి, ఫో. ఖబడ్‌దార్ నీలా! ముందు గానే చెపుతున్నా. వాడికి తలుపు తీయొద్దు" అన్నాడు.

తలుపు తియ్యటానికై వెడుతున్న నీల తండ్రి కేకలకు కొయ్యబారిపోయింది. తల్లికూడా క్రిందికి దిగివచ్చింది. ఆమెకూడా తలుపుతియ్యటానికి సాహసించలేకపోయింది. ఆమె వెనకాలనే దేవప్రసాదూ దిగివచ్చాడు. కాని నేపీమాత్రం భలేవాడు. నీలను మెల్లిగా పిలిచి, "తలుపు తియ్యవద్దులే, కిటికీ లోంచి నాలుగు ముద్దలు ఆకులో అందించు. వరాండాలో కూర్చుని తినిపోతాను, భలే ఆకలేస్తోంది" అన్నాడు.

దేవప్రసాదే వచ్చి తలుపుతీసి, "ఇవాళ్లికి నిన్ను క్షమిస్తున్నాను; కాని యిహముందు కూడా నీకు యిలాగే తిరగాలనే బుద్ధి కనుక వుంటేమాత్రం ఇంక ఈ ఇంటికి రావొద్దు" అన్నాడు ముక్తసరిగా. ఇంచుమించు రెండు వారాలయింది. నేపీ యెక్కడికెళ్లాడో అసలంతే లేదు. మధ్య యెప్పుడో ఒకరోజున వచ్చాట్ట. కాని ఆనాడు దేవప్రసాద్ కంటపడలేదు. నీలకూడా ఏదో రాజకీయవర్గంలోచేరి పనిచేస్తోందిట! దేవప్రహద్ కేం చెయ్యాలో తోచలేదు. చదువులకూ—రాజకీయచైతన్యానికి మధ్య గట్టిసంబంధమేవుంది. నీలలో ఆచైతన్యం ఉబుకుతూంటే తానామె దృష్టిని యెలా మరల్చగలడు? చెయ్యగలిగితే ఒక్క ఉపాయంమాత్రం వుంది—జీవితంలో శాంతిసుఖాలను సమకూర్చే

యే నీడపట్టునైనా నీలకు చూపగలిగితే; తమనీడపట్టుమీద ఆడవాళ్లకు సహజంగా వ్యామోహం యెటూ ఉంటుంది కనుక, ఆ వ్యామోహంలో, ఆ ఆనందంలో బహుశా నీలకూడా దేశం సంగతీ, ప్రపంచంసంగతీ మరచిపోవచ్చు. కాని తాను ఆపనీ చెయ్యలేకపోయాడు. దేవప్రసాద్ దీర్ఘంగా నిట్టూర్చాడు-ఇంతలో నీల యింట్లోంచి బైటికివచ్చింది. స్నానమూ భోజనము అయి ఆమె ఆఫీసుకు బయలుదేరింది. వెళ్లబోతూ ఒక్క నిమిషం ఆగి, చనువుగా "ఇవాళ నేపీ వస్తాడు నాన్నా!" అని చెప్పి వెళ్ళిపోయింది.

# ౬

కానాయ్ తన శిష్యుడి ఇంటి గేట్ ముందుకువచ్చి నిల బడ్డాడు. గబగబావస్తూ చటుక్కున ఆగినట్లు నిలబడిపోయాడు. వారియింట్లో గడియారం ఏదో వాద్యయంత్రంలా ధ్వనిస్తోంది. ఎనిమిదిన్నర. కాలేజీ స్క్వేర్‌లో ఎనిమిది కొట్టటంచూసే బయలుదేరాడు. భాగ్యవంతుల యింట్లో గడియారమిది. ప్రతి పదిహేను నిమిషాలకీ యిలాగే ధ్వనిస్తూవుంటుంది. ఖరీదుగల గడియారం. ఇవాళయినా అదృష్టమంటూ ఒకటి వున్నదని వొప్పుకోక తప్పదని అని పించింది కానాయ్‌కి. అదృష్టమంటే ఏముంది? అర్థాత్తూ దురదృష్టమే !

కానాయ్ చిననాయనమ్మ, ఎప్పుడమావాస్య, పూర్ణిమ వస్తాయో, తన వాతరోగం మళ్లీ ఎక్కడెక్కు వవుతుందో అని అందోళన పడుతూండేది. "ఆకాశంలోకి అమా వాస్యవస్తే— దానికీ నీకాళ్లకీ సంబంధం ఏమిటమ్మా? నీ కాళ్లున్నది నేలమీదగా!" అంటూ కానాయ్ నవ్వుతూ వుండేవాడు. అసలింతకీ కానాయ్ గ్రహబలాన్నికాని, అదృష్టాన్నికాని ఒప్పుకోడు. అతడు సైన్స్ స్టూడెంటు. కాని ఇవాళ అతడు ఉదయమే నీలను కలుసుకోవటం దురదృష్టమేనని వొప్పుకోకుండా వుండలేకపోయాడు. ఎంచేతంటే దీని ఫలితంగాకొంత చెడును అనుభవించక తప్పదు; ఈ విషయంలో అతడికేమి సందేహంలేదు. దాన్ని తప్పించుకోటానికే అతడు శిష్యుడి యింట్లోకి ప్రవేశించాడు. మామూలు వేళకన్న యివాళ ఒక గంట ఆలస్యమయింది. కాలేజీ స్క్వేర్‌లోనుంచి బయలుదేరినప్పుడు అతడు యివాళ కిహ వీళ్లయింటికి వెళ్లొద్దు అను కున్నాడు. కాని, 'ఇంట్లో సరుకులన్నీ అయిపోయాయి నాయనా!' అని తల్లి సంకోచిస్తూ అన్నమాటలే అతడ్ని యింతదూరం తరుము

కొచ్చాయి. జీతండబ్బు ఇవాళ కావాలి! తల్లి ఒత్తిడి చెయ్యటమే కాదు, దాంతో మరొక అవసరంకూడా వున్నసంగతి యిప్పుడు గుర్తుకొచ్చింది. రేపో ఎల్లుండో తాను నీలకు కాఫీ యిప్పించాలి.

క్రొత్త భాగ్యవంతులు వీరు. నాగలి ఆకారంలో కట్టిన, వారి బ్రహ్మాండమైన మేడ పైకి ధగధగలాడుతోంది. క్రిందగచ్చు మార్బల్ ఫినిషింగ్‌తో నిగనిగలాడుతోంది. అమెరికన్ కోటీశ్వరులు కట్టించే పద్ధతిలో కట్టించిన మేడ మెట్లు చిత్రమైన నగిషీలుచెక్కిన కాంక్రీట్ సీలింగ్, చాలా ఖరీదుగల రకరకాల ఫర్నిచరు, కార్లు, కుక్కలు; యెదుట వైభవాన్నంతా వెల్లడి చేస్తున్నట్లున్న డ్రాయింగ్‌రూం - అదీ ఈ మేడలో అంతర్భాగమే. ఇంటియజమాని చాలా సమర్థుడు, తెలివికలవాడూను. అతడు కట్టెలవర్తకం ప్రారంభించి, క్రమంగా చింతపండు వర్తకంలోకి దిగి, అక్కడినుంచి ప్రత్తి, అభ్రకం, ఇనుము మొదలైన అనేక వ్యాపారాల్లోని సారాన్నంతా పీల్చుకుని, తన ఐశ్వర్యానికి సూచకంగా ఈ 'తిలోత్తమ'ను నిర్మించాడు. ఆ మేడపేరు నిజంగానే తిలోత్తమ. గేట్‌ముందు ఒకవైపున చలువ రాతిమీద నల్లటి అక్షరాలతోను, రెండోవైపున గ్లాస్‌మీద బంగారపురంగు అక్షరాలతోనూ తిలోత్తమ అని రాసివుంది. ఆ గ్లాస్‌కు వెనక ప్రక్క ఎలక్ట్రిక్ బల్బులు అమర్చారు. రాత్రిళ్లు ఈ బల్బుల కాంతులకు ఆ బంగారురంగు అక్షరాలు నిప్పుకణికల్లాగా మెరుస్తూ వుంటాయి.

వరాండాకు యెదురుగా యినక బస్తాలు వరుసగా పెట్టివున్నాయి. వాటి మధ్యనుంచి సన్నటిదారి వుంది. కానాయ్ ఆ దారినే చదువుల గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు. లోపల దర్వాజాలప్రక్కన, కిటికీల ప్రక్కనకూడా యినకబస్తాలు పెట్టి వున్నాయి. ఎలక్ట్రిక్ బల్బులకు చిత్రవిచిత్రమైన 'బ్లాకౌట్ షేడ్స్' తగిలించివున్నాయి. నాలుగువైపులా షోకేస్‌లలాగా ఉన్న పుస్తకాల బీరువాలు. ఆ అద్దాల బీరువాలకు రంగురంగుల

పల్చని సిల్కుతెరలు. ఆ తెరల్లోంచి లోపలవున్న బైండుపుస్తకాలు ధగధగ మెరుస్తున్నాయి. అవన్నీ చాలావరకు విదేశీకంపెనీ ప్రచురించిన ఇంగ్లీషుపుస్తకాలే. 'ఎన్ సైక్లోపీడియా' 'బుక్ ఆఫ్ నాలెడ్జి' మొదలుకొని, అతిఆధునికకవితా సంగ్రహాలవరకు అన్ని రకాల పుస్తకాలూవున్నాయి. కానాయ్ మొట్ట మొదటి రోజున ఇక్కడకు వచ్చినప్పుడు యివన్నీచూసి విస్తుబోయాడు. ఇంత విద్యాసంస్కారాలు మధ్యపెరిగిన యింటివారబ్బాయికి తానెలా చదువుచెప్పాలో తోచక తికమకపడ్డాడు. ఒక ప్రక్కనుంచి బీరువాల్లోని పుస్తకాల పేర్లు చదువుకుంటూవస్తూ మధ్యలో ఆగి, ఒక బీరువాతాళందగ్గిర చెయ్యిఆనించి, తాళంచెవిపెట్టేచోట సైనవుండే బిళ్లను పరధ్యానంగా చేత్తో కదిలించాడు. అది రవంతయినా కదల్లేదు. ఆశ్చర్యపోతూ ఆ తాళానికేసిచూస్తూ ఒక్కక్షణం అలాగే నిలబడిపోయాడు—అంతలో మళ్ళీ అతడికి నవ్వుకూడా వచ్చింది. ఆతాళం తుప్పుపట్టి బిగుసుకుపోయివుంది. ఆ ఒక్క తాళమేకాదు, అన్నితాళాలూ అలాగేవున్నాయి.

కానాయ్ చదువుల గదిలోకివెళ్ళి కూచున్నాడు. శిష్యుడింకా రాలేదు. అతడి పరీక్ష లయిపోయి చాలారోజులయింది. విధిగావచ్చి కూర్చుని చదువుకోవల్సిన అగత్యం లేదిప్పుడు. అయితే అది యజమానికి నచ్చదు. ఈ కుర్రవాణ్ణి బాగా డబ్బు సంపాయించేవాణ్ణి చెయ్యాలనికాదు అతడి వుద్దేశం. ఆతణ్ణి ఓ పెద్ద విద్వాంసుణ్ణి చేయాలని సంకల్పం; విద్వాంసుల్లోకూడా ప్రపంచవిఖ్యాతిని ఆర్జించగల విద్వాంసుణ్ణి చేయాలని. లోకం అతణ్ణి 'విద్వన్మణి' అని చెప్పుకోవాలి! అతడి కొడుకుల్లో యితడి కంటె పెద్దవాళ్ళిద్దరూ అయినా శుంఠలుకారు. ఇంగ్లీషు బాగా మాట్లాడగలరు. చదవగలరు. తెలివి తేటలనే గీటురాయిమీద గీసిచూస్తే వాళ్ళు వన్నెగల బంగారపు తునకలే. అయినా ప్రపంచంలో యెక్కువ విలువవున్నది మేలిమి బంగారానికే. ఈ కుర్రవాణ్ణి మేలిమి బంగారంమీద పొదిగిన వజ్రపుతునకల్లా

చెయ్యాలని యజమాని సంకల్పం. అంచేత ఈ వజ్రాన్ని ఒరిపిడి పెట్టటంలో కాలవిలంబం జరగటం అతడు సహించలేడు. లెఖ్ఖలు, ఇంగ్లీషు, సంస్కృతం, హిస్టరీ - యిలా విభజించి, నాలుగు సబ్జెక్టులకీ నాలుగు గంటలు-నలుగురు మాష్టర్లువచ్చి ట్యూషన్ చెప్పేట్లుగా ఏర్పాటు చేశాడు. అయినా ఆ కుర్రవాడికి కానాయ్ మాష్టారంటేనే యిష్టం. ధనికవాతావరణంలో పెరిగినవాడయినా అతడిది దవదవలాడే శరీరంకాదు. మంచి దార్ఢ్యంగల ఆరోగ్య వంతమైన శరీరం. అతడిలో దుడుకుతనం, చాంచల్యంవున్నా- కొంత పెద్ద మనిషితరహాకూడా వుంది. తెలివితేటలు సామాన్యమే అయినా తెలుసుకోవాలనే ఆసక్తివున్నవాడు. ప్రపంచాన్ని వ్యంగ్య దృష్టితో చూడటం కానాయ్‌వల్ల నేర్చుకున్నాడు. కొంత మంది వక్రదృష్టి, తీవ్రదృష్టి కలవారయినా పైకిమాత్రం సహ జంగానూ, సరళంగానూ వున్నట్లు కన్పిస్తారు - ఈ కుర్రవాడు కూడా అలాంటివాడే. ఇతడు కానాయ్ యింటికి అప్పుడప్పుడు వస్తూవుండేవాడు. ఐశ్వర్యదేవత అంతర్థానమైపోయిన సుఖమయ చక్రవర్తిగారి ఆలయంచూసి, అతడు విస్తుపోతూ వుండేవాడు. అంచేతనే జీతండబ్బు యిప్పటికీ కానాయ్‌కి చేతికి ఇవ్వలేదు. నెల అయిపోగానే తనతండ్రి మానోగ్రాంతోవున్న కవరుతీసుకొచ్చి 'ఇదిగోసార్ కవరు' అని ఇస్తాడు. కానాయ్ ఇంకేమీ ప్రశ్నించడు. మెదలకుండా జేబులో పెట్టుకుంటాడు. మొదటి సారి మాత్రం కొంచెం విస్తుపోయి, "కవరా?" అని అడిగాడు.

అశోక్ తలవంచుకుని "అవును. నాన్న గారిచ్చారు" అని వెంటనే మళ్ళీ లోపలికి వెళ్ళిపోయాడు. కానాయ్ కవరువిప్పి చూసుకున్నాడు - అందులో మూడు క్రొత్త పది రూపాయిలనోట్లున్నాయి.

యజమాని స్వయంగావచ్చి కలుసుకుని, "ఇది చాలా అన్యాయం మాష్టారూ! మీరు సుఖమయ చక్రవర్తిగారి ముని మనమలని ముందుగా చెప్పివుంటే బ్రాహ్మంగా వుండేది" అన్నాడు.

కటువైన జవాబేదో చెబుదామని కానాయ్‌కి నాలిక చివరి దాకావచ్చింది. కాని అతడు తమాయించుకుని, నవ్వుతూ, సవినయంగా "నన్ను అలా పరిచయంచేసుకునేందుకు తగిన అవసరం రాలేదు" అని సమాధానమిచ్చాడు.

యజమాని వెర్రివాడిలా శూన్యంలోకిచూస్తూ, గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ చెప్పటం మొదలెట్టాడు. "మాష్టారూ! మీరింకా అప్పటికి పుట్టలేదు. మేమే చిన్నవాళ్ళం. సుఖమయ చక్రవర్తిగారి కొడుకులు - అంటే మీ తాతాగార్లు - ఎక్కిన గుర్రపుబగ్గీ నడివీధినపోతూంటే, రాస్తాకు రెండువైపులా జనం గుమిగూడి గ్రుడ్లప్పగించి చూస్తూవుండేవాళ్లు" అని అతడు దీర్ఘంగా నిట్టూర్చి "రఘుపతి కోసలనగరం, యదుపతి మధురానగరమే ప్రపంచంలోంచి లుప్తమైపోయాయి; మనమేముంది సామాన్యులం" అన్నాడు.

కానాయ్ దీనికేమీ జవాబుచెప్పలేదు. ఈ ఆధ్యాత్మిక వాక్యాలమాటున అతడికి ఎలాంటి వూహాలు వచ్చివుంటాయో కానాయ్ గ్రహించలేకపోయాడు. విలుప్తమైపోయిన గతంమీద మమకారం యేర్పడిందో లేక యిప్పుడు లుప్తమైపోతున్నదానికి భవిష్యత్తులో కలగబోయే విషాదాంతపరిణామాన్ని వూహించు కుంటున్నాడో కొంచెంసేపయేసరికి యజమాని ముఖంలోని కండరాలు ఉబికాయి. కానాయ్ ముఖంకేసి కొంచెం తీవ్రంగా చూస్తూ "నేను నా ఆస్తికంతకీ ట్రస్టును యేర్పాటుచేస్తున్నాను. నాఆస్తి పంపకంకాదు. ఎవరికీ అమ్ముకునే హక్కువుండదు. ఇందులో పనిచేస్తే అందుకు ప్రతిఫలంగా అలవెన్స్ మాత్రం వస్తుంది" అన్నాడు.

కానాయ్ కొంచెం నవ్వాడు. కాలానికివున్న విధ్వంసక శక్తిని యజమాని వ్యవహార దక్షత అనేవలతో బంధించెయ్యాలని చూస్తున్నాడు.

ఆగదిలో ఒంటరిగా కూర్చునివున్న కానాయ్‌కి ఒకదాని వెంట ఒకటి ఈ ఆలోచనలన్నీ వస్తున్నాయి. అప్పుడు యజమాని యుద్ధంసంగతి ఆలోచించివుండడు. ఒక వేళ ఆలోచించినా ప్రథమ ప్రపంచ యుద్ధాన్ని గురించే ఆలోచించివుంటాడు. అంటే వొక్క లాభాలసంగతే. బ్లాకౌట్, సైరన్‌లు, శత్రువుల బాంబరు విమానాలు, రిట్రించ్‌మెంటూ, ఇవాక్యుయేషన్ - ఈ గొడవలన్నీ ఆలోచించలేదు. ఇప్పుడు ఇవన్నీ ఆలోచిస్తున్నదీ లేనిదీ కానాయ్‌కి తెలియదు. అయినా అతడికి అనుమానంగానేవుంది. ఎంచేతంటే ఆయన ఈ యుద్ధంవచ్చాక క్రొత్తక్రొత్త వ్యాపారాలు యెన్నో మొదలెట్టాడు. ప్రస్తుతం బియ్యం వర్తకం ప్రారంభించి, గోడౌన్స్ నిండా వేలకువేల బస్తాలు బియ్యం నిలవచేసివుంచాడు. ఒక బియ్యమేకాదు, మైదా, పంచదారకూడా నిలవచేశాడు. కానాయ్‌కి సంగతులు అతడి శిష్యుడే చెప్పాడు.

హఠాత్తుగా ఒక నౌకరువచ్చి, "యజమానిగారు మిమ్మల్ని రమ్మంటున్నా"రని చెప్పటంతో అతడి ఆలోచనలన్నీ తెగిపోయాయి.

"నన్నా?"

"ఊఁ."

ఆలస్యమయినందుకు సంజాయిషి చెప్పుకోవాలి కాబోలనుకున్నాడు. ఒక్క క్షణంలో అతడిమనస్సు క్రౌర్యంతో రవరవలాడిపోయింది. గంభీరంగా నిట్టూర్చి లేచినుంచుని, "పద" అన్నాడు.

యజమాని గదిలో ఫర్నిచరు రెండు రకాలు. ఒకవైపునంతా విదేశీపద్ధతి—సోఫా, కౌచ్, టేబుల్, పెగ్‌టేబుల్—అన్నీ దొరల కార్ఖానాలో తయారయిన ఒకటోరకం ఫర్నీచరు. మరొకవైపున మెత్తలు.

ఈ మెత్తలు పాతకాలపు పద్ధతిని అమర్చినవికావు. పొడుగూ వెడల్పూ సమానంగావుండే 'డయస్' పద్ధతిలో-ముగ్గురు నలుగురు కూర్చునేందుకు సరిపోయే నాలుగు ఎత్తుబల్లలు, అవి టేబిల్ చుట్టూ కుర్చీలూ, సోఫాలూ అమర్చేపద్ధతిలో అమర్చివున్నాయి.

ప్రతిబల్లకీ సమానంగా కుట్టించిన మెత్తలు. వాటిమీద పసుపుపచ్చ రంగు దుప్పట్లు. వాటి మీద పచ్చటి గలీబులు తొడిగినదిళ్లు. ప్రతిబల్లప్రక్కన టీపాయ్‌లలాంటి రెండు మూడు చిన్న చిన్న ఎత్తుపీటలు. వాటిమీద అందమైన చిన్న పింగాణితొట్లూ, పాలరాతి గ్లాస్‌లూ. పింగాణితొట్లూ, 'ఆష్‌ట్రే' లకుబదులు, పాలరాతి గ్లాసులు పూల కుండీలకుమారుగానూ అమర్చబడ్డాయి. ఇటువైపు గోడలకి బెంగాలీ చిత్ర కారులు చిత్రించిన చిత్రాలు. సోఫాలూ, కౌచ్‌లూ వున్నవైపు గోడకు విదేశీ చిత్ర పటాలూ తగిలించి వున్నాయి.

యజమాని ఒక మెత్తమీద కూర్చుని హుక్కా పీలుస్తూ చెవులకు హెడ్‌ఫోన్స్ తగిలించుకుని రేడియో వింటున్నాడు. బహుశా ఏమే విదేశీ వార్తలో అయివుంటాయి. బెర్లిన్, రోమ్, టోకియో, సైగాన్ వార్తాప్రసారాలసమయం యిప్పుడుకాదు. బహుశా ఫిలడల్ఫియా, కాలిఫోర్నియా వార్తలై వుండవచ్చు. అదీకాకపోతే పేరుతెలియని ఏ దేశపు వార్తలో అయివుంటాయి. బయటకేమీ వినిపించకుండా వుండాలనే ఈ హెడ్‌ఫోన్సును ఉపయోగించటం. రేడియోకూడా ఒకటికాదు, రెండున్నాయి. ఒకటి భారతదేశపు వార్తలు వినేందుకు - రెండోది విదేశవార్తలు వినేందుకు. కానాయ్‌కి చిరునవ్వుతో స్వాగతమిస్తూ "ధన్యవాదాలు మాష్టారూ దయచెయ్యండి, దయచెయ్యండి" అన్నాడు యజమాని.

కానాయ్ శిష్యుడు అశోక్ యీసారి పరీక్షల్లో మూడో వాడుగా వచ్చాడు. కాని లెఖ్ఖల్లో మాత్రం మొదటివాడుగానే వచ్చాడు. నూటికి తొంభై మార్కులు కొట్టాడు.

కానాయ్ నిజంగా చాలా సంతోషించాడు. అతడు నవ్వుతూ "అశోక్ ఏడీ?" అని అడిగాడు.

"వాడు మీదగ్గిరకి రాలేదూ?"

"నాదగ్గిరకా?"

"ఆఁ వాడు ప్రొద్దున్నే మీదగ్గిరకని వెళ్లాడు."

"నేను చీకటీతోనే ఇంట్లోంచి బయలుదేరాను. దారిలో ఒకపనుండి చటుక్కున ఆగిపోవాల్సి వచ్చింది."

"అయితే వాడిప్పుడే వస్తాడు. కూచోండి. కాస్సేపు మాట్లాడుకుందాం" అని ఆయన 'బెల్' కొట్టాడు. నౌకరు వెంటనే వచ్చి నిలబడ్డాడు.

"రెండు కప్పులు టీ, మాష్టారి కేదయినా టిఫిన్ తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.

"ఉహూఁ.వద్దు నేనిప్పుడేమీ టిఫిన్ తినలేను.టీ ఒక్కటే—"

"అహాహాఁ. అలావీల్లేదు. ఇవాళ ఎలాగైనా మీనోటిని తీపిచెయ్యక తప్పదు. ఆదీగాక మీరుతిని యీ పదార్థాల పేర్లే మిటో ఎక్కడ తయారైనవోకూడా చెప్పాలి" అని యజమాని నవ్వటం మొదలెట్టాడు.

ఎక్కడివయితేయేం ఆ పదార్థాలు నిజంగానే బావున్నాయి. కానాయ్ యింకా యేమీ చెప్పకముందే యజమాని గొంతు తగ్గించి - "పంచదార కాస్త జాగ్రత్త చేసుకోండి" అన్నాడు.

కానాయ్ ఆయన ముఖంకేసిచూస్తూ ఊరుకున్నాడు. ఏమీ ప్రశ్నించలేదు.

"కొన్నాళ్ళదాకా బజార్లో ఇహ పంచదారనేది దొరకదు." అని మళ్ళీ రెండుదమ్ములు హుక్కాపీల్చి, "మైదా, బియ్యం, పంచదార ధరలు కొద్దిరోజుల్లోనే చుక్కలకంటుతాయి"అన్నాడు. ఈ మాటలో ధ్వనిస్తున్న చమత్కారమేమిటో యెవరికేంతెలుసు? కాని యజమాని మాత్రం తానేదో చమత్కరించినట్లు కొంచెం నవ్వుకున్నాడు.

తన స్తోమత గుర్తుకువచ్చి, కానాయ్ తనలోతానూ నవ్వుకున్నాడు.

"వ్యాపారం చేస్తారా మాష్టారూ?" అని అడిగాడాయన.

కానాయ్ ముఖంలో నవ్వు మాయమైంది. కొంచెం చకితుడై యజమాని ముఖంకేసి గంభీరంగా చూస్తూ ఊరుకున్నాడు.

ఆయన మధ్యమధ్య చిన్నచిన్న హుక్కాదమ్ములు లాగుతూ మాట్లాడుతున్నాడు—"మీరు సుఖమయచక్రవర్తిగారి మునిమనుమలై ఉండి, ఇప్పుడు ముప్పైఖరూపాయల జీతానికి ట్యూషను చెప్పటం చూస్తూంటే నాకు చాలా కష్టంవేస్తోంది" అని దీర్ఘంగా నిట్టూర్చి, బంకింబాబు "అన్నట్లు - 'బెంగాలీలకు బెంగాలీ లే సహాయం చెయ్యకపోతే యింకెవరు చేస్తారు?' మీకు సహాయం చెయ్యటం భావ్య మనుకుంటున్నాను. అదిగాక అశోక్‌కి మీరంటే చాలా అభిమానం" అన్నాడు.

కానాయ్‌కి తల్లి ముఖం, తమ్ముళ్లూ-చెల్లెళ్ల రోగిష్టి శరీరాలూ, పతనావస్థలోవున్న సుఖమయచక్రవర్తి భవనం - అన్నీ కళ్లల్లో మెదులుతున్నాయి.

"మీరు వ్యాపారం చెయ్యండి మాష్టారూ? నేను మీకు సహాయం చేస్తాను; అంటే బియ్యం, పంచదార, మైదా వగైరా- అమ్మింతర్వాత డబ్బుఇచ్చేపద్ధతిని ఇస్తాను. ఇవాళ బియ్యంధర యెంతో తెలుసా? పధ్నాలుగు రూపాయలు. రేపు బహుశా పదహారుదాకా పెరగొచ్చు. ఇవాళ కొని రేపు అమ్మితే చాలు- మణుగుకి రెండు రూపాయలు లాభం వుంటుంది. మీరుగనుక రోజుకి యాభై మణుగులు అమ్మగలిగిత్తే - ఒక్కరోజుకే వంద రూపాయలు లాభంవస్తుంది - నెలకు మూడువేలు, ఏడాదికి ముప్పైఆరువేలు లాభం...."

కానాయ్ శరీరంలో రక్తం దుడుకుగా ప్రవహించిసాగింది. చెవుల్లోంచి ఆవిర్లు వస్తున్నాయి. అరిచేతులు చెమటలు పట్టాయ్. కళ్లు మిలమిలలాడుతున్నాయి. ఊహాదృష్టికి ఎన్నెన్నో దృశ్యాలు

కన్పిస్తున్నాయి—తన తల్లి శరీరంనిండా నగలే. ఆమె కట్టుకుంటున్న వన్నీ పట్టుచీరెలే. ఆమెశరీరం నేవ్యంగా పయార్తైంది ఆమె ముఖం ప్రసన్నంగా ఉంది. తమ్ముళ్ళూ—చెల్లెళ్ళూ క్రొత్త బట్టలతో కళకళలాడుతున్నారు. తమ రక్తంలో గూడు కట్టుకు వస్తున్న విషాన్ని డాక్టర్లు ఇంజక్షన్ల సహాయంతో తొలిగించేశారు. తమ నాడుల్లో పవిత్రవంతమైన, ఆరోగ్యవంతమైన రక్తం ప్రవహిస్తోంది. తమ శరీరాలు రోగవిముక్తా లయినాయి. పతనావస్థలోవున్న సుఖమయచక్రవర్తి ఇల్లు మరమ్మతులతో బాగుపడి, చిత్రవిచిత్రమైన రంగులతో దివ్యభవనంలా ప్రకాశిస్తోంది. కలకత్తా రాజవీథుల్లో తన దివ్యరథం - రోల్స్‌రాయిస్ కారు - జోరుగా పరుగెడుతోంది...

యజమాని అలా మాట్లాడుతూ, మాట్లాడుతూ వుద్రేకంతో లేచి సరిగ్గా కూర్చున్నాడు.

"మీకుతెలుసా మాష్టారూ! మనమే గనుక స్వాతంత్రులమైనట్లయితే ఈ యుద్ధపు మార్కెట్‌లో యెంతెంత లాభాలు సంపాయించుకునేవాళ్లమో తెలుసా? బహుశా మీరు వూహించలేరేమో! ఇప్పుడు సిసలైన లాభాలన్నీ యూరపియన్ కంపెనీలకే పోతున్నాయి—తాళాలున్నది వాళ్ళచేతుల్లో గనుక. యోగ్యత, సామర్థ్యంవిషయంలో మాత్రం మనం వారికేమాత్రం తీసిపోము" అని మళ్ళీ - "చెయ్యండి. మీరు వ్యాపారం చెయ్యండి మాష్టారూ! నేను మీకు తప్పకుండా సహాయంచేస్తాను" అన్నాడు.

"రేపు చెపుతాను మీకు" అంటూ కానాయ్ ఉత్తేజితుడై లేచి నుంచున్నాడు. జీతం డబ్బు అడగటంమాటకూడా మరిచిపోయాడు.

"ఉండండి" అంటూ యజమాని బాలీసు క్రిందినుంచి కవరు తీసి అతడి కిస్తూ "అశోక్ మీకు కానుకగా ఇస్తున్నాడిది" అంటూ చిరు నవ్వు నవ్వి "అశోక్ పేరుతో వార్ కంట్రాక్టు"

ఒకటి తీసుకున్నాం. అందులో అశోక్ కిప్పుడు చాలా లాభం వచ్చింది. ఇనపతడికెల కాంట్రాక్టు'' అంటూ ఆయనకూడా లేచి, ''పదండి, బైట కంట్రాక్టరు కనిపెట్టు కున్నాడు. నేనూ వస్తున్నాను,'' అన్నాడు.

ఇద్దరూ కలిసి బైటికి వచ్చారు.

యజమాని ఇవాళ అతిధోరణిగా మాట్లాడేస్తున్నాడు—''అసంభవం అనుకున్న దాన్ని మీరు సులభంగా చేసెయ్యగలిగారు మాష్టారూ!''

కానాయ్ ఆయన ముఖంకేసి చూశాడు.

ఈసారి ఆయన బహుపరిజ్ఞానం వున్న వాడిలాగా మాట్లాటం మొదలెట్టాడు—''రూపాయి, అణా, పైసల లెఖ్ఖల్లాంటివి అందరికీ వస్తాయి—అది అసలు ఇంచుమించు మా వంశంలో విద్యే. కాని 'జామెట్రీ' 'ఆల్‌జిబ్రా'—ఈ రెండూ 'హయ్యర్ మాథ మెటిక్సు' అశోక్‌కి ఈ రెండింటిల్లోకూడా బాగా మార్కు లొచ్చాయి—వీటిల్లో తెచ్చుకొన్న మార్కులల్లా పదే''

మరొకరోజు నయినట్లయితే మాథమేటిక్సుమీద ఈ వ్యాఖ్యానం వింటూంటే కానాయ్‌కి ఆపుకోలేనంత నవ్వువచ్చేదే; కాని ఇవాళ నవ్వలేకపోయాడు. మైకం కమ్మిన వాడిలా నడుస్తున్నాడు. అతడి మనస్సులో సంఘర్షణ బయలుదేరింది. యజమాని తనని వ్యాపారంలోకి దిగమని ప్రోత్సహిస్తున్నాడు. ఈ ప్రోత్సాహం అతడి ఆదర్శాన్ని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానిస్తున్నట్లుంది. ఆయన వెనక తన తల్లి, తండ్రి తమ్ముళ్ళూ, చెల్లెళ్లూ—సంసారం యావత్తూ వరుసగా నిలబడినట్లు కన్పిస్తోంది.

వీరి ప్రహరీకి ప్రక్కనే రెండు మూడు కొఠారాలున్నాయి. ఈ మేడ కట్టించేప్పుడు తాత్కాలికంగా పనిముట్లూ అవీ జాగ్రత్త చేసుకోటానికని కట్టించినవవి. ఇప్పుడు ఊరికేనే వున్నాయి. వాటిముందు ఇప్పుడు బాఫుల్‌వాల్ [Baffle wall] తయారవుతోంది.

"దీన్ని 'పబ్లిక్ ఎయిర్ రైడ్ షెల్టర్'గా చేసేశాను" అన్నాడాయన.

ఇంతలో ఒక మేస్త్రీవచ్చి, సలాంచేసి, ఒక కాయితం ఆయనకి చూపిస్తూ "ఈ అక్షరాలు గోడమీద చెక్కించాలని పెద్దబ్బాయి గారు సెలవిచ్చారు. సున్నంపని అయినాక. 'బ్లాక్ లెటర్స్' చెక్కిస్తాను" అన్నాడు. **Public Air Raid Shelter Provided by Rai B. Mukherjee Bahadur** అని ఆ కాగితంలో రాసివుంది.

శిల్పదృష్టితో కనుక చూస్తే ఈ గోడమీద చెక్కించే అక్షరాలు కంటికి వికృతంగా ఉంటాయనో, హాస్యాస్పదంగా ఉంటాయనో చెప్పకతప్పదు. ఎంచేతనంటే 'పబ్లిక్ ఎయిర్ రైడ్ షెల్టర్'గా ఏర్పాటుచేస్తున్న కొఠారాలు రెండూ పదిపన్నెండు అడుగుల కన్న ఎక్కువపొడవు ఉండవు. కాని యీ వ్రాయించే అక్షరాలుమాత్రం పదిహేను అడుగుల పొడుగున వస్తాయి.

కానాయ్ నవ్వుకున్నాడు. నవ్వుకుంటూనే వారి ఆవరణ దాటి రోడ్డుమీదికివచ్చి కవరుతీసి చూసుకున్నాడు. అందులో ఓ నూరు రూపాయలనోటు ఉంది.

# ౭

అతడా నోటును దారిలో మార్చాడు.

ఎనిమిదిన్నర పెట్టి ఓజస కాబూలీ శాండిల్స్ కొనుక్కున్నాడు. నిజంగా బాగున్నాయి శాండిల్స్. పంచెలూ-చొక్కాలూకూడా కొనుక్కోవాలనివుంది; వాటి అవసరమూ ఉంది. కాని ఎలాంటి రకాల్లో—ఎంతధరలో కొనుక్కోవటమూ అనేది ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. మిల్లుధోవతులకీ నేతధోవతులకీ మధ్య ఉండే ధరలతేడా ఈమధ్య చాలా తగ్గిపోయింది. మిల్లుధోవతుల ధరలు పెరిగినంతగా నేతధోవతుల ధరలు పెరగలేదు. అంచేత సామాన్యసంసారులుకూడా ఇప్పుడెక్కువగా నేతధోవతుల్నే కడుతున్నారు. పదిరూపాయలకుబదులు పన్నెండు రూపాయలిస్తే కేవలం లజ్జానివారణకి బట్టకట్టుకున్నట్టుకాక, సర్దాకీ, ఫాషన్‌కీకూడా లోటుండదు. ఈరోజుల్లో రెండు రూపాయల లెక్కువ పెట్టటం అనేది ఓ లెక్కలోది కాదు. మామూలుగా అయితే ఇలాంటి లెక్కలు ఒకసారయినా అతడి మనస్సుకి తట్టేవి కావు. కాని (యజమాని ముస్తైప) ఆరువేలు లాభంవస్తుందని అంచనా వేసి చెప్పటం, అప్పటికప్పుడు నూరు రూపాయలు రొఖ్ఖం చేతిలోపడటం అతడి మనస్సుని గిలిగింతలుపెట్టేశాయి. అతడు వాళ్ళయింటినుంచి వస్తూ—తన మనస్సులో రేగుతున్న తర్జనభర్జనలకు పర్యవసానం ఏమిటో దారిలోనే నిర్ణయించుకున్నాడు. యజమాని ఆహ్వానాన్నే అంగీకరించి, తన ఆదర్శాల్నే వదులుకోవాలి. తన తండ్రి, చెల్లెళ్ళు, తమ్ముళ్ళు—ముఖ్యంగా తన తల్లి పడుతున్న కష్టాలు దుస్సహంగా ఉన్నాయి. కనుక తాను వ్యాపారంలోకే దిగాలి. అంచేత ఇహ ఇప్పుడు గుడ్డలు కొనుక్కోటానికి బదులు కొద్దిధరలో ఒక సూట్ కొనుక్కుంటే బాగుంటుం

దేమో అనికూడా అనిపించిం దొకసారి. వ్యాపారమంటూ ఎటూ, చేయతలుచుకున్నాక, ఓ సూట్ అయినా తప్పకుండా అవసరమవు తుంది. అంతలో మళ్ళీ—సీలమండల పైకి పంచె, ఒంటిని బనీనూ, పైన ఓ ఉత్తరీయిం—లేదా తలగుడ్డ ధరించి బిచ్చ్యం వర్తకంచేసే-అతడి పరిచితులైన కొందరు మర్వాడీలు, బెంగాలీ కోమట్లూ గుర్తు కొచ్చారు......ఇలా సందేహంలోపడి, తనకు అవసరమయిన పంచెలూ—అవీ చివరికతడు కొనుక్కోనేలేదు. బట్టలకొట్లోకి వెళ్ళినవాడు—తల్లికి రెండు ఎర్రఅంచుల చీరెలూ, రెవికల గుడ్డలూమాత్రం కొని, అక్కడినుంచి బయటికొచ్చాడు.

తల్లి తనకోసమే ఎదురుచూస్తూ నుంచున్న దల్లే ఉంది. ఆ చీరెలూ అవీ ఇస్తూ మరోయాభై రూపాయలుకూడా ఆమెచేతి కిచ్చాడు. ఆ చీరెల్ని అక్కడే పెట్టేసి, ఆమె నోట్లుమాత్రం లెఖ్కపెట్టుకు చూసుకుని, ఆతడి ముఖం కేసి చూసింది. "ఏమిటి ఇప్పుడే బజారుకి వెళ్ళమంటావా ?" అని అడిగాడు కానాయ్.

"ఉహుఁ. తర్వాత వెళ్లవచ్చు"

"సరే అయితే"

అప్పటికీ ఆమె ఇంకా అలాగే నుంచుంది. "ఏమిటింకా?" అని అడిగాడు కానాయ్.

తల్లి అతడికేసి చూస్తూనే "మిగిలినడబ్బు ?" అని అడిగింది.

కానాయ్ విస్తుపోయి ఆమెముఖంకేసి చూస్తూ ఊరు కున్నాడు.

"అశోక్ వచ్చి చెప్పివెళ్ళాడు. నూరు రూపాయలు బహు మతి వచ్చిందిటగా నీకు?"

అతడు తల్లిముఖంకేసి అలాగే చూస్తూ ఉండిపోయాడు. తల్లి అయితే వంచుకుంది కాని చాచినచెయ్యిమాత్రం చాచినట్లే ఉంచింది. కానాయ్ ఇంకేం మాట్లాడకుండా జేబు ఖాలీచేసి, మిగిలిన నోట్లూ, చిల్లరడబ్బులూ అన్నీ ఇచ్చేశాడు. ఆమె ఇహ లెఖ్కపెట్టి చూసుకోకుండానే తీసుకు వెళ్ళిపోయింది. అతడు

కొయ్యబారిపోయాడు. ఈ చిన్న సంఘటన అతడి మనస్సును బాగా గాయపరిచింది.

తలుపుచాటునుంచి ఓ ముఖం తొంగిచూసింది—అది అపూర్వసుందరముఖం—ఆ తొంగిచూసింది అతడి చెల్లెలు ఉమ—పధ్నాలుగు, పదిహేనేళ్ళ పిల్ల. ఉమలాంటి చక్కని పిల్లలు, ఈ కలకత్తాలో—శ్రీమంతులకీ, కులీనులకీ కూడా ఆటపట్టయిన ఈ మహాపట్నంలో—ఎక్కడో ఇద్దరో ముగ్గురో తప్ప అతడి కెక్కువమంది కన్పించలేదు. 'ఆసౌందర్యం ఆ ఇంటికొక వెలుగుపుంతను చేసింది' అని సాధారణంగా కావ్యాల్లోమాత్రం చదువుతూ ఉంటాం. కాని ఉమవిషయంలో దీన్ని అతిశయోక్తిగాకాక సహజోక్తిగానే ఒప్పుకోవచ్చు. ఇల్లు వెలుగుపుంతయితే కాకపోవచ్చుకాని, అపూర్వమైన ఓ చిత్రపటాన్ని గోడకి అలంకరిస్తే ఆగదంతా అపూర్వశోభతో ఎలా తొణికిసలాడిపోతూ ఉంటుందో—అలాగే ఉమ ఉండటంవల్ల ఈ ఇల్లుకూడా ఎంతో కళకళలాడుతూ ఉంటుంది. ఆమెవి విశాలమైన తెల్లటి ఉజ్వల నేత్రాలు, నల్లటి కనుపాపలు...మనస్సేమీ బాగుండనప్పుడల్లా కానాయ్ ఉమని పిలిచి కాస్సేపు కబుర్లాడుతూ ఉంటాడు. ఉమను చూడగనే అతడి మనస్సు ప్రసన్నమైంది.

"ఉమా!"

లజ్జా మందహాసాలను తొణకింపచేస్తూ, పైట చెంగు వేలికి మెలేసుకుంటూ ఉమ గదిలోకి వచ్చింది. అలా రావటంలో ఆమె మనస్సులో ఏదో సంకోచం ఉన్నట్లు కానాయ్‌కి స్పష్టమయింది అతడు నవ్వుతూనే "ఏమిటే విశేషాలు?" అని అడిగాడు,

"నీ శిష్యుడొచ్చాడు"

"అశోకా?"

"ఆఁ. అతడీతఫా లెఖ్ఖల్లో ఫస్టొచ్చాడ్ట!" అని కొంచెం గునుస్తూ "నాకో రెండుజతలు మామూలు గాజులు కొనిపెట్టాలి!" అని అడిగింది కానాయ్ చిరునవ్వు నవ్వాడు. ఉమ మళ్ళీ అలాగే

''ఇవాళ నీకు నూర్రూపాయిలొచ్చాయిట!'' అంది. కానాయ్ ఏదో జవాబు చెప్పబోయాడు; కాని ఇంతలో గుమ్మందగ్గిర ఎవరిదో చెప్పుల చప్పుడు విన్పించింది. అతడి తండ్రి లోపలికి వచ్చాడు. ఆయన ఉపోద్ఘాత మేమీ లేకుండానే ''నీకు నూరు రూపాయలొచ్చాయట! నాకో పదిరూపాయ లియ్యి'' అని అడిగాడు.

కానాయ్ ముఖం చిట్లించుకున్నాడు. తండ్రి డబ్బు తీసుకెళ్ళి పంచేసేదీ అతడికి తెలుసు. ఎలాగో తమాయించుకుని ''అంతా అమ్మకే ఇచ్చేశాను'' అని ఆ ఉద్రేకంలో ఖాళీజేబు పైకి తీసి చూపించాడు.

తండ్రి వెళ్ళిపోయాడు.

ఈ లోపుగా ఉమ అక్కడినుంచి ఎప్పుడు తప్పుకుందో కానాయ్ గమనించలేదు. అతడెలాగైనా ఉమ కోరికనుమాత్రం తీర్చాలి. వరాండాలో వాళ్ళ చిన్నపిన్ని నుంచుని ఉంది. ఆమె సుఖమయచక్రవర్తి మూడోకుమారుని కోడలు. వీళ్ళలాగానే ఆమెకూడా చితికిపోయిన శ్రీమంతుల యింటిబిడ్డ. ఆమెకి ఇంచుమించు కానాయ్ వయస్సే ఉంటుంది. ఆమెనోరు మాట్లాడుతూంటే నొసలు వెక్కిరిస్తూంటాయి. ఆ మాటలు బోయవాడి తూణీరంలోని బాణాల్లాగా ఒహుకరుగ్గా ఉంటాయి. ఆమె అసలు ప్రపంచాన్నేమీ లెక్కచేస్తూన్నట్లే ఉండదు. ఆమెకోరచూపుల్లో, ఆమె పెదవి విరుపుల్లో, ఆ బడబడ నడకలో, నడిచేప్పుడుండే ఆమె అవయవాల కదలికలో ఈసడింపంతా పొంగిపొర్లుతూ ఉంటుంది. అయితే ప్రపంచాన్నంతా ఇంత నిర్లక్ష్యంగా చూడదగ్గ సౌందర్యంకూడా ఉందామెకి. ఆ సౌందర్యప్రభావంవల్లనే త్రాగుబోతయినభర్త చేత త్రాగుడు మాన్పించి, అతణ్ణి తన అడుగులకి మడుగులొత్తేవాణ్ణిగాచేసుకుంది. కనుక విజయినిలాగా ప్రవర్తించగల అధికారం ఉందామెకి: ఆమె చిరునవ్వు నవ్వుతూ ''ఓ రోజున సినిమాకైనా తీసుకెళ్ళవోయ్ కానా!'' అంది.

''అలాగే''

"అలాగే అంటే కాదు. ఎప్పుడు తీసుకెడతావో చెప్పాలి మరి!"

"వచ్చే వారంలో"

అలవాటు ప్రకారం ఆమె మూతిపిరిచి, వెటకారంగా నవ్వుతూ "వంద రూపాయల మీదా వడ్డీవచ్చాక, ఆ డబ్బుతోకాని చూపించవనుకుంటా" అంటూ ఏదో ఆటలాగా కటకటాలమీద ముందుకు వాలి తుపుక్కున ఉమ్మేసింది.

కానాయ్ ముఖం కందగడ్డయి పోయింది. జ్ఞాతివైరం వ్యక్తమవుతున్న ఆ తీవ్రాఘాతం అతడి హృదయానికి విషలిప్త బాణంలా గుచ్చుకుంది. ఆమెమాత్రం నవ్వుకుంటూ తన గదివైపుకు వెడుతూ, ఆప్యాయతను ఒలకపోస్తున్నట్లు "అవాయం ఊరికే ఎగతాళికి అలా అన్నానోయ్ కానూ! ఒక వారంలోవచ్చే వడ్డీఉంది చూశావ్—అదికూడా ఆతర్వాత వారంలో అసల్లోకివచ్చి కలుస్తుంది. —మళ్ళీవారంలో ఆ వడ్డీకికూడా కొంతవడ్డీ వస్తుంది. తెలుసా!" అంది.

కానాయ్ ఆమెమాటలకి అడ్డువచ్చి "ఆగు పిన్నీ; నీ కాళ్ళకి మొక్కుతాను" అన్నాడు.

ఆమె గదిలోకి వెళ్ళి "వద్దులే బాబూ! నువ్వు లక్షాధికారివి, కోటీశ్వరుడివి కావాలని ఇక్కడినుంచే ఆశీర్వదిస్తాను" అంది.

కానాయ్‌కి ఒళ్లు మండిపోయింది. తన మనసులోని క్షోభంతా వెళ్ళకక్కగలిగిన కరుకైన జవాబేమీతోచక, అలాగే కొయ్యబారిపోయి నుంచున్నాడు. హఠాత్తుగా వెనుకనుంచి ఎవరో బలవంతాన నవ్వు ఆపుకుంటున్న నవ్వడి వినిపించింది. వెనక్కి తిరిగిచూసి తెల్లపోయాడు. ఎవరోకాదు, చిన బాబు మనుమడే—పద్ధెనిమిదేళ్ళ బాలాకుమారుడు. నగ్నంగా అద్దం ముందు నిలబడి, అందులో తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ నవ్వుకుంటున్నాడు. కానాయ్‌కి తల మరింత మండెక్కింది. అయినా

తమాయించుకోక తప్పదు. చినబాబు ఎంతో గారాబంగా పెంచుతున్న ఈ పద్ధెనిమిదేళ్ళ బాలుణ్ణి ఎవ్వరూ ఏమీ అనటానికి వీల్లేదు. 'ఇతడెవరో శాపభ్రష్టుడైన మహాపురుషుడు, భవిష్యత్తులో ప్రపంచ ప్రఖ్యాతుడవుతా'డని ఓ గొప్ప జ్యోతిష్కుడు ఈ బాలుణ్ణిగురించి జోస్యం చెప్పాడు. చినబాబు భార్యభగవంతుడికిచేసినట్లు-అతగాడికి సకలోపచారాలూ చేస్తూఉంటుంది. చినబాబు అతడికి నిత్యమూ మందూ-మాకూ ఇప్పిస్తూ రక్షించుకుంటూ వస్తున్నాడు. అతడి ఈ నగ్నతలోని అశ్లీలత దేవత్వానికి తొలిదశగా ముసలివాళ్ళముందు చలామణీ అవుతోంది. కోపంతో—అసహ్యంతో కానాయ్ మనస్సు నిబ్బరాన్ని కోల్పోతోంది. తన నిబ్బరం ఇంక ఎక్కడ పట్టుతప్పిపోతుందో అన్న భయంతో కానాయ్ అక్కడినుంచి గబగబా బైటికి వచ్చేశాడు. మెట్లవెనుకనుంచి చినబాబు భార్య 'కానూ!' అని పిలిచింది.

కానాయ్ వెనక్కి తిరిగిచూసి నిలబడ్డాడు. వాతారోగంతో కాళ్లు పట్టుకుపోవటంవల్ల ఆమె కటకటాల నానుకుని అక్కడే నిలబడి పోయింది. ఆమెది నిర్జీవమైన ముఖం. ఆ ముఖంలో అసలు ఏ భావము వ్యక్తంకానేకాదు. "నాకో పదిరూపాయలు బదులిస్తావ్? నీకు వందరూపాయలొచ్చాయని విన్నాను" అని నిస్సంకోచంగా అడిగిందామె.

కానాయ్ కఠినంగా "ఉహుఁ." అంటూ రెండో అంతస్తులోంచి దిగి, తన గదివైపుకు వెళ్ళాడు. చినబాబు మనుమరాలు యూథీ—సందుచిక్కితే చాటుగా రోడ్డుమీదికి పరుగెత్తుకెళ్ళి బిచ్చమెత్తుకునే పిల్ల—అతడిగదిలోంచి తుర్రున పారిపోతోంది. గదిలో తన చొక్కాలన్నీ క్రిందపడేసి ఉన్నాయ్. చొక్కాలేకాదు. చొక్కాల జేబుల్లోని ట్రాంటిక్కెట్లూ, కాగితాలూ అన్నీకింద చిందరవందరగా విరజిమ్మిఉన్నాయి. అతడి ముఖంలో వికృతమైన నవ్వు కన్పించింది. యూథీకూడా తన జేబులో ఆ వందరూపాయల్ని వెతకటానికే వచ్చింది.

కానాయ్ దీర్ఘంగా నిట్టూర్చాడు. సుఖమయచక్రవర్తి పృథ్విలోని మానవులనందర్నీ వంచించి, వాళ్ళచేత తినరానితిట్లన్నీ తిని, వారి క్రూరశాపాలకు గురిఅయినాడా యేం?

మూడో అంతస్తులోంచి చినబాబుకేకలు విన్పిస్తున్నాయి. 'కాళీఘాట్‌లో ఉన్న ఖాళీ స్థలాలమ్మేసి, రిజిస్ట్రార్ ఆఫీసునుంచి బయటికివచ్చాను. జేబులో చెక్కులయితే యేం, నగదయితే యేం, లఖాయ్యాభై వేలదాకాఉంది. రతనబాయ్‌యింటి కెళ్లి— చీకటిపడింది లగాయతు—రాత్రి పన్నెండయేలోపుగా పదివేను వందలరూపాయలు ఉఫ్‌న ఊదేశాను. రాత్రి పన్నెండింటికి నా గుర్రపుబగ్గీ చిత్పూర్ రోడ్డుమీదుగా వస్తోంది, చలికాలం. ఓవర్‌కోటు వేసుకుని, శాలువా కప్పుకున్నా చలిఆగటంలేదు. ఒక లైట్‌స్తంభంచాటున చలికి వణుకుతూ నుంచునిఉన్న నాట్యాంగనయిన ఓవేశ్య నాకంటపడింది. చటుక్కున ఆగి, తాపీగా చుట్టూ కలయచూశాను. ఒకతెకాదు—వరుసగా చాలామంది వేశ్యలు నుంచునిఉన్నారు. ఇంటికి వచ్చాను కాని నిద్రపట్టలేదు. మళ్ళీ మర్నాడురాత్రి పన్నెండు గంటలకు గుర్రపుబగ్గీయెక్కి ఆ రోడ్డునే బయలుదేరాను. ఈసారి నూరు రగ్గులు వెంటతీసుకు వెళ్లాను. ఆరోజుల్లో ఒక్కొక్క రగ్గు ఎనమిదేసి రూపాయలు. పదభ్రష్టుడైన ఏ ఢిల్లీపాదుషా వంశీయుడో - కలకత్తాలో మారు వేషంతో తిరుగుతున్నాడని మర్నాడు పట్నమంతా గగ్గోలు పుట్టిపోయింది. వందరూపాయలు! హరేరామ్! రామకృష్ణదేవ్ ఏమన్నాడు? మట్టి బంగారమే, బంగారమూ మట్టే అన్నాడు. రామరామ వందరూపాయలా? అరె! ఛీఛీ అన్యాయం! అంటున్నాడు.

కానాయ్ కిటికీదగ్గిరకు వచ్చి, చువ్వలు పట్టుకుని నుంచుని, రాస్తామీదికిఉన్న ఆ మురికిపేటకేసి గుక్కపట్టించి చూస్తూన్నాడు. దాదాపు పన్నెండయిందప్పటికి. పేటంతా సద్దుమణిగినట్టుంది. తొమ్మిదింటికే మగ వాళ్ళందరూ అన్నాలుతిని తమ తమ పనుల

మీద వెళ్ళిపోయారు. ఆడవాళ్లుకూడ తిళ్లుతిని, కాస్తా నడుములు వాలుస్తున్నారు. ఇంకా ఇప్పటికీ కొన్ని కొన్ని యిళ్ళల్లో పనులు చేసుకుంటుంన్న చప్పుడు విన్పిస్తోంది— ఆ ఇళ్ళల్లోని మగవాళ్లు పనులేమీ లేనివాళ్లు. వారి ఇళ్ళలో ఒంటిపూట భోజనాలే పరిపాటి. అంచేత భోజనాలకి వీలయినంత ఆలస్యంచేసి, పస్తుపడుకునే రెండోపూట తాలూకు కాలవ్యవధిని వీలైనంతవరకు తగ్గించుకుంటూ ఉంటారు.

గీతయింట్లో భోజనాలప్పుడే అయినట్లున్నాయి. ఆమె తండ్రి కొంచెం ఎండపొడ వున్న వసారాలో పడుకుని కునుకు తీస్తున్నాడు. మామూలురోజుల్లో అయితే ఈపాటప్పుడు అతడు సాధారణంగా లుంగీకట్టుకుని బీడీకాలుస్తూ కూర్చొంటూవుంటాడు. గీత తల్లి బామ్మాన్‌దీతో మాట్లాడతూ తాంబూలం వేసుకుంటోంది. గీత తమయింటి ముందువైపుజాగాలోవున్న వెదురుకటకటాల్ని ఆనుకుని, కొయ్యబారిపోయి నుంచునిఉంది. గీత ఇవాళ చాలా అందంగా కన్పిస్తోంది. కొత్తచీరె కట్టుకుని, తలవంచుకుని నుంచుంది తలంటిపోసుకున్న జుట్టు కాబోలు గాలికి రేగుతోంది. ఆ బామ్మాన్‌దీ ఏదో సంబంధం తీసుకొనివచ్చినట్లుంది. ఆమె తెచ్చిన కొత్తబట్టల్లో కొన్నిటిని మాత్రమే గీత తల్లి తీసుకుని, మిగిలినవి మళ్ళీవాళ్ళకిచ్చెయ్యమని ఆమెకిస్తోంది. బహుశా ఎవరో భాగ్యవంతుడూ, హృదయంగల వరుడై వుండాలి; అంతలోనే మళ్లీఅతడు కంపించిపోయాడు. ఒకవేళ ధనిక వృద్ధుడెవడైనా గీతను రెండో పెళ్లో, మూడోపెళ్లో చేసుకుంటున్నాడేమో! పేదవారైన పిల్ల తల్లితండ్రులకు లంచ మిచ్చి, వృద్ధాప్యంలోని తన అతృప్తలాలస పరుచుకోటానికి యత్నిస్తున్నాడేమో! మళ్ళీ మరుక్షణంలోనే మరో ఆలోచన వచ్చింది—పోనీ, అయితేమాత్రం ఏం? అలా అయినా గీతకింత తింటానికి, కట్టుకోటానికీ లోటుఉండదు. అంతేకాక ఆమె తల్లితండ్రుల దారిద్ర్యంకూడా తీరిపోవచ్చు. స్వేచ్ఛగా సుష్టగా ఇంత తినటానికి ఉండటంవల్ల ఆమె శరీరానికి కాస్తపుష్టి వస్తుంది.

అప్పట్లే—మనస్సులోని అసంతృప్తిని, విచారాన్నీ దిగమ్రింగటానికి ఇంత త్రాణనిస్తుంది.ఆ తర్వాత ఆమెకి సంతానం కలగవచ్చు. అప్పుడిహ మనస్సులోని దిగులూ—విచారమూ తుడిచిపెట్టుకుపోవచ్చు. కాని ఒకవేళ ఆ సంతానంకూడా తమ వంశీయుల సంతానంలాగానే వ్యాధిమయరక్తంతో జన్మించి, అకాలంలో మరణిస్తే అప్పుడు?... అప్పుడుకూడా గీతకి ఏదోవిధమైన ఓదార్పు కలుగుతుందేమో! కాని ఇహ ఆ సంగతులన్నీ ఊహించటాని కతడికి మనస్కరించలేదు. ఆమె శరీరంలోని పవిత్రమైన రక్తప్రసారంవల్ల, అమె దేహసౌష్ఠవంవల్ల ఆమెకి కలగబోయే సంతానం సకలవ్యాధివిషాన్నీ జయించగలగాలి అని అతడు అనేకవిధాల కోరుతున్నాడు—అలా ఆమెను ఆశీర్వదించాడు. అదీగాక జీవశాస్త్రజ్ఞులిటీవల వ్యతిక్రమ ఫలితాల్ని కూడా అంగీకరిస్తున్నారు. వ్యాధిగ్రస్తమైన వంశంలోకూడా ఆరోగ్యవంతమైన సంతానంకలిగే అవకాశాలున్నాయట!

సరే—కాని తన సంగతేమిటి? తాను అనుసరించాల్సిన మార్గం ఏమిటి? కొన్ని క్షణాలక్రితం అతడింటికి వస్తూ వస్తూ, దారిలో చేసుకున్న నిర్ణయాలన్నీ ఇప్పుడు తల్లకిందులయినాయి. కూలిపోతున్న సుఖమయ చక్రవర్తి ఇంటి తాలుకు చౌడురికిపోతున్న ఇటికలన్నీ క్షుధతో ఆవురావురు మంటున్నాయి. కేవలం క్షుధయినా ఫర్వాలేదు—వాటి అంతరాంతరాల్లో అసహ్యమైన లోలుపతకూడా వుంది. అదే అతడి నిశ్చయభిత్తిని కూసింది. ఆ చవుడురికిన రాళ్ళను ఎంతఖర్చుపెట్టి బాగుచేయించనా మళ్ళీచవుడురకక మానవు. వాటి నిజస్వరూపం మళ్ళీ ఎలాగూ బయటపడి తీరుతుంది.

# ౮

బ్లాకౌట్ లోవున్న కలకతా శుక్లపక్షపు తొలి రోజుల రాత్రులు. చంద్రుడు అస్తమించాడు. భూమ్మీదవున్న ఈ మహానగరం లోని విద్యుద్దీపకాంతులు ఒకప్పుడు పైకిఎగజిమ్మి ఆకాశంలో ప్రయాణిస్తున్నట్లుండేవి. కాని ఈనాడు ఆకాశంలో తిరుగుతున్న శత్రువుల యినపడేగల దృష్టిలో పడకుండా ఉండటానికి, ఆ దీపాల కాంతులు కాంతినివారణసాధనలతో మరుగుపరచబడ్డాయ్. ఇప్పుడు చూస్తుంటే— గడ్డగట్టిన కారుచీకటి, తారులాగా కరిగి ఈ పట్నంలోని ఇళ్ళ కప్పులనిండా, రోడ్లనిండా అలుముకుపోయిందా అనిపిస్తోంది. ప్రేతకన్నుల్లాంటి కాంతిలేని దీపాలతో కార్లు, బస్సులు, ట్రాములు చీకట్లో రోడ్డుమధ్యనుంచి చప్పుడు చేసు కుంటూ రంయ్‌న వస్తున్నాయి: పోతున్నాయి. బస్సుల్లో ట్రాముల్లో ఉన్న గుడ్డి దీపాల వెలుతురులో ప్రయాణీకుల ముఖాలు భాసా భాసంగా మాత్రమే కన్పిస్తున్నాయి. గుర్తుపట్టేందుకు వీల్లేదు. ఆకృతంటూ పర్పుశని ఒట్టి అవయవాల సముదాయమే ప్రయాణి స్తోందా అనిపిస్తుంది. రిక్షాలో ప్రయాణం చేస్తున్నవారి కసలేమీ కన్పించటంలేదు. క్రింద కాగితంతో కప్పిన దీపాలు రెండు మసక చుక్కల్లా పరుగెడుతున్నాయి. మరీదగ్గిరగా చూస్తేమాత్రం పరుగె డుతున్న మనిషి తాలూకు కాళ్లురెండూ పైకిలేచి మళ్లీ నేలమీదికి ఆనుతున్న కదలికమాత్రం కన్పిస్తోంది. కాలి బాటలమీద జనం అలికిడికాకుండా, కాళ్లణచుకుని నడుస్తున్నారు.

రోడ్డు కిటూ అటూఉన్న కొట్లల్లో దీపాలయితే వెలుగు తున్నాయి; కాని వాటికాంతుల్ని కూడా రోడ్డుమీదికి ప్రసరించ కుండా కాంతి నివారణ సాధనాలతో కప్పేశారు. కొన్నికొన్ని పెద్దపెద్ద దుకాణాల్లోని ఎక్కువశక్తిగల విద్యుద్దీపాలకాంతులు ఈ అవరోధాలనన్నిటినీ చీల్చుకుని, అక్కడక్కడ రాస్తామీదికి

అగ్ని కణాల్లావచ్చిపడుతున్నాయి. చీకట్లో నడుస్తున్న మనుష్యులు వాటి వెలుతురులోకి వచ్చినప్పుడు కొద్దిసెకన్లుమాత్రం నల్లటి ఆకారాల్లాగా కన్పించి మళ్ళీ చీకట్లో కలసిపోతున్నారు. ట్రాములు నడవటానికాధారాలైన విద్యుత్తంత్రులు - అక్కడెక్కడో ఏరాపిడివల్లనో మెరుపుల్లాగ తళుక్కుమని మెరసి ఆ చీకటిని మరింత చీకటిమయం చేస్తున్నాయి. రోదసిలో ఎక్కడో విమానాలధ్వని విన్పిస్తోంది. ప్రక్కప్రక్కగా రెండు తోకచుక్కల్లాగా ఎరుపు—నీలపురంగుల కాంతి బిందువులు రెండు ఆకాశంలో ఒకవైపునుంచి మరొకవైపుకు పరుగెడుతున్నాయి.

కానాయ్ ట్రాంలోంచి దిగాడు. సాయంకాలందాకా అతడు కర్జన్‌పార్కులోనే కూచుని గడిపాడు. అటు యజమాని చెప్పిన మాటలు ఇటు ఇంటిదగ్గిర పరిస్థితులు—అన్నీ ఆలోచించాడు. నెలకు మూడువేల సంపాదన! ఈ యుద్ధంకనుక ఇలాగే కొన్నసాగితే, నేడు మూడువేలనుకున్నది రేపు ముప్ఫైవేలు కావొచ్చు. యుద్ధంసాగక ఏమవుతుంది? పృథివిలో ఈ కొసనుంచి ఆ కొసదాకా ఎక్కడచూసినా యుద్ధమే. అట్లాంటిక్ దగ్గర్నుంచి పసిఫిక్‌వరకూ నీటిమీద, భూమ్మీద, గాలిలో అంతటా చెలరేగిన యుద్ధం హఠాత్తుగా ఎలా ఆగిపోతుంది? ఎంత అప్రతిహతగమనమైనా ప్రకృతిలోని ఏప్రత్యక్ సంచలనంతోనో ఉన్నట్లుండి తక్షణ ఆగిపోవటానికిదేం భూకంపంకాదు, తుపానుకాదు, ఉప్పెనకాదు, యుద్ధం మానవులచేతుల్లోది. ఏ అభిప్రాయసిద్ధికి ఈ యుద్ధం ప్రారంభమయిందో - అది సిద్ధించేవరకు లేదా సర్వం సంపూర్ణంగా ధ్వంసమయేంతవరకు వారీయుద్ధాన్ని విరమించరు. ఏకృత్రిమ వైషమ్యాలవల్ల వారీసంగ్రామాన్ని ప్రారంభించారో—ఈ సంగ్రామం సద్దుమణిగి ఆ వైషమ్యాలొకవైపునుంచి సమసిపోతున్నా వాటిని మరొకవైపునుంచి మానవులు మళ్ళీ వృద్ధిచేసుకుంటూనే ఉంటారు. అథవా ఈ యుద్ధం ఆగిపోయినా మరొక యుద్ధానికి పునాదులు వేసికాని ఆగిపోదు. కనుక ఇహ మూడువేలూ

ముప్పైఫవేలుకాదేమో అన్నసంకోచం పెట్టుకునేందు కవకాశమే లేదు. మరుక్షణంలోనే మళ్లీ చటుక్కున అతడి ముఖంలో నవ్వు మెరిసింది. మూడు వేలయినా ముప్పైఫవేలయినా యెంత? దారిద్ర్యంతో మేళేసిపోయి, ఇసుకయెడారిలా ఉన్న తమ సంసారంలో మూడు వేలుకాదు—ముప్పైఫవేల బిందువులయితేమాత్రం ఎంత? మరుతృష్ణలాంటి ఆ తృష్ణను ఇవాళతడు ప్రత్యక్షంగా చూశాడు.

ఓ పెద్దనిట్టూర్పు విడిచి, కానాయ్ మళ్లీ తన జీవితస్వప్నాలనుగురించి ఆలోచించ సాగాడు. యమ్. యస్‌సి. ప్యాసు కాగానే పరిశోధనలుసాగించి, ఏదో ఓక్రొత్తవిషయాన్ని కనిపెట్టాలని—అతడు విద్యార్థిగా ఉన్నన్నాళ్లూ ఆశలు పెట్టుకుంటూ వచ్చాడు—కలలు కంటూవచ్చాడు. ఆతడి కిప్పుడు మనస్సంతా పీకుతున్నట్లుంది. ఐశ్వర్యాన్ని ఆరాధించి మాత్రం తానేంచెయ్యగలడు? దారిద్ర్యదుఃఖం ఎంత దుస్సహమైనదయినా, సంపదలన్నీ విషాదాంతంగా పరిణమిస్తున్నదశలో జన్మించాడతడు. అంచేతనే సంపదలంటే; ఏవగించు కుంటాడు. అవంటే భయపడుతుంటాడు. సంపదలను కూడబెట్టినా వాటి సహజగుణాన్ననుసరించి, అవి కరిగిపోయి, నురుగుకట్టి బుసబుసపొంగే మత్తుపదార్థంలా మారిపోతాయి. పళ్లూడిపోయిన సుఖమయ చక్రవర్తి వంశ వక్త్రింతాలూకు హీనమైనలోలుపత ఎంతెంతేసి వాటినైనా ఎలాభ్రమింగే సెయ్యగలదో అతడు కళ్లారా చూశాడు. అదీకాక తాను దీక్షపూని సాధించాలనుకున్న ఆదర్శానికిది అన్నివిధాలా విడిచిపెట్ట తగినమార్గం.

భయంకర ద్వంద్వయుద్ధం. రోజల్లా ఇంట్లోకూచుని ఆలోచించినా ఒకనిర్ణయానికి రాలేకపోయాడు. సాయంత్రం మంతా సర్ అశుతోష్‌ముఖర్జీ శిలావిగ్రహం యెదుట ఆలోచిస్తూ నుంచున్నాడు. నీల ఆఫీసునుంచి రాగానే ఆమెదగ్గిరకెళ్ళి సలహా తీసుకుందామని బుద్ధిపుట్టింది. కాని నీల ఇవాళ ఒంటరిగా రాలేదు. కొంతమంది స్నేహితురాండ్రతో కలిసివచ్చింది. కానాయ్ మనస్సుకు

ఏలాగో అనిపించింది. ఫ్యాళ్ళందరిమధ్యకి వెళ్ళి నీలని మాత్రం ఇవతలికి పిలవటాని కతడికి మనస్కరించలేదు. చెలులతో సరదాగా కాలక్షేపం చేస్తున్న నీలకి కానాయ్ గొడవలన్నీ వినేందుకు తగిన మనఃస్థితి ఎలా ఉంటుంది? అతడి సమస్యలకన్నిటికీ ఆమె ఎలా జవాబు చెప్పగలుగుతుంది! నీల కంట పడకుండా కానాయ్ జన ప్రవాహంలో కలిసిపోయి, కర్జన్ పార్కులోకిపోయి కూచున్నాడు.

ఇప్పటిదాకా అక్కడేకూర్చుని గడిపి వస్తున్నాడు.

ట్రాందిగి ప్రక్క సందులోకి వచ్చాడు. ఆ సందంతా చీకటిమయం. దీపాల్ని కాంతి నివారణసాధనాలతో కప్పి వెయ్యటంవల్ల, ఆ సందులో మూడు లైట్‌స్తంబా లున్నప్పటికీ అక్కడక్కడ గుడ్డివెలుతురు మాత్రమే ఉంది. అట్టే రాకపోకలరద్దీ లేనిసందు. చలి కాలపు రాత్రికావటంవల్ల అటూఇటూ ఉన్న ఇళ్ళ వీధితలుపులూ—కిటికీల తలుపులూ మూసివున్నాయి. ఆ సందు మొగని పెద్ద రోడ్డు ప్రక్కనుంచి హఠాత్తుగా ఎవరిదోకారు అతడి ముందునుంచే తుర్రున పరుగెత్తింది. మరుక్షణంలోనే బ్లాక్ ఔట్ షేడ్ వున్న హెడ్‌లైట్ వెలిగింది. ఇంతసేపూ కారు స్టార్ట్ అయ్యే ఉన్న దక్కడ. కానాయ్ చటుక్కున త్రుళ్ళిపడ్డాడు. మళ్ళీ అంతలో ఆశ్చర్యపోయాడు. కారు వెళ్ళి పోతూంటే వెనకవున్న నంబరు కంటపడింది. బాగా పరిచితమైన నంబరు; అతని శిష్యుడు అశోక్ వాళ్ళ కారు నంబురులా ఉంది. కారుకూడా వాళ్ళ చిన్న కారులా సరిగ్గా అలాగే వుంది. ఏం తేడాలేదు. అతడు తమ యింటి ముందు పోర్టికోలోకి వచ్చి నిలబడ్డాడు.

"ఎవరు?" ఎవరో వ్యక్తి నుంచుని వున్నాడు. పోలిక మాత్రం తెలియటంలేదు.

"నేనే, నేపీని" అంటూ పద్ధెనిమిది పంథొమ్మిదేళ్ల యువకుడు ముందుకి వచ్చాడు.

"అరె! ఏమిటి? నేపీ! ఈ పాటప్పుడు—?"

"రేపు జనసేవాసమితి మీటింగు. మీరు రాక తప్పదు. చెప్పి పోదామని వచ్చాను. మా కుర్రవాళ్ళ ఫిర్యాదులు చాలా వున్నాయి. మీరు మాతరఫునమాట్లాడాలి"

కానాయ్ ముఖంలో మళ్ళీ మందహాసం కన్పించింది. అందులో వ్యంగ్యత లేదు. స్నేహమిశ్రితమైన చిరునవ్వు. నేపీ అంటే అతడికి చాలా ఆపేక్ష. నీల సోదరుడతడు; అమాయకుడు. ప్రపంచ మానవ విముక్తి కలగబోతున్నట్లతడు నిత్యమూ కలలు కంటూ ఉంటాడు. తిండి అక్కర్లా, నిద్ర అక్కర్లా. పగలని లేదు, రాత్రిఅనిలేదు—ఎప్పుడూ కర పత్రాలకట్ట చంకన పెట్టుకుని, పంచిపెడుతూ తిరుగుతుంటాడు. లేదా గోడలకి మీటింగ్‌ల తాలూకు పోస్టర్లు అతికిస్తూ ఉంటాడు. అదీ కాకపోతే ఆకలితో ఆవురావురుమంటున్న ఆర్తులనందర్నీ పిలుచుకువచ్చి ఉద్రేకావేశపరుస్తూ వుంటాడు. 'మానవులందరికీ తిండి కావాలి. రొట్టెకావాలి' అని ముక్తకంఠంతో ఘోషిస్తూ వుంటాడు. వారి కోసమై పాటుపడటానికి తనకి దీర్ఘాయువు కావాలని కోరుకుంటూ వుంటాడు. ఇన్‌క్లాబ్ జిందాబాద్ ! ఇన్‌క్లాబ్ జిందాబాద్ !

నేపీ కొంచెం బలవంతంచేస్తూ "మీరు రాక తప్పదు కానాయ్‌దా !" అన్నాడు.

"అలాగే ... సరేకాని నీ భోజనమయిందా ?" నేపీ దిన చర్యనుగురించి నీల చెప్పిన సంగతులు గుర్తుకొచ్చాయి అతడికి.

"లేదింకా. ఇదుగో, ఇంటికే వెడుతున్నా." చీకట్లో కన్పించకపోయినా అతడి మధురకంఠస్వరాన్ని బట్టి, అతడు చిరునవ్వునవ్వుతూ ఈమాట అన్నట్లు కానాయ్ గ్రహించాడు. "ఉండు వస్తున్న" అని కానాయ్ గబగబా ఇంట్లోకివెళ్ళాడు. సుఖమయ చక్రవర్తి భవనమంతా చీకటిగా ఉంది. ఎలక్ట్రిక్ కంపెనీకి బిల్లు చెల్లించలేకపోవటం మూలంగా కనక్షన్ చాలారోజులక్రితమే కట్

చేశారు. ఇంట్లో అక్కడొకటి అక్కడొకటి లాంతర్లయితే వెలుగు తున్నాయి. కాని మెట్లగది, ముందరి వరాండా చీకటిగానే ఉన్నాయి. అలవాటుప్రకారం అతడు సరాసరి తల్లిగదిలోకి వెళ్ళాడు. తాను డబ్బుతెచ్చి ఇచ్చిందివాళేకనుక తినటానికేదో ఒకటి వుండకుండా ఉండదు. కనీసం తనకోసమని వుంచిన భోజన మైనా నేపికి పెట్టించాలనుకున్నాడు. తలుపు ఇట్టే నెట్టగానే చటుక్కున తెరుచుకుంది. ఆ దృశ్యంచూసి కానాయ్ గుమ్మం లోనే కొయ్యబారిపోయాడు.

అతడి తండ్రి విస్కీబాటిలొకటి ముందు పెట్టుకుని కొంచెం కొంచెం త్రాగుతూ కూచున్నాడు. తల్లి కంచంలో భోజన పదార్థాలు వడ్డిస్తోంది. వాసననుబట్టి అది మాంస భోజనమని సులభంగానే తెలుస్తోంది. తల్లి అతడికేసి చూసి సిగ్గుతో నాలిక కొరుక్కుని తలమీద చెంగు సవరించుకుంది. కైపెక్కి కెంపుల్లా వున్న కళ్ళతో తండ్రి అతడికేసి చూస్తూ "మీ అమ్మ నాకు పది రూపాయలంటే సరిగ్గా పదిరూపాయతే ఇచ్చింది." అని బాటిల్ చేస్తో పట్టుకుని "ఎనిమిదిరూపాయల ముప్పావలా - ఇదైనా దేశ వాళీ విస్కీ. ఏంయుద్ధం వచ్చిపడిందిరా నాయనా! ఇంకో రెండుంబావలా యిచ్చి ఒకటోరకం మటన్ తీసుకొచ్చాను." అని భార్యకేసి చూస్తూ "కానూకికూడా పెట్టూ కాస్త, రుచి చూస్తాడు" అన్నాడు.

కొయ్యబారినవాడిలా కానాయ్ కాస్సేపు అలాగే నిలబడి పోయాడు. హఠాత్తుగా అతడి కళ్ళకేదో మెరుపులా మెరిసింది. చవుడురిసిన చక్రవర్తిగారింటి ఇటికరాళ్లు కళ్ళకు కట్టినట్లు కనిపించాయి. వెంటనే అతడు తలుపు దగ్గిరగా లాగేసి బైటికి వచ్చాడు. ఆశ్చర్యం! అన్నపూర్ణ విశ్వేశ్వరునికి నివేదనచేస్తున్నట్లు, తనతల్లి కైపెక్కికూచున్న భర్తకి మద్య మాంసాలు వడ్డిస్తోంది. ఇప్పటి కిప్పుడు ఏ భూకంపమైనావచ్చి, ఈ సుఖమయచక్రవర్తి గృహాన్ని కుటుంబంతోసహా ధాత్రీగర్భంలో లినంచేసేస్తే—తాను జయ

జయధ్వనాలు చేస్తూ ఈశ్వరుడున్నట్లు సర్వాత్మనా ఒప్పుకుంటూ మరణించగలనుకదా అనుకున్నాడు—అరె ! నేపీ ఏడీ ?

నేపీ వెళ్ళిపోయాడు, చిత్రమైనవాడు. బహుశా మళ్ళీ ఏపనో జ్ఞాపకం వచ్చివుంటుంది. లేకపోతే వెళ్ళేవాడుకాదు. ఉహుం. మళ్ళీ వస్తున్నాడల్లే వుంది. చీకట్లో ఏదో తెల్లటి కదలిక ను గమనించి కానాయ్ కొంచెం ముందుకువచ్చి "నేపీ !"అని పిలిచాడు.

"కాదు బాబూ ! మేము" ఎవరిదో ప్రౌఢ స్త్రీకంఠం అది. ఆమెవెనక మరెవరో ఎక్కెక్కి ఏడుస్తున్నారు.

కానాయ్ ఆశ్చర్యంతో "ఎవరూ ?" అని ప్రశ్నించాడు. అతడా ప్రాంతంలో వుండే వాళ్ళని చాలామందిని యెరుగు ఆ ఏడుస్తున్న వారి ఏడుపు మరీ ఎక్కువైంది.

ప్రౌఢ, ఆవ్యక్తిని చెయ్యిపట్టుకుని "చీకట్లో కాలుజారింది కాయనా!....ఊఁ. రా, ఇంటికిరా" అని లాగుతోంది.

ఆమె పొర్లిపొర్లి ఏడుస్తూ "ఉహుఁ. రాను నేను" అంటోంది.

కానాయ్ ఇప్పుడాకంఠం గుర్తుపట్టాడు. అంతులేని ఆశ్చర్యంతో "గీతా !" అని పిలిచాడు.

ప్రౌఢ వెంటనే వెనక్కితిరిగి "సరే, ఇహ నువ్వు ఇంటికి వెళ్లు. నేను వెడుతున్నా." అంటూ ఆమె వీలైనంత గబగబా వెళ్ళిపోయింది.

గీతమాత్రం ఎక్కెక్కి ఏడుస్తూ, ఆ చీకట్లో అక్కడే కూలబడింది.

"ఏంజరిగింది గీతా? ఏంజరిగింది? లే-లే" గీత పొర్లిపొర్లి ఏడుస్తూ నేలమీద దొర్లసాగింది.

"ఏంజరిగిందో చెప్పు గీతా!"

గీత ఆ ఏడుపులో ఎలాగో" నాకు కాస్త విషం తెచ్చిపెట్టు కానూదా!" అని మాత్రం అనకలిగింది.

కానాయ్ కంపించిపోయాడు. బహుశా అవ్యక్తుడీమె తనకి నచ్చలేదని చెప్పేశాడేమో!

అతడు తలవంచుకుని నుంచున్నాడు.

"ఇంకా నా మొహం ఎలా చూపించేది?" అన్నది గీత.

కానాయ్ స్నేహపూర్వకంగా ఆమెని చెయ్యిపట్టుకొని లేవతీసి, దగ్గిరకి తీసుకుంటూ "అసలేం జరిగిందో చెప్పూ" అని అడిగాడు.

"ఆ జామూన్‌దీ...నన్ను............"మళ్ళీ బావురుమంది.

అతికష్టంమీద ఎలాగో గీత చెప్పగలిగిందంతావిని, కానాయ్ రాయి అయిపోయాడు. జామూన్‌దీ ఈమెని ధనవంతుడైన వరుడి కెవరికో చూపించటానికని తీసుకెళ్ళింది. అతగాడు గీతఫొటోను చూసి, ఆమె తల్లి తండ్రులకుకొత్తబట్టలు పంపుతూ, పిల్లను తాను స్వయంగా చూడటానికి జామూన్‌దీతో ఇక్కడకి పంపమని ఆమె ద్వారనే కబురు చేశాడు. అంత ఐశ్వర్యవంతుడు ఈ మురికిసందులోకి వచ్చి పిల్లనుచూడటం ఎలా? అసంభవం! జామూన్‌దీ గీతని తన యింటికి తీసుకెళ్ళింది. ఆమె ఇంట్లో రహస్యంగా దేహవిక్రయం, వ్యాపారంగా సాగుతోంది. జామూన్‌దీ అదే వ్యాపారసరళిని కొంత వెలకి గీతదేహాన్ని విక్రయంచేసింది.

"నేనెలా బ్రతికేది కానూదా?" అని ఏడ్చింది గీత.

"ఛీ!ఛీ!మీ అమ్మా—"

అతడీ మాటకు గీత అడ్డంవచ్చింది-"అమ్మకి తెలుసు కానూదా! అమ్మకి తెలుసు"

"తెలుసా?"

"ఆఁ. తెలుసు. కచ్చితంగా తెలుసు. తెలియకపోతే నన్ను పంపేటప్పుడు 'జామూన్‌దీ ఎలా చెపితే అలా నడుచుకో అమ్మాయ్' అని ఎందుకు చెపుతుంది? నీమీదవచ్చే శుల్కంతోనైనా మేము రెండు మెతుకులు తినగలుగుతాం. లేకపోతే తిండికి మాడి చావాల్సి వస్తుం' దనికూడా అన్నది"

గాఢాంధకారమయినా పృథివితాలూకు విచిత్ర స్వరూప మేదో కానాయ్‌కి కళ్ళకి కట్టినట్లు కన్పించింది. ఈ భూదేవి శరీరమంతటా ఎక్కడచూచినా దుష్టక్షతాలే. సుఖమయ చక్ర వర్తి వంశరక్తమే ఈ విశ్వమంతటా వ్యాపించిందా? ఈ పృథివిమీద ఎక్కడచూచినా ఆ చవుడురిసినరాళ్ళేపడిఉన్నాయా?

"లేకపోతే అమ్మ అసలు ఆ బట్టలూ అవీ ఎందుకు తీసుకుం టుంది? అమ్మ ఒక్కతె కేకాదు కానూదా! నాన్నకికూడా తెలుసు" అని గీత మళ్ళీ కుమిలికుమిలి ఏడ్చింది.

కానాయ్ నిరుత్తరుడైనాడు.

"నే నేంచేసేది కానూదా?"

కానాయ్ ఆమెచేతిని గుప్పిట్లోకి తీసుకుని,—గట్టిగా పట్టుకుని, "నన్ను నమ్మి నా వెంట రాగలవా గీతా!"అనిఅడిగాడు.

గీత తెల్లబోయి అతడి ముఖంకేసిచూస్తూఊరుకుంది.

కానాయ్ ఆ కారుచీకట్లోకి దారిచూపుతూ "రాగలిగితే రా నాతో" అని ముందుకాలు సాగించాడు.

"మీ యింటికా?"

"ఉహూఁ. ఇంక ఈ యింటితో నాకేం సంబంధంలేదు"

౬

వస్తుతః వంగదేశీయులకు-ముఖ్యంగా పశ్చిమప్రాంతీయులకు— జీవితంలో ఒక పిసరు పిరికితనం ఎక్కువ అన్న అపవాదు అంతా అబద్ధం కాదు. వారికి ఊహలైతే ఎన్నెన్నో ఉంటాయి, కాని ఆ ఊహల్ని కార్యరూపంలోకి తెచ్చుకోగల వాస్తవికజ్ఞానం మాత్రం సున్న. కార్యరంగంలోకి అడుగుపెట్టి పర్యవసానం ఏమవుతుందా అన్న ప్రసక్తిలేకుండా చరచరా ముందుకు చొచ్చుకుపోవటమంటే వారికి భయం—అంతవరకు మాత్రం నిజం. దీన్నిగురించి మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఎన్నెన్నో వ్యాఖ్యలు చేశారు. వైష్ణవుడెంటయిన కానాయ్‌కూడా ఆ వ్యాఖ్యాల్ని ఆమోదించాడు సుఖంగా నిర్వికారంగా జీవించటానికి అనువైన వంగదేశంలోని సస్యసంపద, స్వయం సమృద్ధములైన ఆ గ్రామాల్లోని సామాజిక వ్యవస్థ, వారిలోని కర్మశక్తిని అలసత్వంతో కప్పిపుచ్చి, క్రమశః వారిని నిద్రావస్థలోకి లాగేశాయ్. పరుల సంపదలను కబళించాలనే వాంఛకి ముఖ్యంగా వుండవలసిన-సాహసంతోకూడిన తెగింపు, ఉద్వేగం వారి దేహకోశంలో, బీజకోశంలో నిద్దరోతున్నాయి.

కానాయ్ తనలోని కర్మశక్తితాలూకు ఆది సాహసాన్ని జాగృతంచేసుకోటానికెన్నోసార్లు ప్రయత్నించాడు. సుఖమయ చక్రవర్తి మొదలుకొని తన తండ్రివరకూ మూడు తరాలనుంచి నిద్రావివశమైఉన్న ఆ శక్తినీ—కేవలం విశ్రాంతికలిగించేదిమాత్రమే కాక ప్రస్తుతం వ్యాధిగా పరిణమించిన ఆ నిద్రనీ—ధ్వంసం చెయ్యటం అతడి కంత సులువుగా సాధ్యంకాలేదు. సుఖమయ చక్రవర్తి రాక్షస మాయమూలంగా గాఢనిద్రలో ఉన్న ఆ గృహాన్ని వదిలెయ్యాలనీ, నూతనయుగంలోని, నూతనమానవ సమాజానికి తాను తొలిపురుషుడుగా జీవించటం ప్రారంభించాలనీ అతడెన్నో

సార్లు సంకల్పించుకున్నాడు. తన రక్తనాడుల్లోని విషాన్ని తొలగింపచేసుకుని, ఆ రక్తాన్ని పవిత్రవంతంగానూ, ఆరోగ్యవంతంగానూ చెసుకోవాలనుకున్నాడు. ఆతర్వాత అమితోత్సాహంతో తన శక్తినంతనీ వినియోగించి కార్యాచరణకు దిగాలనుకున్నాడు. కాని సాధ్యంకాలేదు. ప్రతిచోటా అతడి మాతృవాత్సల్యమే అతడికి అడ్డుగా వచ్చి నిలిచేది. తానే వంశంలో జన్మించటం శాపంగా భావిస్తూవచ్చాడో ఆ వంశంమీదనే అతడికి మమకారంపోకుండా ఉంది. అసహ్యత-మమత విరుద్ధములైన ఈ హృదయప్రవృత్తులు రెండూ తనలో ఒకదాని ప్రక్క ఒకటి ఎలా ఉంటూవచ్చాయో అది అతడికీ ఆశ్చర్యంగానే తోచేది. ఇవి రెండూ అతడి మనస్సుని చెరొకవైపుకీ లాగుతూ దారితోచకుండా చేసేవి. ఎన్నెన్నో ఆలోచనలు పెట్టుకున్నాడతడు. కాని వాటిని ఆచరణలోకి తెచ్చుకోటం సాధ్యంకాలేదు. ఇవాళ ఈ నూరురూపాయలమీద ఇంట్లో అందరికీ కలిగిన ప్రలోభాన్ని చూసేసరికి - ముఖ్యంగా మద్యంతోసహా మాంసాన్ని భర్తకు నైవేద్యం సమర్పించుకుంటున్న తన తల్లి ఆత్మత్యాగం, వెర్రితలలువేసిన ఆమె భర్తృసేవానిష్ఠ చూసేసరికి—అతడి మనస్సులోని మమత మాయమైపోయి అసహ్యతే మిగిలింది. తనకోసమని కొంత డబ్బును మిగుల్చుకోవటం తనతల్లి ఏమాత్రం సహించలేకపోయింది.కాని భర్తృదేవతకి తదేసిరూపాయలు మద్యంకోసం దుబారా చెయ్యటానికామెకేమాత్రం సంకోచం కలగలేదు. దానికితోడు గీతపరిస్థితి శోచనీయంగా పరిణమించటంచూసేసరికి అతడికి ప్రస్తుత ప్రపంచంమీద అదివరకున్న మమకారమంతాపోయి, నిష్ఠురభావం ఏర్పడింది. పైకి ఉబుకుతున్న హృదయోద్వేగంలో ఏం చెయ్యటానికి తోచక కానాయ్ ఒక్క క్షణం మొద్దుబారిపోయాడు. కాని మరుక్షణంలోనే-హఠాత్తుగా, భూకంపంవచ్చి, తమ యింటి గోడలన్నీ బ్రద్దలైపోయి, వాటిమధ్యనుంచి తనకి విముక్తిమార్గం కన్పిస్తున్నట్లు—అమితోత్సాహం తెచ్చుకున్నాడు. ప్రస్తుతం క్లిష్ట పరి

స్థితులమధ్యనున్న ఈ ప్రపంచం చక్రవర్తి గృహంకన్న తక్కువ భయానకమైనదీ, తక్కువ చిక్కులను తెచ్చిపెట్టేదీ కాదని కానాయ్‌కి తెలుసు. అయినా ఈ క్లిష్టప్రపంచంలో తన జీవిత మార్గమేదో నిర్ణయించుకోటాని కతడికి సంకోచమూ కలగలేదు, భయమూ కలగలేదు. గీతని చెయ్యిపట్టుకుని, ఈ మహానగరం కారుచీకట్లమధ్యనుంచి అజ్ఞాతభవిష్యత్తులోకి యీదుకుంటూ పోతున్నాడు. కొంతదూరంవచ్చాక "ఈ రాత్రికి ఎక్కడికి వెడదామంటావ్ కానూదా?" అని భయపడుతూ అడిగింది గీత.

"ఇంత పెద్ద కలకత్తానగరం. లక్షలక్షలు జనం నివసిస్తున్న ఈ మహాపట్నంలో ఇద్దరు మనుషులకి ఒక్కరాత్రి కెక్కడా జాగా దొరక్కపోతుందా! రా," అన్నాడు కానాయ్ స్నేహపూర్వకంగా.

గీత ఇంకేమి ప్రశ్నించలేక పోయింది. వస్తుతః ఆమె కడు కొద్ది పరిసరాలమధ్యనే పెరిగినబిడ్డ. జీవితంలో యే కొద్దిమందినో మాత్రమే చూసింది. ఆ అనుభవాల్నిబట్టి—ఈ కారుచీకటి రాత్రివేళ అపరిచితులైన యిద్దరు స్త్రీ పురుషులకోసం ఎవరైనా తమ ఇంటితలుపుల్ని సహృదయంతో తెరవక పోతారా అన్న ఆశ్వాసన ఆమెకి కలగలేదు. ఆమె చింతలన్నీ మాయంకాలేదు. తాము నివసిస్తున్న పేటలో - ఒక ఇంట్లోంచి కాస్త కాగితమ్ముక్క యెగిరి రెండో యింటివారి మడురు మీదపడినా, గాలి ఆడక ఎవరైనా ప్రక్కయింటి వైపుకివున్న కిటికీతలుపు తెరుచుకుని, కాస్సేపు అక్కడ నిలబడినా—అందాకా యెందుకు, రోగంవచ్చి ఎవరైనా కాస్త బిగ్గరగా మూలిగినా, ఇహ ఒక్కక్షణంలో వీళ్ళనందర్నీగురించి ఎంత హీనమైన అసహ్యమైన చర్చలు ప్రారంభమయేవో అన్నీ జ్ఞప్తికి తెచ్చుకుని గీత దీర్ఘంగా నిట్టూర్చింది. తానా తోటయింటికి వెళ్ళినప్పుడల్లా, పూజకోసం తెచ్చుకునేవే అయినా ఆ కాసినిపూలూ చాటుగానే పరుకుని తెచ్చుకోవాల్సి వచ్చేది. ఈ పేటకి అటువైపునవున్న ఆరంతస్తుల మేడలో

ఎలక్ట్రిక్ పంపులమర్చిన రెండు ట్యూబ్ వెల్స్ వున్నాయి. వ్యాధి పీడితుడైన తన తండ్రికి త్రాగే మంచినీళ్ళకని అక్కడికివెడితే—వాళ్ళు తనని కుక్కనితరిమినట్లు తరిమేసేవాళ్ళు.

హైరోడ్ మూలమీదికి వచ్చి కానాయ్ టాక్సీని పిలిచాడు. టాక్సీ కాస్సేపట్లో మసక వెలుతురుగావున్న ఓ వీధిలోకివచ్చి ఆగింది కానాయ్ అందులోంచి దిగివచ్చి, ఒక యింటిగోళ్ళెం చప్పుడుచేస్తూ "విజయదా!" అని పిలిచాడు.

"నా బాడుగ బాబూ!" అని అడుగుతున్నాడు వెనకనుంచి టాక్సీడ్రైవరు.

"ఆగు—ఇస్తాను" అని అతడు మళ్ళీ "విజయదా!" అని పిలిచాడు. నౌకరు "ఎవ"రంటూవచ్చి తలుపుతెరిచాడు.

"షష్ఠీ ! విజయదా ఎక్కడ?"

"ఓ! కానాయ్‌బాబుగారా!...బాబుగారింకా రాలేదండీ!"

"రాలేదూ?...ఊం....సరేకాని నీదగ్గిర డబ్బేమయినా ఉందా షష్ఠీ?"

"ఉహూం ఏంలేదండీ!"

టాక్సీడ్రైవరు కంగారుగా 'బాబూ!' అని తొందరపెట్ట సాగాడు.

గీత తన చీరెకొంగునవున్న అయిదు రూపాయలనోటు తీసి డ్రైవరుచేతిలో పడేసింది. "చిల్లర లేదండీ నాదగ్గిర" అన్నాడు డ్రైవరు.

"చిల్లరవద్దులే, తీసుకోపో" అన్నది గీత. డ్రైవరు ఒక్క నిమిషంలో కారు స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు. కానాయ్ ఆశ్చర్యంతో వెనక్కి తిరిగిచూశాడు. "నాదగ్గిర అయిదు రూపాయల నోటొకటివుంటే ఇచ్చాను" అన్నది గీత. అంతకన్న మాట్లాడ లేక పోయింది. క్షణంలో—హృదయవిదారకమైన బాధనికలిగించే

ఆ నోటుతాలూకు చరిత్రంతా గుర్తుకొచ్చినట్లుంది. పట్టరాని దుఃఖం పొంగులా రావటంతో—ఆమెగొంతు పట్టుకు పోయింది.

కానాయ్ ఆమె వేదనని గ్రహించాడు. చిరునవ్వుతో ఆమెని ఊరడిస్తూ "భేషయిన పనిచేశావ్, రా" అని ఇంట్లోకి తీసు కెళ్లాడు.

కానాయ్ మిత్రుడు విజయదా—ఓ ఇంగ్లీషు దినపత్రిక కార్యాలయంలో పనిచేస్తున్నాడు—వంగదేశపు పత్రికాసంపాదక ప్రముఖులలో అతడొకడు. 'పెనుతుపాను' 'ప్రళయవేళ' 'కారు మబ్బులు' 'కాళరాత్రులు'—మొదలైన దేశాన్ని ఉమకెత్తించిన సంపాదకీయల్లోని' యుక్తివాదంతోకూడిన తీవ్రప్రవాహంలాంటి పదజాలం చదవగానే-అది విజయదా సంపాదకీయమని అందరికీ గుర్తే. అదీగాక అతడు మరొకవిధంగాకూడా బెంగాలీలందరికీ బాగా పరిచితుడే. యౌవనప్రారంభంనుంచీ – సింద్ బాద్ నావికుని బుజాలమీదకెక్కి దిగకుండా కూచున్న వృద్ధునిలాగా—బెంగాలీ యువకుల నెత్తినెక్కి కూచున్నవారిలో విజయదా ఒకడు. 1916 సంవత్సరంలో కాలేజీలో చేరగానే అతడికి విప్లవకారులతో సంబంధం ఏర్పడింది. 1921 సంవత్సరంలో ఎం. ఎ. చదువుతూ, చదువు మానుకుని, సహాయనిరాకరణోద్యమంలోకి దిగాడు. ఆ ఉద్యమంలో జైలుకి వెళ్ళివచ్చినప్పటినుంచీ ద్విగుణితోత్సాహంతో మళ్ళీ విప్లవవాదంలో మునిగితేలుతూ వుండేవాడు. 1924 లో రాజకీయఖైదీగా ఉండే యమ్. ఏ. ప్యాసయినాడు. విడుదల యింతర్వాత అధ్యాపకవృత్తి చేపట్టాడు. తర్వాత 1930 వచ్చింది. ఆ ముప్పైఫై—సత్యాగ్రహోద్యమంలో ప్రభుత్వం అతడ్ని 'డిటెన్యూ'గా బంధించి తీసుకెళ్లింది. కొన్నాళ్ళకు విడుదలై మళ్ళీ ఉద్యోగంలో చేరాడు. ప్రస్తుతం విజయదా రాజకీయల్లో సామ్యవాది—అంటే కమ్యూనిస్టు. ఒంటరిగాడు. నౌకరు షష్ఠీ చరణుడూ—తానూ—ఇదే అతడి సంసారం. చొక్కాలయినా చెప్పులయినా చెప్పరానివాడికిచ్చే కుట్టిస్తాడు. చండీ పారాయణ

నేది జీవితంలో ఎరగడు. పై రెండు పనులూతప్ప మిగిలిన అతడి పనులన్నీ షష్ఠీచరణుడే చేసి పెడుతూవుంటాడు. అవివాహితుడైన విజయదాకి షష్ఠీచరణుడంటే అమితమైన నమ్మకం. అతణ్ణి బజారుకి వెచ్చాలకి పంపేటప్పుడు మాత్రం విజయదా కాస్త అనుమానంతో ఒక కంట కనిపెట్టే వుంటాడు. ఎంచేతంటే అతడు బజారుకి వెళ్లాడంటే ఏదో ఒక అసంబద్ధమైన పనిచెయ్యక మానడు.

విజయదా ఇంటికి తిరిగివచ్చేసరికి రాత్రి పదిదాటింది. అతడు చాలా చిత్రమైనవాడు. కానాయ్‌తో గీత వుండటంచూసికూడా అతడేమీ ఆశ్చర్యాన్ని వ్యక్తం చెయ్యలేదు." ఏమిటోయ్? ఏమిటి విశేషాలు?" అని అడిగాడు మామూలుగా.

కానాయ్ గీతకి సైగచెయ్యగానే ఆమె విజయదాకి నమస్కరించింది. అతడు వాత్సల్యంగా " అరే! ఇదేమిటి! భలేదాని వే కూచో!" అన్నాడు.

కానాయ్ జరిగిన సంగతంతాచెప్పి "ఇప్పుడేం చేద్దామంటావ్ చెప్పు ?"అని అడిగాడు.

గీత ప్రక్క గదిలోకిపోయి పడుకుంది.

"షష్ఠీ!" అని కేకేశాడు విజయదా.

షష్ఠీ వచ్చి నుంచున్నాడు. "వేడివేడి పూరీలు అప్పటికప్పుడు వేయించి తీసుకురావాలి. ఎంత ఇమ్మంటావ్?" అని అడిగాడు.

షష్ఠీ బుర్రగోక్కుంటూ గుణించుకోటం మొదలెట్టాడు. "ఎంతయితే—అంతకి ఓ పావలా ఎక్కువఇచ్చి, మంచిపూరీలు ఓ అర్థశేరు, నాలుగు జిలేబీలు తీసుకరా తెలిసిందా?" అని విజయదా అతడిచేతికోరూపాయి ఇచ్చాడు.

"నేను తింటాను కాని ఆమెనోటికిమాత్రం ఇవాల్టికింకేమీ రుచించదు విజయదా!"అన్నాడు కానాయ్.

విజయదా వెలుగులేని చిరునవ్వు నవ్వాడు.

"ఇప్పుడేం చేద్దామంటావ్ చెప్పు?"

"చాలా సులువైన ఉపాయమేవుంది; కాని అది నీచేతుల్లో వుంది."

"ఏమిటది? చెప్పు"

"ఆమెని నువ్వు పెళ్ళిచేసుకుని సంసారం సాగించు"

కానాయ్ కొయ్యబారిపోయి గ్రుక్కప్పగించి అతడికేసిచూస్తూ ఊరుకున్నాడు. విజయదా విశ్రాంతిగా పక్కమీదపడుకుని సిగరెట్ తీసి వెలిగించాడు.

కొంచెంసేపయాక "కాదు, విజయదా! అల్లా వీల్లేదు. మరో ఉపాయం ఏదైనా ఉంటే చెప్పు" అన్నాడు కానాయ్.

"అయితే పెద్దబెడదే తెచ్చి పెడుతున్నావ్"

కానాయ్ ఉద్వేగాన్ని అణచుకోలేక, తన వంశ చరిత్రంతా అతడికి చెప్పేశాడు. చివరికి "ఇలాంటి విషమయి రక్తంతో సంసారం సాగించలేను విజయదా!" అన్నాడు.

"విషమయరక్తాన్ని చికిత్సద్వారా విషయరహితంగా చేసుకోవచ్చు — రేపే చేయించుకో రక్తపరీక్ష తర్వాత చికిత్సకు ఏర్పాటు చేసుకోవచ్చు. ఖర్చుకోసం వెనకాడకు. ఆ ఏర్పాటంతా నేను చూస్తాను"

కానాయ్ కాసేపు మెదలకుండా ఊరుకుని, "వద్దు విజయదా!" అన్నాడు.

"అయితే మరి ఆ అమ్మాయిని ఇలా ఎందుకు తీసుకొచ్చావ్?"

ఎందుకు తీసుకొచ్చానా! నువ్వేనా అడుగుతున్నదీమాట? ఇంత దురాచారం—ఇంత అత్యాచారం——"

ఆ మాటకు విజయదా అడ్డువచ్చి "ఇలాంటివి అనాదికాలం నుంచీ జరుగుతూనేఉన్నాయి. ఆడవాళ్లు బాల్యంలో తండ్రిసొత్తు, యౌవనంలో భర్తసొత్తు—తర్వాత సంతానంసొత్తు...దుర్భిక్షం వచ్చినప్పుడు, రాష్ట్రవిప్లవం సంభవించినప్పుడు తండ్రులు

కూతుళ్ళనీ, భర్తలు భార్యలనీ విక్రయిస్తూనేవచ్చారు.'' అని మళ్ళీనవ్వి, ''లోకంలో రాష్ట్రవిప్లవం అనేది ఎప్పుడో ఒకసారి వచ్చినా—దుర్భిక్షంమాత్రం ఎప్పుడూ అంటూనేవుంటుంది. ప్రపంచంలో దరిద్రులూ, ధనికులూ రెండేజాతులు. దరిద్రులకు దుర్భిక్షం చిరస్థాయి. అంచేత ఈ క్రయవిక్రయాలు చాలాకాలం నుంచి నడుస్తున్నాయి. ఈ కలకత్తానగరంలో ఇది చాలాకాలం నుంచి జరుగుతున్న వ్యాపారమే. ఒక్క కలకత్తాలోనే అన్న మాటేమిటి? ఏదేశంలోని పోలీసుల రిపోర్టులయినా చూడు నువ్వు, ఇది ప్రాచీనవ్యాపారమని స్పష్టంగా తెలుస్తుంది. ఆ అమ్మాయి లాగా ఎన్నివందలమంది—''

కానాయ్ ఆమాటకు అడ్డువచ్చాడు. ''ఆ అమ్మాయి ముఖం కేసి నువ్వు బాగా పరీక్షగా చూశావా విజయదా?''

''అంత పరీక్షగా అయితే చూడలేదు, అయినా ఆమె కివాళ కలిగిన మనోవ్యధని మాత్రం గ్రహించగలను. కాని పదిరోజులు పోయాక అదే తగ్గిపోతుంది''

కానాయ్ లేచినిలబడ్డాడు. అతడి ఉద్రేకాన్ని విజయదా గ్రహించాడు. విజయదా కానాయ్‌ని ''కూర్చో'' అని చెయ్యి పట్టుకుని గుంజాడు.

కానాయ్ నెమ్మదిగా ''నువ్వింత హృదయంలేనివాడివని అనుకోలేదు విజయదా'' అన్నాడు కటువుగా.

అతడామాటకు జవాబు చెప్పకుండానే ''ఆ అమ్మాయేమైనా కాస్త చదువుకుందా?'' అని అడిగాడు విజయదా.

కానాయ్ కనుబొమలు చిట్లించి ''చాలు. ఆమెకోసం నువ్వింకేమీ ఆలోచనలు పెట్టుకోనక్కర్లేదులే'' అన్నాడు.

''పెద్దబెడదే!...నే అడిగిన సంగతి చెప్పరాదూ?''

''ఏడోక్లాసుదాకా చదివింది. మాచెల్లెలితోపాటే చదువు కుంటూ వుండేది. ఏడాదిక్రితం వాళ్ళనాన్నకి ఉద్యోగం పోవటం మూలంగా చదువు మానేసింది''

"అయితే—"అంటూ విజయదా నవ్వి 'అలా అయితే ఆమెని ఏ స్త్రీసేవాసదనానికైనా పంపుదాం" అన్నాడు.

"స్త్రీసేవాసదనానికా?"

"ఆఁ కావాలంటే నేను తీసుకెళ్ళి మిషనరీలకి అప్పగిస్తాను. దానివల్ల ఆమెకి ఉత్తరోత్తరామంచే కలుగుతుంది. నాకో మిషనరీ మిత్రుడున్నాడు. చాలా మంచివాడు. ఆ ఏర్పాటంతా నేను చెయ్యగలను"

కానాయ్ నవ్వుతూ "వద్దులే విజయదా! ఇవాళరాత్రి కెలాగో అలా ఇక్కడ వుండనిచ్చావ్, అంతేచాలు, ఇంక నువ్వు ఆమె విషయమై అనవసరపు ఆలోచన్లేమీ పెట్టుకోవద్దులే"అన్నాడు.

అతడికి అశోకుడి తండ్రి మిష్టర్ ముఖర్జీ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. అతడు తనకి వ్యాపారంలో సహాయం చేస్తానన్నాడు. రోజుకి యాభైమణుగుల బియ్యం తాను అమ్మకలిగితే— రోజుకి వందరూపాయల లాభం—నెలకి మూడువేలు-ఏడాదికి ముప్ఫై ఆరువేలు. గీతని ఏ స్కూల్లోనయినా తాను చేర్పించ గలడు—ఏ బోర్డింగ్‌లోనో ఉంచగలదు. ఇంకాస్త చదువూ-గిదువూ నేర్చుకుందంటే ఆమె తన కాళ్ళమీద తాను నిలబడగలదు. అలా చేస్తే అతడి మనస్సులోని సంఘర్షణంతా సద్దుమణుగుతుంది.

షష్టీచరణుడు పూరీలూ అవీ తీసుకొచ్చి తినమని బలవంతం చేశాడు.

విజయదా వరాండాలో రెండుపక్కలు వేయించాడు. పడకకి వుపయోగపడేగదంటూ ఉన్నదొకటే—రెండోది వంటగదీ, మూడోది సామానులగది. ఆ గదిలో షష్టీచరణుడు పడుకుంటాడు. కానాయ్ గీతని పిలిచాడు. ఆమె వంటయింట్లో చాపమీద ఇంకా ఏడుస్తూనే పడుకునివుంది. చెప్పినమాట వినే బుద్ధిమంతురాలిలాగా ఆమె అక్కడినుంచి లేచివచ్చింది. ఏదో కాస్త తిననుకూడా తింది. తినేటప్పుడు ఆమెకి మళ్ళీ ఉద్వేగంగా ఏడుపొచ్చింది. కానాయ్

ఊరడించబోయాడు. కాని విజయదా సైగచేసి వారించి అతడ్ని బయటికి తీసుకెళ్లాడు. కొంతసేపయాక వచ్చి విజయదా గంభీరంగా "గీతా! గీతా!" అని పిలిచాడు.

గీత మెదలకుండా ఎదుటికి వచ్చి నిలబడింది. "తలుపు లోపల వేసుకుని పడుకో" అన్నాడు విజయదా, గీత అలాగే చేసింది.

వరాండాలో చలిగావుంది. సాధారణంగా కలకత్తాలో చలియెంత ఎక్కువగా వుంటుందో అవాళ అంత చలిగానూ వుంది. విజయదామాత్రం బాగా గుర్రుపెట్టి నిద్దరోతున్నాడు. కానాయ్ ఇవాళ జరిగిన సంగతుల్నే ఆలోచించుకుంటున్నాడు. తాను చేసినపనికి అతడికేం పశ్చాత్తాపం కలగలేదు. తాపీగా అన్ని సంగతుల్నీ వరసగా ఆలోచించుకున్నాడు. భవిష్యత్తుని గురించిన ఆలోచనలుకూడా వచ్చాయి.

విమానాల ధ్వని విన్పిస్తోంది, ఓ విమానం వచ్చిపోయింది. దానివెనకాలే ఇంకొకటి, మరొకటి-మరొకటి వస్తున్నాయి, పోతు న్నాయి. నీశీథాకాశం విమానాలరొదలో దద్దరిల్లుతున్నట్లుంది. బాంబరు విమానాలేవో దండయాత్రకి బయలుదేరినట్లున్నాయి. లేకపోతే ఫైటర్ విమానాలు శత్రువిమానాలను వెతకటానికై సరిహద్దులదాకా వెళుతున్నాయేమో! విజయదా ఇంటికి పడమట వైపున రవంత దూరంలోవుంది గంగ—(హుగ్లీ). గంగ ఒడ్డున పోర్ట్ కమీషన్ రైల్వేలైన్‌మీద విరామంలేకుండా రైళ్లు నడుస్తు న్నాయి.ఇంజన్లు షంటింగ్ చేస్తున్నాయల్లే వున్నది—రైలుపెట్టెలు ఒక దానికొకటి గ్రుద్దుకుంటున్న చప్పుళ్లు విన్పిస్తున్నాయి.దగ్గిరలోవున్న రైల్వేయార్డ్ సమీపంలో జరుగుతున్నట్లుంది షంటింగ్. మధ్య మధ్య ఇంజన్ల కూతలు విన్పిస్తున్నాయి. అక్కడికి దగ్గిరలోవున్న తుపాకులు తయారు చేసే కర్మాగారానికి ముడిసరుకులు వస్తు న్నాయి. తయారైన ఆయుధా లక్కడినుంచి రవాణా అవుతు న్నాయి. వేలకు వేలమంది యంత్రాలతోపాటు పనిచేస్తున్నారు.

రెట్టింపుకూలి గిట్టుబాటవుతోంది. వీధిమొగన హైరోడ్ మీదికి ఏ. ఆర్. పి. ఆఫీసు కిటికీలోంచి కొంచెం వెలుతురు వచ్చిపడుతోంది. అక్కడ బజ్జర్ (Buzzer) దగ్గిర డ్యూటీలోవున్న విచిత్రవ్యక్తి. ఎవరో? పాపం పాటలు పాడుతున్నాడు.

విజయదా గాఢంగా నిద్దరోతున్నాడు. కానాయ్ దీర్ఘంగా నిట్టూర్చాడు. గీత విషయంలో అలా మాట్లాడినందు కతడికి విజయదామీద కోపంవచ్చింది. భవిష్యత్తులో తానింక ముఖర్జీ ఆహ్వానాన్నే అంగీకరించాలని—అతడి సహాయాన్నే స్వీకరించాలనీ నిర్ణయించుకున్నాడు.

## ౧౦

కానాయ్ చీకటితో లేచి శిష్యుడింటికి బయలుదేరాడు. రోజూ కన్నా చాలా పెందరాళే చేరుకున్నా డక్కడికి. ఈ సంగతి వాళ్ళ యింటిముందుకు వచ్చాక తోచిందతడికి. కొత్తగా వ్యాపార జీవితం మొదలెట్టాలనే ఆసక్తి ఉద్వేగం అతడ్ని తొందరపెట్టాయి. గేటులోంచి చూస్తేవారింట్లో దాసీలు అప్పటికింకా పాచి పనులుచేస్తూనే ఉన్నారు. ఇంట్లో పెంటపోగుకూడా ఇంకా కార్పొరేషన్ లారీ యెక్కనట్లు లేదు. కానాయ్ మామూలుగా వారింటికి రావలసిన నిర్దిష్టసమయం ఏడున్నర. ఏడున్నర అయినట్లు అన్నిటికన్నా పెద్దగుర్తు రేడియో కార్యక్రమం ప్రారంభంకావటం, బెంగాలీ వార్తలు రావటం. రేడియో ఇంకా నిశ్శబ్దంగానే ఉంది. తనలోతాను సిగ్గుపడి, అతడు బౌబజారు కాలేజీస్ట్రీట్ జంక్షన్‌లోకివచ్చి నిలబడ్డాడు. ఎస్ప్లనేడ్‌ట్రాం వస్తోంది. అతడికి కొంచెం కుతూహలం కలిగింది—నీల ఆఫీసులో గుట్టలాగా పెరిగిన ఫైల్సు అన్నీ ఒకరోజులోనే తరిగిపోయి వుంటాయా! పడమటివైపు కాలిబాట మీదినుంచి తూర్పువైపు కాలిబాటమీదికి వచ్చి నిలబడ్డాడు. ఇంచుమించు అతడితోపాటే ట్రాంకూడా మెల్లిగావచ్చి ఆగింది. అందులో నీల లేదు. కొంచెం సేపటికి మరో ట్రాంవచ్చింది. ఉస్—ఇది డల్‌హౌసీట్రాం. ఈసారి మళ్ళీ మరో ఎస్‌ప్లనేడ్‌ట్రాం వచ్చింది. ఇంతకు ముందు వచ్చినదానిలోకన్న ఈ ట్రాంలో జనం ఎక్కువ మందయితే ఉన్నారుకాని, నీల మాత్రం లేదు. అదుగో ఇంకో ట్రాం వస్తోంది. అది తప్పకుండా డల్‌హౌసీట్రాం అయివుంటుంది. దానివెనక కొంచెందూరంగా ఇంకొక ట్రాం వస్తోంది.

'నమస్తే—ఆలిండియా రేడియో—బెంగాలీలో వార్తలు'

కానాయ్ ఉలిక్కిపడ్డాడు. ఏడున్నరయింది. అయినా ఇంకా తాను అక్కడే నుంచుని ఉన్నాడు. ఆ సెనకాలి ట్రాం రావటానికి మూడునాలుగు నిమిషాలకన్న ఎక్కువపట్టం పట్టదు—మూడునాలుగు నిమిషాలేగా !

'బెంగాలీలో వార్తలు.... మొన్న డిసెంబరు పదహారో తేదీన న్యూఢిల్లీలోని మిత్రరాజ్య యుద్ధసమాచారశాఖ చేసిన సంయుక్త ప్రకటనలో చిటగాంగ్ మీద శత్రు విమానాలు—అంటే జపాను విమానాలు మళ్ళీ దాడిచేసినట్లు ధ్రువపరిచాయి. ఉదయం ఒకసారి, సాయంత్రం ఒకసారి రెండుసారులు దాడులు జరిగినట్లు తెలుస్తోంది. రెండుసార్లూకూడా అతిస్వల్పంగానే బాంబులు వేసి ఆ విమానాలు వెంటనే పలాయనం సాగించాయి. ఎంతనష్టం సంభవించిందీ సరియైనవివరాలు ఇంకా తెలియలేదు. కాని, జననష్టమూ, ఇతరనష్టాలూకూడా చెప్పుకోతగినంతేమీ జరగలేదని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు. ఎంచేతంటే పడిన బాంబులన్నీ గురితప్పి అటూ యిటూ చెల్లాచెదరుగా పడ్డట్లు తెలుస్తోంది. ఆరోజునే జపానువిమానాలు 'ఫేనీ' మీదకూడా దాడులు చేశాయి. అక్కడకూడా అతిస్వల్పమైన నష్టాలుకలిగినట్లు వార్తలు వచ్చాయి.'

ఆ వార్తలధోరణి వింటూంటే ఆ చదువుతున్న వ్యక్తి ఏ సామంతరాజో—డ్రామా యాక్టరో అయివుండచ్చు నని పించింది కానాయ్‌కి. గంభీరంగా రాజకీయ పారిభాషిక పదజాలంతో ఆవార్తలు చెప్పటం వింటూంటే అతడు బ్రహ్మాండమైన ప్రణాళికేదో ప్రజల ముందు పెడుతున్నాడా అనో—ఆధునిక విజ్ఞాన కౌశలంతో ప్రపంచవిజయాన్ని ఊహించి ఉద్ఘోషిస్తున్నాడా అనో, అనిపిస్తుంది. డల్‌హౌసీట్రాం మలుపుతిరిగింది.

'నిన్న మనవిమానాలు బర్మా నడిగడ్డ మీదికివెళ్ళి దాడులు సలిపివచ్చాయి. అవి సరిగ్గా లక్ష్యస్థానాలమీద సూటిగా బాంబులు

విసిరినట్లు స్పష్టంగా కనిపించింది. యుద్ధ సామగ్రిని సరఫరా చేస్తున్న రైలుమీద బాంబులుపడి పెద్దమంటలు లేచాయ్ ఆమంట లకు ఆ ప్రదేశమంతా పట్టపగల్లాగా వెలుతురయింది. బహుశా ఆ మంటలు ఇప్పటికీ ఇంకా మండుతూనే వుండి ఉంటాయి. మన విమానాలు మాత్రం సురక్షితంగా మళ్ళీ మన స్థావరానికి చేరు కున్నాయి!'

ఎస్ప్లనేడ్ ట్రాంవచ్చి ఆగింది. ఆఁ. ఆఁ. అదుగో—అటు వైపునున్న లేడీస్‌సీట్‌లో నీల కూచునివుంది. కాని ముఖం అటు వైపునకు పెట్టి కూచుంది. కానాయ్ ఆదుర్దాగా నుంచుని చూస్తు న్నాడు. కాని నీల ముఖం ఇటుకేసి త్రిప్పనేలేదు. ట్రాం మళ్ళీ బయలుదేరింది. తానుకూడా అమాంతంగా ట్రాం ఎక్కేద్దామా అనుకున్నాడు; కాని అంతలో నిగ్రహించుకున్నాడు. ట్రాం వెళ్ళి పోయింది. కానాయ్ తన శిష్యుడి ఇంటికేసి బయలుదేరాడు.

అశోక్ ఇంటివద్ద చిటగాంగ్, ఫేనీలమీద బాంబులుపడ్డ విషయంమీదనే చర్చ జరుగుతోంది. గృహయజమాని మిస్టర్ ముఖర్జీ ముఖం గంభీరంగాపెట్టి, "చిటగాంగ్ మీద ఒక్క డిసెం బరులోనే మూడుసార్లు బాంబింగ్ జరిగింది—అయిదోతేదీన...పదో తేదీన...పదిహేనోతేదీన...అయిదేసి రోజులు వ్యవధానం మధ్య......" అంటున్నాడు.

అదో చిన్న సమావేశంలా వుంది. ముఖర్జీచుట్టూ ఆయన పెద్దకొడుకూ, చిన్న కొడుకూ, ఇద్దరుముగ్గురు గుమాస్తాలూ కూచుని వున్నారు. అశోక్‌కూడా అక్కడే వున్నాడు. కానాయ్‌ని అతడే అక్కడికి తీసుకెళ్ళాడు. "కూచోండి మాష్టారూ!" అని, "నేను టోకియో, సైగాన్ రేడియోలు విన్నాను. ఈసారి వాళ్ళెక్కడో గట్టిదెబ్బ తీస్తారని నా నమ్మకం" అన్నాడు ముఖర్జీ.

"మన ప్రధాన కార్యాలయాల్ని ఇక్కడినుంచి మార్పిడి చెయ్యటం పూర్తిఅయింది. అతిముఖ్యమైన కాయితాలూ,

రికార్డూ అంతా అక్కడికి చేరవేశాం. ఇహ గోడౌన్సులో వున్న సరుకంటారూ——దాన్ని కదిలించటం మాటలుకాదు'' అన్నాడు పెద్దకొడుకు అమలబాబు.

''ఆ సరుకంతా యెటూ ఇన్స్యూర్ చేశాంగా! ఇహ కదిలిస్తేమాత్రం పెద్దగా వచ్చేలాభం ఏముంటుంది?'' అన్నాడు చిన్నకొడుకు అసీమబాబు.

''ఉంటుంది, కాని నే చెప్పినట్లు వినండి, కలకత్తా శివార్లలో ఎక్కడైనా గోడౌన్స్ ఏమయినా దొరుకుతాయేమో ప్రయత్నం చేసి చూడండి. మన తోటలో కార్ఖానప్రక్కన ఒక గోడౌన్ ఉండనేఉంది. అక్కడే మరో రెండు గోడౌన్లు త్వరత్వరగా కట్టించాలి'' అని చిన్నకొడుకుకేసి తిరిగి, ''ఇంట్లో కోడళ్ళనీ వాళ్ళని అందర్నీ నువ్వు బెనారస్ తీసుకెళ్ళి దింపించు. ప్రస్తుతం అశోక్ అక్కడ వాళ్లకి సహాయంగా ఉంటాడు. మాష్టారూ! పోనీ మీరుకూడా అశోక్ తోపాటు అక్కడికి వెళ్ళి ఉండండి. మీకు నెలకి నూరురూపాయలు జీతం ఇస్తాం'' అన్నాడు ముఖర్జీ.

కానాయ్ మొదట తెల్లబోతూ అతడిముఖంకేసి చూశాడు. కొంచెంసేపయాక ''నాకు వెళ్ళటానికి ఓ చిక్కుందండీ! అదీకాక నిన్న మీరు చెప్పారుచూశారూ, బియ్యంవ్యాపారం—'' అని చెప్పబోయాడు.

''ఓ, అవునవును. మరచిపోయాను. అమల్! కానాయ్ బాబుని మన యేజెంటుగా ఏర్పాటుచెయ్యి. కొనుబడి——అమ్మకాలమీద వారికి కమీషన్ ఇస్తూవుండు. అంతే ఆయనకి నువ్వే వెనక అండగా నిలబడాలి. నువ్వే ఆయనకి స్వయంగా తర్ఫీదు యివ్వాలి. ఆయన ఎంత గొప్పయింటి బిడ్డో తెలుసుగా! అదీగాక ఆయనేదైనా స్వతంత్రించి కొనటం- అమ్మటంచేసేట్లయితే అవతల పార్టీ నెవరినైనా కుదిర్చి పెడుతూ ఉండు. వారికి కావాలన్నంత సరుకు అప్పు ఇయ్యి.''

అమలబాబు స్నేహసూచకంగా నవ్వి "ఓ, భేష్! ఇవాళ నుంచే రండి ఆఫీసుం. నే నిప్పుడే బయలుదేరబోతున్నాను. వీలయేట్లయితే ఇప్పుడే నాతోరండి. భోజనంవగైరా ఆఫీసులో కానీపాశే చెయ్యవచ్చు" అన్నాడు.

భోజనం సంగతి ఒక్కనిమిషం ఆలోచించాడు కానాయ్. ఆ విషయంలో అతడికి కొంచెం సంకోచమయితే ఉంది; కాని అలా సంకోచంపెట్టుకుంటే అడుగులోనే హంస పాదులుగా వ్యాపారానికి మొదట్లోనే విఘ్నం కలిగేట్లుంది. మరో ఆలోచనకూడా వచ్చింది. ఒక్కరోజు అతడితోటి, వాళ్ళ ఆఫీసులో భోజనంచేసినంత మాత్రాన-జీవితమంతా అదేం పెద్ద రుణపడివుండటంకిందికీ రాదు. తాను వారి అనుగ్రహంమీద ఆధారపడటాని కెటూ సమ్మతించాడు. దానికన్న ఇదేం పెద్ద అన్యాయంకాదు. అతడు సంకోచాన్ని వదిలించుకుని "ఓ! అలాగే వస్తాను" అన్నాడు.

"అయితే ఒక్కక్షణం ఆగండి వస్తున్నాను. అంతదాకా మీరీ గదిలో కూచోండి. అశోక్! మాష్టారిదగ్గిర నీకేమైనా తెలుసుకోవలసిన సందేహాలుంటే ఈలోగా అడిగి తెలుసుకుంటూ ఉండు" అన్నాడు అమలాబాబు.

ఈ సంగతి అసలందరికన్న అశోక్‌కే ఎక్కువ ఆనందంగా ఉంది. అతడి కళ్లురెండూ ఉత్సాహంతో తళతళలాడాయ్, "మీరు బిజినెస్ చేస్తారా మాష్టారూ?"

"ప్రయత్నించిచూస్తాను"

"చాలా మంచిది సార్! సరీగ్గా సంవత్సరం అయేసరికి మీరు కారు కొనాలి. లేకపోతే పనులు తెముల్చుకోలేరు"

"ఏమిటి!"

"చూడండీ! అప్పుడు మీరే అంటారుగా!"

ఆ కుర్రవాడి మనఃపూర్వకమైన శుభాకాంక్ష కానాయ్ కెంతో సంతృప్తి కలిగించింది. యథార్థంగా అశోక్‌కి తనమీద చాలా అభిమానంవుంది.

"కాని ఎటొచ్చీ నాకే పెద్దచిక్కు సార్!"

"ఎందుకని?"

"మళ్ళీ ఎవరో క్రొత్త మాష్టారొస్తారు. ఎవరొచ్చినా మీలాగా చెప్పలేరు"

"ఒకవేళ నాకంటె బాగా చెప్పగల మాష్టారే రావచ్చు"

"ఉహుఁ." అంటూ అశోక్ ఆ మాటకి ఒప్పుకోలేదు.

కానాయ్ నవ్వుతూ "పోనీ నేను బిజినెస్ చేస్తున్నా నీకు పాఠంకూడా చెపుతూ ఉంటాలే" అన్నాడు.

"అప్పు డలా చెప్పటం బాగుండదు సార్! అస లదీకాక టైమూ ఉండదు. వార్ మార్కెట్‌లో పూటుగా లాభాలువచ్చేది ఇప్పుడేట! ఇదివరదాకా ధరలు—ముఖ్యంగా బియ్యం, పంచదార, మైదా ధరలు—కాస్త పైకీ కిందికీ ఊరికే ఊగిసలాడు తున్నాయట! అంతే! మా గోడౌన్ తాళాలు ఒక్కవారం రోజు లపాటు కనపడకపోతే—ఆ వారం రోజులూ వంగదేశంమొత్తం మీద ఎక్కడా పొయ్యిలు రాజవుట—మా నాన్న చెప్పాడు"

"ఆఁ. ఏమిటీ?"

"ఆఁ. అవునుసార్! మా నాన్న బియ్యం ఎంత నిల్వ చేశారని?"

కానాయ్ అర్థికశాస్త్రం ఊరికే పైపైన చదవటంకాదు; బాగా క్షుణ్ణంగానే చదివాడు. అయినా అతడీ వ్యాపారస్తుల యింటి బిడ్డ అనుభవంమీద సంపాయించిన వ్యాపారవిజ్ఞానాన్ని చూసి విస్తుపోయాడు.

"మాష్టారూ!" అని అమలబాబు బయటి నుంచి కేకేశాడు. కానాయ్ బయటికి రాగానే నవ్వుతూ—"మిష్టర్ చక్రవర్తి! అని మూడు సార్లు పిలిచాను. బహుశా మీరు వినిపించుకో లేదను కుంటాను. ఇకనుంచైనా అలా పరధ్యానగా ఉండకండి. వ్యాపారస్థలాల్లో 'మాష్టారూ' అని పిలిస్తే, అక్కడివాళ్ళంతా మిమ్మల్ని చాలా తక్కువగా అంచనా వేస్తారు" అన్నాడు.

డల్‌హౌసీస్క్వేర్‌కి నాలుగువైపుల్నీ, ప్రక్కవీథుల్లోనూ ఉన్న బ్రహ్మాండమైన భవనాలను బయటినుంచి చాలా సార్లు చూశాడు కానాయ్. నాలుగంతస్తుల, అయిదంతస్తుల, ఏడంత స్తుల మేడలు ఆకాశాన్నంటుతున్నట్లుంటాయి. వాటి ఎత్తరి తనంలో, గట్టితనంలో, వైశాల్యంలో - అన్నింటిలో ఐశ్వర్యం వెల్లడవుతూనే ఉంటుంది; కాని ఆనందకరమైన వాటి శోభమాత్రం అతడి మనస్సును ఎన్నడూ ఆకర్షించలేదు. ఇవాళ అమలబాబుతో ఓ అయిదంతస్తులమేడ మొదటి అంతస్తులోకి వెళ్లేసరికి అతడికి కాళ్లు కాస్త కంపించాయ్. ఒక ఉలికిపాటుతో ఆ సంగతతడికి తెలిసి వచ్చింది. కానాయ్ ఉలిక్కిపడ్డాడు. నెత్తిమీదెక్కడి నుంచో కిర్‌మని ధ్వని ఒకటి విన్పించింది. కాని అంతలో తన కంగారును తమాయించుకున్నాడు. ఈలోపల పైనుంచి లిఫ్ట్ క్రిందికివచ్చి తాము నుంచున్నచోట ఆగింది. లిఫ్ట్‌మాన్ తలుపు తీసి అమలబాబుకి సలాంచేశాడు.

అమలబాబు ఆఫీసులో కూచుని, వచ్చిన ఉత్తరాలపై చూసు కుని—అవసరమైన సంగతులేవో నోట్‌చేసుకుని అక్కడినుంచి లేచాడు. ''రండి, నేను కొన్ని పెద్ద పెద్ద ఆఫీసులకి వెళ్ళాలి. అన్నీ చూసిరావచ్చు, రండి'' అన్నాడు.

కానాయ్ కివాళ అమలబాబేదో అద్భుత వ్యక్తిలా కన్పి స్తున్నాడు. అతడింతవాడని కానాయ్ ఊహ కిదివరకెన్నడూ తోచనేలేదు. వాళ్ల యింటిదగ్గిర అతడితో ఇదివరకెన్నోసార్లు సంభాషించాడు. శిల్ప, సాహిత్యవిజ్ఞానాల్లో అమలబాబు తన అజ్ఞానాన్ని—అంతేకాదు, తన మూర్ఖత్వాన్ని—బయట పెట్టు కుంటున్నప్పుడు కానాయ్ తనలో తాను నవ్వుకుని, ఇతడ్ని ఎవరితో పోల్చవచ్చా అని ఆలోచించినప్పుడల్లా అతడికి 'బంగారు కాళ్ళ గాడిద' స్ఫురించేది. కాని ఇవాళ అమలబాబులో యేదో అద్భు తత్వం కన్పిస్తోంది. వాళ్ళ యింట్లో కన్పించే ఐశ్వర్యం కేవలం విలాసతతప్పు మరేంకాదు. అమలబాబు వేషభాషల్లోనూ, ఉత్సా

హం లోనూ వ్యక్తమవుతున్న ఐశ్వర్యప్రభావం మాత్రం చాలా శక్తివంతమైనది. అచంచలమైన అతడి ఆత్మవిశ్వాసంలో, స్వతంత్రంగా సాహసించి ముందుకుపోయే తెగింపులో, అతడి నడవడిలో ఆశక్తి స్పష్టంగా వెల్లడిఅవుతూండటం చూస్తాంటే కానాయ్‌కి ఆశ్చర్యమూ కలిగింది; అతడిమీద గౌరవమూ కుదిరింది. పెద్ద పెద్ద విదేశీకంపెనీల యజమానులతో అతడు నిస్సంకోచంగా, సమానస్థాయిలో వ్యవహరించటంచూసి కానాయ్ ముగ్ధుడైనాడు. అంతకన్నకూడా ఈ కాంక్రీటుగోడల - ఇనుప తలుపులభవనాల్లోని వ్యవహారాలు తెలుసు కుంటున్నకొద్దీ అతడికి మరింత ఆశ్చర్యం కలిగింది...లక్ష్మి, కుబేరుడు జూదమాడుతున్నారు. లక్ష్మి వరుసగా ప్రతీసారీ ఓడిపోతోంది. పణంకోసం ఆమె తన అక్షయ సంపదభాండాగారాల తలుపులు తెరవక తప్పటం లేదు. పచ్చిక బయళ్ళలో, పంటపొలాల్లో, పర్వత ప్రదేశాల్లో, దురమారణ్యాల్లో. నదీ నదాల్లో, చీకటిమయమైన భూగర్భంలో - ఆమె సంపద ఎక్కడెక్కడైతే ఉందో, అక్కడి నుంచి అదంతా కుబేరుడి భాండారంలోకి వచ్చి చేరుతోంది. ఒడ్డిన ప్రతిపందెం లక్ష్మి ఓడి పోతూనే ఉంది. రైళ్ళల్లో, ట్రాముల్లో, బస్సుల్లో, కాలినడకనీ శిహార్లలోంచి ఉదయం మొదలు సాయంత్రంవరకూ ఎన్నో లక్షల మంది జనం ఇక్కడికి వస్తున్నారు; క్రుంగి పోతున్న శరీరాలతో, వెలవెలపోతున్న మొహాలతో, వాళ్ళందరూ నడుములువంచి పనిచేస్తూ లక్ష్మిని ఇంకా ఓడి పోకుండా నిలబెట్టాలని ప్రయత్నిస్తున్నారు—పణం ఒడ్డేభారం తామే వహిస్తున్నారు...

అమలబాబు బయటపనులన్నీ పూర్తిచేసుకుని వచ్చి. ఆఫీసంతా-ఒకపరస చుట్టివచ్చాడు. అతడిది తీక్ష్ణదృష్టి. ఎక్కడెక్కడ ఏయే పనుల్లో జజ్జున్నా అతడి దృష్టిని పడకుండా పోదు. కొంత కొంతమంది ఏయే పనులు ఏలాచేస్తున్నదీ వాకబుచేసి

యథార్థం తెలుసుకుని, ఆయాశాఖల ప్రధానోద్యోగులకు అవసరమైన సూచనలు పంపించాడు.

భోజనం వగైరా ముగించుకొని, "మన తోటకూడా చూసి వద్దాంరండి" అన్నాడమలబాబు.

కానాయ్ మనస్సుకి కొంచెం విసుగేసింది. అతడి స్వంతపని ఇంకా ఇంతవరకేం కాలేదు. అమలబాబు అతడి భావాన్ని క్షణంలో కనిపెట్టేసి, నవ్వుతూ "మీపనికూడా ఇందులో ఇమిడేవుంది కానాయ్‌బాబూ! దేశ, కాల, పాత్రలతోనే ఉంది ప్రపంచమంటే! ముందుగా మనంవచ్చి ఆగిన ప్రదేశాన్ని గుర్తుంచుకోండి" అన్నాడు.

కానాయ్ తెలతెలబోతూ "చిత్తం చిత్తం, అవునవును. అలాగే" అన్నాడు.

అమలబాబు కారులో యెక్కి, సిగరెట్ వెలిగించి, "మీరు సిగరెట్ కాల్చారల్లేవుంది. కాల్చండిసార్- కనీసం 'కంపెనీ' కోసమైన!"అని నవ్వాడు. కానాయ్‌కూడా నవ్వాడు. "మీరు నాకు బాగా నచ్చారు కానాయ్‌బాబూ! నాకు నచ్చిన అసిస్టెంట్ కోసమని వెతుకుతున్నాను. కేవలం అసిస్టెంట్ కూడాకాదు, పార్ట్నర్- మిత్రుడు. నాకు వేరే ఇంకో వ్యాపారంవుంది. ఆ సంగతి ఇంట్లో ఎవరికీ తెలియదు; మా నాన్నక్కూడా తెలియదు. ఆయనకు తెలియచెయ్యటం నాకసలిష్టంలేదు. విశ్వాసపాత్రుడైన మిత్రుడొకడు కావాలి నాకు. అతడ్ని నా పార్ట్నర్‌గాకూడా తీసుకుంటాను" అన్నాడు అమలబాబు.

"అపనమ్మకం కలిగించేపని నేనెన్నడూ చెయ్యను. కాని మిత్రుడుకూడా అయివుండాలంటున్నారుగా! అదెట్లా కుదురుతుంది?" అన్నాడు కానాయ్ నిబ్బరంగా.

అమనబాబు స్టీరింగ్ పట్టుకుని, అటువైపు చూస్తూ "మీరు నాకు బాగా నచ్చారు. ముఖప్రీతిమాటలు మాట్లాడేవాళ్ళంటే

నాకు గిట్టదు. నేను మీకు మిత్రుణ్ణి అయినాను. మీరుకూడా నాకు మిత్రులవటానికి ప్రయత్నించండి' అన్నాడు.

కానాయ్ నవ్వుతూ "ఓ! మనస్ఫూర్తిగా ప్రయత్నిస్తాను" అన్నాడు.

ఒకచేత్తో స్టీరింగ్ పట్టుకుని, రెండోచేత్తో జేబులోంచి సిగరెట్ కేస్ తీసి తెరచి, కానాయ్ ముందుపెట్టి"ఊఁ. అయితే కానీండి, పాపంలో పాలుంచుకుని మన స్నేహాన్ని మరింత వృద్ధి చెయ్యండి" అని అమలబాబు నవ్వుతూ—"నాకు మరో మిత్రుడున్నాడు—మనమిప్పుడు వెతుకుతున్న లోటలో కార్ఖానాఉంది చూశారూ, దాని మేనేజరు. చాలా ఘటికుడులెండి" అన్నాడు.

వారిప్పుడు అక్కడికి పదిహేనుమైళ్ళు దూరంలో—కలకత్తా శివార్లలోనేవున్న ఓగ్రామానికి వెళ్ళాలి. వారి కారు విశాలమైన రోడ్డుమీదినుంచి కొంచెం ఇరుకుగావున్న రాస్తాలోకి మలుపు తిరిగింద. ఈ రాస్తానీ తిరుగుతున్నాయి మిలిటరీలారీలు. మధ్యమధ్య అక్కడక్కడ తోపుల్లో మిలిటరీ డేరాలువేసివున్నాయి. క్రొత్త క్రొత్త ఇళ్ళూ అవీ తయారవుతున్నాయి. రెండుమూడూ చోట్ల అదివరకున్న పాకలనన్నిటినీ పీకించేసి ఆ ప్రదేశమంతా శుభ్రం చేసి ఉంచారు. ఇహ అక్కడికూ్కడా మిలిటరీ గూడారాలొచ్చి పడతాయి. రాస్తా ప్రక్కనివున్న పెద్ద పెద్ద తోపుల్లో మిలటరీ లారీలు బారులు తీర్చిపెట్టి ఉన్నాయి. ఆ రాస్తాని పల్లీయుల రాకపోకలు పరిమితంగా మాత్రం సాగుతున్నాయి. ఆ చిట్టడవి చెట్ల మధ్య అక్కడక్కడ కొన్ని మట్టికొంపలున్నట్లు కన్పిస్తున్నాయి. బాటప్రక్కల్ని దోసెడుదోసెడేసి దొరువులున్నాయి. ఎటుచూసినా శీతకాలపు పంటపైరులతో వున్న పొలాలు, ఊదా రంగు పూలతో నిండివున్న బటానీతీగెలు, ఆవమొక్కలంత యెత్తునవున్న గోధుమపైరులు కన్పిస్తున్నాయి. అట్టే జన సంచారంలేని రాస్తా కనుక కారు వేగంగానే పోతోంది. కాని హఠాత్తుగా కొంతమంది జనం గుంపుగా ఎదురురావటంవల్ల అమలబాబు

కారువేగాన్ని కాస్త తగ్గించాడు, ఆ గుంపులో ఆడ, మగ-అందరూ ఉన్నారు. కొంతమంది నెత్తిని, నడ్డిని వారి వారి గంప సామానులున్నాయి. కొందరి బుజాల్ని మూటలున్నాయి. కుర్రాళ్ళు కొందరు మేకల్ని దూడల్నీ తోలుకు వస్తున్నారు. ఆ గుంపు దగ్గరకి రాగానే అమలబాబు కారు ఆపాడు. వారిలో ఒక వృద్ధణ్ణి దగ్గరకిపిలిచి "మీరంతా కొంపలు విడిచిపెట్టి పోతున్నారల్లే ఉందే! మీ ఊళ్ళోకికూడా మిలిటరీ గుడారాలొచ్చి పడ్డాయా?" అని అడిగాడు.

వృద్ధుడు వాళ్ళిద్దరి ముఖాలకేసీ చూస్తూ ఊరుకున్నాడు. జవాబేమీ చెప్పలేకపోయాడు. అతడిపెదవులు వణకసాగాయి. చిక్కిపోయిన అతడిచెక్కిళ్ళమీద రెండు కన్నీటి చారికలుకట్టాయి. ఆ జనమంతా అలాగే నిలబడివున్నారు. ఆడవాళ్లు అమలబాబు కేసి, కానాయ్‌కేసి ఆశ్చర్యంగా చూడడం మొదలెట్టారు. పిటపిటలాడుతున్న యౌవనంతో కళకళలాడుతున్న ఓ చక్కనిపిల్ల కానాయ్‌కేసి ఎగాదిగా చూడసాగింది.

"మీకందరికీ మీఇళ్ల ఖరీదు లిచ్చేశారా?" అని మళ్ళీ ప్రశ్నించాడు" అమలబాబు.

వాళ్ళలో ఓ వృద్ధురాలు "ఆఁ. ఇచ్చేశారు బాబూ! ఇచ్చేశారు. కాని ఖరీదులు తీసుకుని ఏం చేసుకోమంటారు? ఎక్కడికి పొమ్మంటారు చెప్పండి? తాతముత్తాత లేనాడో కట్టించిన కొంపలు:—" అంటూ కళ్ళ నీళ్లొత్తుకుంది. మరో వ్యక్తి ఆమె మాటని అందుకుని, "కొంపా—గూడూ, దూడా—దుడుసూ, దొరువూ చెరువూ అన్నీ అంతే—అనాది కాలంనుంచీ ఉన్నవే" అన్నాడు. అతడి కళ్ళనుంచి టపటప కన్నీటిచుక్కలు రాలాయి, ఈసారి ఆఒక్క వ్యక్తేకాదు—అందరూ కళ్ళ నీళ్లు తుడుచుకున్నారు.

"ఏంచేస్తారు చెప్పు? దేశంలో యుద్ధం ప్రారంభమయిందాయె! ఇలాంటి సమయాల్లో ప్రజలు కొన్ని కష్టాలు సహించక

తప్పదు. సిపాయీలుండేందుకు చోటు చూపించకపోతే మరి వాళ్లమాత్రం ఎక్కడుంటారు! పెద్దపెద్ద మేడల్నికూడా ఎన్నిటిని తీసుకుంటున్నారో చూస్తున్నారుగా'' అన్నాడు అమలబాబు.

ఓ ముసిలివాడు నవ్వుతూ ''నాలుగిళ్లువున్న వారిదగ్గిర ఒక ఇల్లు తీసుకుంటే మాత్రం ఏం? వారు మరో ఇంటోకెళ్ళి ఉండగలరు. మాలాంటివాళ్లం ఏం చేస్తాం? ఎక్కడికి వెడతాం?'' అని అడిగాడు.

''మీకు వుండేందుకు జాగా కావాలంటే నేను ఇస్తాను... పురం తెలుసా?''

''...పురమా? ఆం. తెలుసు బాబూ!''

''—అక్కడున్న రాయబహదూర్ విభూతిబాబుగారి తోటకి రండి. నే నిప్పుడక్కడికే వెడుతున్నాను. అక్కడ మీకు ఉండేందుకు జాగా దొరుకుతుంది. ప్రస్తుతం కావాలంటే మా రేకుల షెడ్డుల్లో ఉండొచ్చు—తర్వాత మెల్లిగా పాకలు వేసుకుందురు గాని. అక్కడ మేం కొన్ని ఇళ్లు కట్టిస్తున్నాము. మీకు కూలి కూడా దొరుకుతుంది''

వాళ్ళంతా ఒకరిమొహాలొకరు చూసుకున్నారు.

''ఏమంటారు?''

''ఆలోచించుకుంటున్నాం బాబూ!''

అమలబాబు అయిదురూపాయల నోటొకటి తీసి, ఆ ముసిలివాడి చేతికిచ్చి ''పిల్లలకి తినటానికేమయినా కొనిపెట్టు. మనసుకి సమ్మతంగా వుంటేనే రండి...పురంలోని విభూతి బాబుగారి తోటకి...అక్కడ మీకు వుండటానికి చోటు దొరుకుతుంది.'' అన్నాడు.

అమలబాబు మళ్ళీ కారులో ఎక్కికూచుని ''దౌర్భాగ్యుల దండు!'' అనుకున్నాడు.

కానాయ్ కళ్లు ఒత్తుకున్నాడు. ''ఆ అందమైన అమ్మాయి మాత్రం వాళ్ళలో అతకటంలేదుసుమీ'' అన్నాడు అమలబాబు.

పెద్ద విశాలమైన తోట. ఎప్పుడో ధనవంతుడైన విలాస పురుషుడెవడో ముచ్చట పడి దీన్ని విహారోద్యానంగా తయారు చేయించుకున్నాడు. సృష్ట్యాదినుంచీ మిథ్యా వాదం, స్వార్థ త్యాగం, ఆత్మనిగ్రహం మొదలైనవాటి మహిమల్నిగురించి ఎన్నెన్నో కథలు ప్రచారమవుతూ వస్తున్నాయి. అయినా మానవ సమాజంలో వశిష్టునిలాంటి పూజ్యులు ఏ యిద్దరో ముగ్గురో మాత్రమే ఉన్నారు. మునులు—ఋషులుకూడా లెఖ్ఖకి చెప్ప తగినంతమంది లేరు. కోటికి ఒక్కరైనా ఉంటారో సందేహమే. వస్తుతః వ్యావహారిక జగత్తులో ఇంద్రత్వసాధన కోసమైన తపస్సే సాగుతోంది. ఇంద్రత్వాన్ని సాదించాలనే ఆదర్శంమీదకాని, ఇంద్రపదవిమీద ప్రలోభంమీదకాని మానవులకెన్నడూ తృణీకార భావంలేదు, గంజినీళ్ళతో గొంతు తడిచేసుకుంటున్నా పరమా న్నంమీద కాంక్షపోనట్లు-దేశంలో మామూలు మనుషుల పేర్లు తిరగేస్తే 'ఇంద్ర' అనే మాట కలిసివచ్చే పేర్లమీదనే జనానికెక్కువ మక్కువవున్నట్లు కన్పిస్తుంది. 'హరిదాసు' మొదలైన పేర్లు కొంతమంది పెటుకున్నా వారి అభిలాషమాత్రం 'హరీంద్రు'డవా లనే! ఇంద్రైశ్వర్య గౌరవానికీ, ప్రలోభనీయమైన ఆ అధికారా నికి నందనోద్యానంకూడా సంపదలో ముఖ్యమైన భాగమే. దానికీ సోమరసానికీ అప్సరసలకీ అవినాభావ సంబంధంవుది. కనుక వ్యావ హారిక జగత్తులో 'అర్ధ-ఇంద్రత్వం' 'పావు-ఇంద్రత్వం' సాధించగలిన వారికి దాని కవసరమైన ఓ నందనోద్యానం కూడా కల్పించుకుందా మనే కాంక్ష ఉండటం సహజమే. అలాంటి ఏ 'ఛోటాయింద్రుడి' నందనవనమో రాయబహదూర్ బి.బి. ముఖర్జీ వ్యాపారాశ్వమేధ యాగ ఫలితంగా—ఆ పాతఇంద్రుడి చేతులుమారి ఇతడి చేతుల్లోకి వచ్చింది.

ఆ తోటమధ్య ఓ సరస్సుంది—అంటే మరేంలేదు ఓ దొరు వన్నమాట! ఆ సరస్సు ఒడ్డునే ఓ చక్కటి మేడ ఉంది. ఆ మేడలో క్రిందంతా పింగాణీరాళ్లు పరిచివున్నాయి. ఏ రసాయని

కద్రవ్యసహాయంతోనైనా పరిశోధనలు సాగిస్తే—ఆ రాళ్ళకీ రాళ్ళకీ మధ్యనుండే గాళ్లలో ఎప్పుడో ఒకానొకప్పుడు మానవులు సేవించే సోమరసం కొంత తొణికినట్లు - నాట్యాంగనలైన అప్సరసల పాద ధూళి ఒకింత రాలినట్లు-ఈనాటికైనా ఆధారాలు బయటపడగలవని కానాయ్‌కి తోచింది. అయినా అతడికి ముఖోపాధ్యాయ—ముఖర్జీ—గారిమీద, ముఖ్యంగా అమలబాబుమీద కుదిరిన గౌరవం సన్నగిలలేదు. ఇంద్రత్వసాధనే వారికీ పరమాశయమైనా, నందన వనంమీద వారికి అంత మోజులేదు. ఆ మేడనీ, సరస్సునీ మాత్రం వారు పాడుచెయ్యకుండా అలాగే ఉంచినా, ఆ నందన వనాన్ని మాత్రం 'విశ్వకర్మలకొలువుగా' అంటే కార్ఖానాగా మార్చేశారు.

తోటలోకి వెళ్ళగానే ముందు అయిదారు రేకుల షెడ్లు కన్పించాయి.

అమలబాబు ఇంకా కారుదిగకముందే కార్ఖానా మేనేజరు పరుగెత్తుకొచ్చాడు. మాంచి ఒడ్డూ-పొడుగూ ఆరోగ్యంగా ఉంటా డతడు. ముక్కుకిపైగా నుదుటిమీద అతడికో గాయపుమచ్చ ఉంది. ఆఫీసు వ్యవహారాల్లో అత డత్యంత విధేయుడు. హడా విడిగా పరుగెత్తుకుంటూ వచ్చి కారుతలుపు తెరిచి, చిరునవ్వు నవ్వుతూ "గుడ్ మార్నింగ్ సార్!" అన్నాడు.

అమలబాబుకూడా నవ్వుతూ అతడి కరస్పర్శచేస్తూ "గుడ్ మార్నింగ్! ఎలా ఉన్నారు? ఏమిటీ?" అని అడిగాడు.

"తమ దయవల్ల బాగానేవున్నాం"

"పనెలా జరుగుతోంది?"

"నా శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తున్నాను భాయీ! అయినా ఇవాళనేనే సమ్మెట పట్టుకోవాల్సివచ్చింది—మనుషులు తక్కువయారు. కూలి లెక్కడా దొరకటంలేదు."

"ఏం విందుచేస్తారు చెప్పండి-నేను మీకు కొంతమంది కూలీలు దొరికేట్లు ఏర్పాటుచేసి వచ్చాను. ఎన్నాళ్లుఉండమన్నా

ఉండే కూలీలు. పదిపన్నెండుమంది మగవాళ్లు, ఓ పదిమంది ఆడవాళ్లు, ఇంకా కొంతమంది పిల్లలుకూడా ఉన్నారు. ఎప్పుడూ ఇక్కడే ఉంటారు. వాళ్ళలో కావలసినమందితో పనిచేయించుకో వచ్చు'' అమలబాబు అంతా విశదంగా చెప్పాడు.

మేనేజరు జితూబాబుకి చాలా ఉత్సాహం వచ్చింది. పట్ట పగ్గాలేని ఉత్సాహం అతడిది.

''చాలా కష్టాల్లో ఉన్నారు జితూదా! పాపం నిరాశ్రయులై వెళ్ళిపోతున్నారు. అలాంటి వాళ్ళకి ఆశ్రయం ఇస్తే వారికీ ఉప కారం జరుగుతుంది. మనకీ ఉపయోగం ఉంటుంది కదా అని పించింది.''

జితూబాబు జాలిపడుతున్నట్లుగా చూస్తూ ''శుభం భూయాత్ భాయీ!'' అన్నాడు.

అమలబాబు చేతిగడియారంకేసి చూస్తూ ''గోడౌన్‌కి వెళ్లి చూసొద్దామా? మీరు రోజూ చూస్తున్నారుగా! నిల్వలేం పాడై పోలేదు కదా?'' అని అడిగాడు.

''నేను రోజూ రెండుపూటలా శ్రద్ధగా చూసివస్తున్నాను. అయినా మీరుకూడా స్వయంగా చూసివద్దురుగాని రండి''

ఆ రేకుల షెడ్డులమధ్య ఓ గోడౌన్ ఉంది—అదీ రేకుల షెడ్డే. దానికి నాలుగు వైపులా ఇటికగోడలున్నాయి. దాని తలుపు తీయగానే కానాయ్ ఆశ్చర్యంతో క్కొయ్యబారి పోయినట్ల యినాడు. ఈ కొసనుంచి ఆ కొసదాకా ఉన్నాయి బియ్యపు బస్తాల వరుసలు.

అమలబాబు నాలుగువైపులా పరీక్షగా చూశాడు. అలా చూస్తున్నంతసేపూ అతడి ముఖవైఖరి మారిపోవటం కానాయ్ గమనించాడు. జితూబాబుతో అతడికున్న స్నేహం అంతా ఆక్ష ణంలో మాయమైపోయిందా అని పించింది. అంత 'సీరియస్'గా ఉంది అతడి ముఖం.

అక్కడినుంచి బయటికి వచ్చి, "భేష్. బాగుంది" అన్నాడు అమలబాబు.

ఇంకో రెండడుగులు ముందుకువచ్చాక "అవి రెండు వేల అయిదువందల బస్తాలు కదూ!" అని అడిగాడు మళ్ళీ.

జితూబాబు కంగారుపడుతూ "చిత్తం!" అన్నాడు.

మిగిలిన అయిదు షెడ్లలో మూడింటిలో చిన్న చిన్న ఇనప పనిముట్లు తయారుచేసే కార్ఖానా ఉంది. పనంతా మిషిన్‌మీదే జరుగుతోంది. రెండుమూడు సైజుల్లో వేలకివేలునట్లు తయారవు తున్నాయి. అవన్నీ మిలిటిరీ కాంట్రాక్టుకు సంబంధించినవే.

మిగిలిన రెండు షెడ్లూ క్రొత్తగా తయారవుతున్నవి. వాటికి నాలుగుప్రక్కలా ఇటిక గోడలు కట్టారు.

"ఈ రెండింటిలోకూడా ఒక్కొక్కదాంట్లో రెండు వేలన్నర వంతున అయిదు వేల బస్తాలు పడతాయికదూ!" అని అమలబాబు ప్రశ్నించాడు.

"ఎక్కువే పడతాయి. వెడల్పుకన్న పొడుగు పదిహేనేసి అడుగులు ఎక్కువ ఉన్నాయి.

"మీరు భలే అసాధ్యులు జితూదా!"

అమలబాబు ముఖం మళ్ళీ మారిపోయింది.

"మీ పనంటే ఒకయెత్తు-నా ప్రాణం ఒకయెతు. మీ నాన్న గారంటే మాకు సాక్షాత్తు దేవుడుకదండీ!" అన్నాడు జితూబాబు.

అమలబాబు నవ్వుతూ "అయితే ఆ దేవపుత్రుడిచేత టీ త్రాగిద్దురుగాని రండి" అని అంతలో స్ఫురణకు తెచ్చుకుని "మీతో మాటల్లోపడిపోయి మీ కిద్దరికీ పరిచయం చెయ్యటం మరచి పోయాను. ఓహ్! పెద్ద పొరపాటయిపోయింది. వీరి పేరు కానాయ్ చక్రవర్తి, నా మిత్రులు... ఇహ వీరంటారా— సుప్రసిద్ధ జితూదా- జితేంద్రబోస్" అని ఉభయులకి పరిచయంచేశాడు. జితేంద్రబోస్ హడావిడిగా ముందుకువంగి, "చాలా సంతోషం" అంటూ కానాయ్‌బాబు కరస్పర్శ చేశాడు.

కానాయ్ నమస్కారం చెయ్యబోయాడు! కానీ జితూబాబు చెయ్యిచాచటంచూసి తానూచెయ్యి అందించాడు.

"మనమంతా మిత్రులం జితూదా! తెలిసిందా?" అన్నాడు అమలబాబు.

అమలబాబు అద్భుతమైనవాడు. అతడు నవ్వుతూ, శ్రమ యెరగకుండా పనులుచూసుకుంటూ తిరుగుతూ ఉండటంచూసి కానాయ్ విస్తుపోతున్నాడు.

ఆఫీసుకి తిరిగివచ్చాక అమలబాబు మళ్ళీ బయటికి బయలు దేరాడు. సరుకురవాణాకి సంబందించిన ఆఫీసు అది. అక్కడికి కానాయ్‌నికూడా వెంటతీసుకెళ్ళాడు. మిలిటరీ దుస్తుల్లాంటి దుస్తులుధరించిన మెసెంజర్స్ అటూ ఇటూ హడావిడిగా తిరుగుతున్నారక్కడ. వాళ్ళలో మరీ పొట్టిగావున్న ఒకణ్ణి చూసి కానాయ్ ఆశ్చర్యపోయాడు. అతడు మూడడుగుల పొడుగుకూడా ఉండడు. అమలబాబుని చూడగానే అతడుమిలిటరీ పద్ధతిని 'సాల్యూట్' చేశాడు. అమలబాబు నవ్వుతూ ప్రత్యభివాదనగా మళ్ళీ సాల్యూట్ చేసి అతడిచేతికి ఏదో యిచ్చాడు. కానాయ్‌తో "మీరు బయట కాసేపు కూచోండి. నేనిప్పుడేవస్తాను" అని వెళ్ళి పోయాడు. ఆ మరుగుజ్జు హడావిడిగా కానాయ్‌నితీసుకెళ్ళి ఓ కుర్చీలో కూచోపెట్టాడు.

కానాయ్ ఆ మరుగుజ్జునిగురించే ఆలోచిస్తూ కూచున్నాడు. రామరావణ యుద్ధ సందర్భంలో ఉడత సహాయం చేసిందన్న కథ జ్ఞాపకంవచ్చింది. యంత్రాలు, ఏనుగులు, ఒంటెలు, గుర్రాలు, గాడిదలు, కంచర గాడిదలు—ఎన్నింటిశక్తో ఈ యుద్ధంలో వినియోగింప బడుతోంది. ఇహ మానవుల శక్తిని గురించి చెప్పేదేముంది! ఈనాడీ మరుగుజ్జు శ్రమశక్తి అయినా ఉపేక్షించ తగింది కాదు. కానాయ్ దీర్ఘంగా నిట్టూర్చాడు. నలభైకోట్ల మానవుల శ్రమశక్తి సాధించలేని అసాధ్య కార్యం ఏముంటుంది!

"మిస్టర్ చక్రవర్తీ!"

అమలబాబు కేకేశాడు. కానాయ్ లోపలికెళ్ళాడు. అమలబాబు అతడ్ని ఒక గదిలోకి తీసికెళ్ళి, మిలిటరీదుస్తుల్లోవున్న ఒక దొరకి పరిచయంచేసి "ఒకవేళ నేను రాలేకపోతే వీరిని పంపిస్తాను" అని చెప్పాడు.

ఆదొర ఠీవిగా కరస్పర్శచేసి "చాలా సంతోషం మిస్టర్ చక్రవర్తీ!" అన్నాడు.

బయటికివచ్చి అమలబాబు కారులో కూచున్నాక, నవ్వుతూ ఒగడియారం తీసి చూపుతూ "అతడిదగ్గిర కొన్నా నీ గడియరాం. ఖరీదెంతో తెలుసా?" అన్నాడు.

అది బంగారపు గడియారం.

అమలబాబు నవ్వుతూ "వెయ్యి రూపాయలు" అన్నాడు.

మళ్ళీ వెంటనే "మీరువచ్చిన వేళావిశేషం మంచిది. ఓ పెద్ద ఆర్డర్ సంపాయించాను" అన్నాడు.

ఇహ కాంసేపటికి ఆఫీసు అయిపోతుందనగా అమలబాబు కానాయ్‌తో—"అదుగో ఆ గదిలో కొంతమంది బైట కమ్మర్లు కూచుని ఉన్నారు. అడవులునరికే కత్తులు తయారు చేయించాలి వారిచేత. ఇనుము మనమే ఇస్తాం.—ఆకత్తులకి పిడులుకూడా మనమే తయారు చేయించి ఇస్తాం. కత్తులను తయారుచేసి, ఆ పిడుల్లో బిగించి ఇవ్వటమే వాళ్ళపని. అలా తయారుచేసి ఇవ్వటానికి ఒక్కొకకత్తికి మనం రూపాయిన్నరదాకా ఇవ్వవచ్చు.మీరు వాళ్లతో ఎంతకి ఖరారు చేసుకోగలరో—ప్రయత్నించి చూడండి" అని చెప్పాడు.

బైటకమ్మర్లు, ఐనా మంచిమాట నికరం వున్నవాళ్లు. "రెండురూపాయలకి తక్కువయితే మాకు గిట్టదండీ: మాకు రెండేసి రూపాయలిచ్చినా మీకు చాలాలాభం ఉంటుంది" అన్నారు వాళ్లు.

కానాయ్ తన చాకచక్యంఅంతా చూపటానికి సిద్ధంగా వున్నాడు. బేరం ఎలా చెయ్యాలో చేతకాకపోయినా 'బేరం మాత్రం చెయ్యవచ్చు—కాని ఎవర్నీ మోసంమాత్రం చెయ్యకూడదు' అన్నసూక్తి అతడికి ముందు స్ఫురించింది. ఎలా బేరం చెయ్యాలో—ఆ పద్ధతికూడా కాస్త వినివున్నాడు. "రూపాయి ముప్పావలాకన్న కంపెనీ ఎక్కువ ఇవ్వలేదు. మీరు ఆధరకి చేసి ఇవ్వకపోతే మేము వేరే ఎవర్నయినా ఏర్పాటు చేసుకుంటాం" అన్నాడు.

అతడీమాటలు అంటూనే అక్కడినుంచి గంభీరంగాలేచి బయలు దేరపోయాడు. వాళ్లు ఇతడి గంభీరాన్నిచూసి కాస్త తగ్గారు. "సరే పోనీండిబాబూ! రూపాయిపధ్నాలుగణాలకైనా ఖరారు చేయించండి. [illegible] అన్నాడు వాళ్ళలో ఒకడు.



కానాయ్ సంకోచిస్తూ వచ్చి ఆమాట అమలబాబుతో చెప్పాడు. అమలబాబు నవ్వుతూ "ఇంకొంచెం బెట్టుచేస్తే ఇంకా తగ్గుతారు. సరే ఆలాగే కానీయండి" అన్నాడు.

ఇంతలోనే సంతకంకోసం కానాయ్‌బాబు దగ్గిరకి ఓ వోచరు వచ్చింది. అతడికి కమీషన్ క్రింద అరవై రెండురూపాయలన్నర వచ్చింది. కానాయ్ విస్తుపోయాడు.

"తయారుచేసేందుకు రెండు రూపాయలవుతుందని మనం లెఖ్ఖ వేసుకున్నాం మీరు రెండణాలు తగ్గించారు. కనుక అందులో ఒకఅణా మీరు కమిషన్‌క్రింద తీసుకోండి. ఇది మా నియమం" అన్నాడు అమలబాబు నవ్వుతూ.

కానాయ్ ఆ డబ్బుతీసుకుని మైకంకమ్మిన వాడిలా బయటికి వొచ్చాడు.

అరవైరెండున్నరని రెండెట్టి గుణిస్తే నూటపాతికరూపా యలు! నిజానికసలు ఆ డబ్బు ఆ బైటకమ్మర్లకి రావలసింది! అతడి మనస్సులో ఏదో అశాంతి బయలుదేరింది.

"రేపు పదకొండుగంటలలోపలే రండి" అన్నాడు అమల బాబు.

కానాయ్ కర్జన్ పార్కులోకివచ్చి కూచున్నాడు.

'వాళ్ళింకా వస్తుతారు' అని అమలబాబు నవ్వుతూ అన్న మాట లతడికి గుర్తుకొచ్చాయి. అంటే తనమూలంగా వాళ్ళకి కాస్త ఎక్కువగా గిట్టుబాటయినట్లేగా! ఈ ఆలోచన రావటంతో అతడి మనస్సుకి కొంచెం తృప్తి కలిగింది. అతడక్కడినుంచి లేచాడు. ఆఫీసులన్నీ మూసేసి చాలా సేపయింది. రోడ్డుమీద జనం అంతగాలేరు. ఎస్ప్లనేడ్ట్రాం షెడ్ దగ్గిర కొచ్చేసరికి అపడికి హఠాత్తుగా నీల కన్పించింది. ఒక్కనిమిషంలో అతడి మనస్సులోని అశాంతి అంతా మాయమైంది.

నీల పత్రికలమ్మే కొట్టుముందు నుంచునుంది. కానాయ్ కుతూహలంకొద్దీ ఆమె వెనకాలకివచ్చి దగ్గిరగా నుంచున్నాడు. నీల మాత్రం అక్కడ తగిలించివున్న పత్రికల కేసి శ్రద్ధగా చూస్తూ వుంది. అతడు ఇంకొంచెం ముందుకు వంగాడు. అతడివేడి నిట్టూర్పు ఆమెమెడకి సోకింది.

నీల ఈసారి శరీరాన్ని కుంచించుకుని, రవంత ముందుకు జరిగి, వెనక్కి తిరిగి చూసింది. ఆమె ముఖానికి కోపంతో ముడి వైచుకున్న కనుబొమలు ఓ క్రొత్త అందాన్ని తెచ్చిపెట్టాయి. క్షణంలో కనుబొమలు విడిపడ్డాయి. ప్రసన్నమైన మందహాసంతో ఆమెముఖం వికసించింది.

"మీరా?"

"ఆఁ. కామ్రేడ్!" అతడివాళ సేన్ అని పేరుపెట్టి పిలవ లేదు. కామ్రేడ్ అనే సంబోధించాడు. మరుక్షణంలోనే చుట్టు

జనం ఉంటారనే సంగతి స్పృహకి తెచ్చుకుని, "ఇక్కడకాదు. కాఫీహోటల్‌కి వెడదాంరండి. ఇవాళ మీకు నేను కాఫీ ఇప్పిస్తాను" అన్నాడు.

"బదులు తీరుస్తున్నారా?" అని నీల నవ్వుతూ అడిగింది.

"బదులుతీర్చటం కాదు. ఇవాళ నా మొదటి సంపాదన సంపాయించాను. రండి. మాట్లాడాల్సిన సంగతులు చాలా వున్నాయి"

"ఉద్యోగంలో చేరారా? అదేమిటి? చదువు వదిలేశారా?"

"చదువు వదిలేశాను. కాని ఉద్యోగంలో చేరలేదు. వ్యాపారం—బిజినెస్!"

"బిజినెస్సా?"

"ఆఁ. రండి."

కాఫీ హోటల్లో జనం చాలామంది ఉన్నారు. అతడు తన సంగతులన్నీ అక్కడ చెప్పలేకపోయాడు. మర్మాంతికమైన పెద్ద అఘాతం ఘట్టిగా తగిలినా తన శ్రేయస్సుకే ఈ విముక్తి లభించిందన్న సంగతి అతడక్కడ చెప్పలేకపోయాడు. కాఫీ త్రాగుతూ మాట్లాడుకున్నవన్నీ ఇతర విషయాలే-పార్టీసంగతులు మొదలైనవి.

బయటికివచ్చాక "ఏదీ మీ సంగతులేవీ చెప్పనేలేదే!" అని అడిగింది నీల.

"పార్కుకి వెడదాం వస్తారా?"

అరుణరేఖలు ఆకాశమంతా ఆవరించాయి. రోడ్లమీద దీపాలు వెలిగాయి. నీల అటుకేసే చూస్తూ "చీకటిపడింది. నేనింకా రాలేదేమో అని అనుకుంటూ వుంటాడేమో బహుశా మా నాన్న" అన్నది.

"అయితే ఎలా? చాలా సంగతులున్నాయే!"

"క్లుప్తంగా చెప్పండి."

"క్లుప్తంగా చెప్పటానికి కుదరదు. చాలా గొడవలున్నాయి. ఆరోజున మీకు చెప్పలేక పోయాను. ఇవాళ చెపుదా మనుకుంటున్నాను."

"అయితే—ఎల్లుండి—శనివారం కర్జన్ పార్కులో కలుసుకుందాం. ఆతర్వాత వీలయితే యీడెన్ గార్డెన్స్‌కి వెళ్లొచ్చు. ఏమంటారు?" అన్నది నీల.

"సరే. నేను ఎదురుచూస్తూ ఉంటాను"

నీల నవ్వుతూ "బహుశా నేనే ఎదురు చూస్తూ ఉండాల్సి వస్తుందేమో! మీకు చెప్పాలనే ఆవేగంకన్న నాకు వినాలనే ఉద్వేగం ఎక్కువగా ఉంది" అన్నది.

"అయితే ఒక్కముక్క చెపుతాను" అని అతడు ఆవేగంలో "నేను విముక్తుణ్ణిఅయ్యాను కామ్రేడ్! బంధనాలన్నిటినీ వదిలించుకున్నాను. నేను మా ఇంటితో సంబంధం తెంచేసుకున్నాను." అన్నాడు.

నీల విస్తుపోయి అతడి ముఖంకేసి చూడసాగింది.

"నేను ఇవాళ కేవలం మానవుణ్ణి. విముక్తిపొందిన మానవుణ్ణి. విముక్తుడనై ఈ ప్రపంచంలో నా ఇల్లు—వాకిలీ—జీవితం—అన్నిటీనీ కొత్తగా నిర్మించుకో బోతున్నాను. ఆ విషయంలోనే నీ సలహా కావాలి నీలా!నిన్ను'నువ్వు'అంటున్నందుకు కోపంలేదు కదా!"

నీల నవ్వుతూ"ఉహూఁ."అన్నది.

ఇంతలో ట్రాంవచ్చి ప్రక్కనే ఆగింది.

కానాయ్ ఇంటికి—అంటే విజయదా ఇంటికి—వచ్చేసరికి అతడు మహా హడావిడి పడుతున్నాడు. క్రింద మెట్లదగ్గిర నుంచుని షష్ఠిమీద కేకలేస్తూ కంగారు పడుతున్నాడు.

షష్ఠి టాక్సీకోసం వెళ్లాడు.

బిచ్చకత్తెలాంటి స్త్రీ యెవతో తీవ్రంగా బాధపడుతోంది గీత ఆమె ప్రక్కన విసురుతూ కూచుంది. ఇద్దరుపిల్లలు చేరి

ప్రక్కనా ఏడుస్తూ నుంచున్నారు. ఆ పిల్లలిద్దరూ ఆ బిచ్చకత్తె పిల్లలని చూడగానే తెలిసిపోతోంది. తల్లి అలా బాధపడటం చూసే వాళ్లుకూడా ఏడుస్తున్నారల్లే వుంది!

ప్రసవించబోతున్న స్త్రీ, ఆమె ప్రసవవేదన పడుతోంది.

ఆమె మహమ్మదీయ స్త్రీ. వాళ్ళది దక్షిణ వంగదేశం. క్రిందటి తుపానులో ఆమె భర్త చనిపోయాడు. వాళ్ళ ఊరుని యుద్ధ ప్రదేశంగా ప్రకటించటంవల్ల, పిల్లలిద్దరిని చెరోచేత పట్టుకుని, మరో శిశువుని గర్భంలో పెట్టుకుని, అన్నంకోసం వెతుక్కుంటూ ఈ మహానగరానికి వచ్చింది. ఇవాళ గర్భంలోని శిశువు ధాత్రీదేవి వక్షస్సుమీద పడాలని తొందర పడుతున్నాడు.

విజయదా సాయంత్రం నాలుగింటికి ఆఫీసుకి వెళ్లాలి. అతడు ఆఫీసుకి వెడదామని వీధిలోకి వచ్చేసరికి ఆ స్త్రీ కన్పించింది. కాస్త మరుగుగావున్న ఓ డస్ట్‌బిన్ చాటున పడుకుని నొప్పులు పడుతోందామె. ప్రక్కనున్న కాలిబాటమీద పిల్లలిద్దరూ ఏడుస్తూ నుంచున్నారు. విజయదా షష్ఠిని టాక్సీకోసమని పంపించాడు. ఆ భిక్షుకిని ఆస్పత్రికి తీసుకెళ్ళాలి.

"ప్రొద్దుననగా వెళ్ళి, ఇప్పటిదాకా ఎక్కడున్నావ్ ? గీత సంగతేదో నువ్వే పట్టించుకుంటే బావుంటుంది" అనిమాత్రం అన్నాడు విజయదా.

ఓ టాక్సీ అక్కడికివచ్చి ఆగింది. అందులో షష్ఠి ఉన్నాడు.

# ౧౧

కానాయ్ "గీతా!" అని కేకేశాడు.

సమాధానమేమీ రాలేదు.

అతడు మళ్ళీ కేకేశాడు. ఈసారికూడా సమాధానమేమీ రాకపోయేసరికి సరాసరి వంట గదిదగ్గిర కెళ్ళాడు. నిన్నరాత్రి ఇక్కడికి వచ్చినప్పట్నుంచీ వీలైనంతసేపు వంటగదిలో కూర్చునే కాలం గడపటానికి ప్రత్నియస్తోంది గీత. విజయదా ఆజ్ఞమూలంగా రాత్రిమాత్రం ఇవతలగదిలో పడుకోక తప్పలేదు. ఆజ్ఞను తిరస్కరించగలిగినంత ధీమాలేదు గీతకి. వసుతః ఆమె కొంచెం మెతక. ఆమె అణకువలో లేమివల్ల కలిగిన పిరికితనమే ఒక పిసరు ఎక్కువగా కన్పిస్తుంది. తాను ఈ ఇంట్లో అనధికార ప్రవేశమే చేశానని, కేవలం దయాధర్మాలమీద ఆధారపడే ఇక్కడవుండ గలుగుతున్నాననీ ఈ రవంత వ్యవధిలోనే గీత బాగా తెలుసుకుంది. కానాయ్‌కీ జాలేసింది. అతడు వంటగది తలుపులోపలికి నెడుతూ మళ్ళీ "గీతా!" అని పిలిచాడు.

గీత అక్కడలేదు. షష్ఠీమాత్రం బీడీ దమ్ములాగుతూ కూచునివున్నాడు, కానాయ్‌ని చూడగానే అతడు నోట్లోబీడీ చటుక్కున లాగేసి, ఆ చెయ్యిచాటుగా పెట్టుకున్నాడు.

కానాయ్ ఆదుర్దాగా "ఏదీ? గీత ఎక్కడికెళ్ళింది?" అని అడిగాడు.

షష్ఠీ అతడి ముఖంకేసి చూస్తూ "నన్నేనా అడుగుతోంది?" అని ఎదురుప్రశ్న వేశాడు.

"మరి ఇంకెవర్ని అడుగుతున్నా ననుకున్నావ్?" అని కానాయ్ కొంచెం విసుక్కున్నాడు.

"స్నానాల గదిలోకివెళ్ళి స్నానం చేస్తోంది"

"ఆఁ. స్నానం చేస్తోందా? ఇంత చలిగా ఉంటే—అందు లోనూ సంజెవేళ—ఇప్పుడు స్నానం ఎందుకు చేస్తోంది?"

"అదేమో తెలియదండీ నాకు. నేనూ అడగలేదు. 'స్నానం చేసివస్తాను షష్ఠీదాదా!' అనిమాత్రం చెప్పివెళ్ళింది"

గీత స్నానాల గదిలోంచి బయటికి వచ్చింది; ఓ ధోవతేదో లుంగచుట్టుకున్నట్లు కట్టుకునుంది. ఆరపెట్టుకున్న తడిజుట్టు పిరుదులకిందిదాకా వ్యాపించింది. వినయసూచకమైన చిరునవ్వుతో వచ్చి నిలబడింది.

"ఈ సంజెవేళ స్నానంచేశావా నువ్వు?" అని కానాయ్ ప్రశ్నించాడు.

"ఆఁ. మరి ఆ అమ్మాయిని ముట్టుకుని పట్టుకోవాల్సి వచ్చిందిగా! అందుకని—" కానాయ్ చూపు వాల్చకుండా ఆమె ముఖం కేసి చూస్తూ "సాటిమానవుల్ని నువ్వింత అంటరానివాళ్ళనిగా యెంచుతున్నావా గీతా? ఛి ఛీ..." అన్నాడు.

"గీత బిత్తరపోతూ తలయెత్తి ఒక క్షణం కానాయ్ ముఖంకేసి చూసి, మరుక్షణంలోనే తప్పుచేసినదానిలాగా తలవంచుకుని నేల చూపులుచూస్తూ అలాగే నుంచుంది. అంగుళమైనా అటూ ఇటూ జరగలేదు. ఆమె తన తప్పును సర్వాత్మానా ఒప్పుకుంటున్నట్లు ఆ భంగిమలోనే తెలుస్తోంది. కానాయ్ ఆమెనింకేమీ అనలేకపోయాడు. పైగా మరింత జాలేసింది. ఆమెకేసి అలా జాలిగా చూస్తూంటే ఆమె చుట్టుకున్న ధోవతి అతడి కంటికి కొట్ట వచ్చినట్లుగా కన్పించి, ఏదో గుర్తుకు తెచ్చింది. ఆఁ. అవునవును. గీత కట్టుకున్న ఒక్కచీరతోనే వచ్చేసింది. ఆమెకింకా చీరెలూ—జాకెట్లూ కావలసిన అవసరం ఉంది. గీత కొక్కటేకే కాదు, చొక్కాలూ—పంచెలూ తనకీ కావాలి. తాను చీకటితో లేవగానే పనిమీద వెళ్ళిపోయాడు. ఇవాళ స్నానం చేసేందుకు తీరిక

చిక్కనేలేదు. అంచేత తనకి చొక్కాలూ—పంచెలూ కావాలన్న సంగతి ఇంతవరకుదాకా గుర్తుకుకూడా రాలేదు.

"పొయ్యి దగ్గిరకయినా వెళ్ళి, కాస్తనిప్పుసెగని కూచో గీతా! చాలా చలేస్తోంది-అందుకని అంటున్నాను. అదీకాక ఇంకా ఈ రోజుల్లో అంటూ—సొంటూ పట్టింపులేమిటి గీతా! అలాంటి పట్టింపులు నాకు చాలా తప్పుగా కన్పిస్తాయి." అన్నాడు చనువుగా.

గీత మెదలకుండా ఊరుకుంది. "వెళ్లు. వెళ్ళి కాసేపు పొయ్యిదగ్గిర కూచో" అని కానాయ్ మళ్ళీ చెప్పాడు.

"పొయ్యిమీద అన్నం ఉడుకుతోందెలా?" అని ఎలాగో అనేసింది గీత.

"ఏమయితే?"

"కొంపతీసి నా చెయ్యేమైనా తగిలితే?"

గీత మాటల్లోని తాత్పర్యం కానాయ్‌కి తేలు కుట్టినట్లు పట్టింది. ఆమె పూర్వాచార పరాయణులైన చక్రవర్తి వంశీయుల బిడ్డ. పాపపుణ్యాలను ఒప్పుకున్నా, ఒప్పుకోక పోయినా పాపపుణ్య విచక్షతమాత్రం వారికి బాగా తెలుసు. దిక్కూ—దివాణంలేని స్థితిలో తనమీద అత్యాచారం జరిగింది. అయినా సంఘంలోవున్న రివాజునుబట్టి తానేదో అంటరానిదానినైనట్లు అనుకుంటోంది గీత. "కాదు, నువ్వలాంటిదానివి కాదు గీతా!" అన్నాడు కానాయ్.

గీత ఈసారి కళ్ళెత్తి అతడి ముఖంకేసి చూసింది.

"నువ్వు పూజాపుష్పమంత పరిశుద్ధురాలివి గీతా! అలాంటి ఆలోచనలేవీ పెట్టుకోకు. నిన్నెపాపం అంటలేదు" అంటూ కానాయ్ ఆమెతల నిమురుతూ "వెళ్లు, పొయ్యిదగ్గిరకెళ్ళి కూచో. నేను కాస్త బజారుదాకా వెళ్తొస్తాను. గుడ్డలూ అవీ కొనుక్కురావాలి" అన్నాడు.

కానాయ్ బజారుకి వెడుతూ 'గీతని ఏమిటి చెయ్యటం? తాను హీనురాలనని, జీవితంలో చెయ్యకూడని తప్పుచేశానని

ఆమెకి కలిగిన తలంపు ఎప్పటికైనా ఎలా తొలిగిపోతుంది!' అని ఆలోచించ సాగాడు.

గీత కానాయ్‌మాటని త్రోసిపుచ్చలేదు. ఎంత చలికాలమైనా వేళకానివేళ స్నానం చెయ్యటం ఆమెకి అలవాటులేని కొత్త పనేంకాదు. అయినా బాగాచలిగా వుందివాళ. ఒంటిని జాకెట్టయినా లేదు. పొయ్యి దగ్గిరకెళ్ళి విశ్రాంతి తీసుకుంటూ కూచుంది. కట్టెలు భగభగ మండుతున్నాయి. ఆ ఎర్రటి మంటల కేసి చూస్తూ కూచుంటే ఏవేవో గుర్తుకొస్తున్నాయి. రోజూ సాయంత్రం ఇలా కూచునే కాలం గడుపుతూవుండేది. ఇంటిదగ్గిరుండగా వంటతానేచేసేది. కొద్దిరోజులనుంచీ పేదరికంవల్ల ప్రతిరోజూపొయ్యి రాజనిమాటా నిజమే. ఇవాళ ఇంటిదగ్గిర పొయ్యిలో పిల్లి లేచిందోలేదో: ఆమెకి ఒంట్లో దడపుట్టుకొచ్చింది. కొంతవరకెలాగయినా తమ ఇంట్లో రోజూ పొయ్యిరాజాలనే తలంపుతోనే తల్లితండ్రులు తనని అమ్మడానికి పూనుకుంది! మమకారంతో, దుఃఖంతో, ఏవగింపుతో ఆమె హృదయం విచ్చిపోసాగింది. తల్లి ముఖం గుర్తుకొచ్చింది. వస్తుతః చాలా అందమైనదావిడ. కాని ఇటీవల ఆమె ఒంట్లో యెముకలన్నీ బయటపడ్డాయి. ఇప్పుడేం చేస్తోందో ఆమె! బహుశా ఏడుస్తూ ఉంటుందేమో! తనకోసమే ఏడుస్తూ ఉండొచ్చు! తన తమ్ముడు హీరేన్ ఇంటికొచ్చాడోలేదో! తానుకూడా ఇంట్లో లేదుగా! బహుశా వచ్చి ఉండడు...

తన తండ్రి రోగిష్టి....పక్కమీద కూచుని బీడీలు కాలుస్తూ, దగ్గుతూ ఆయాస పడుతుంటాడు!

ఇదంతా గీత ఊహ ... ఊహకాదు, వాస్తవమైన చిత్తరువే కళ్ళయెదట కన్పిస్తోంది. ఆమె మనస్సులో ఊహించుకున్నంతా జరుగుతోందక్కడ. ఆమె తండ్రి నిజంగానే ఆయాస పడుతున్నాడు. అసలు యథార్థపరిస్థితుల్ని గీత కొంచెం తక్కువ ంచనాలోనే ఊహించుకుందని చెప్పవచ్చు! గీత తండ్రి ఇప్పుడు

మరీ మంచమెక్కాడు. అతడికి చాలా ఎక్కువగా వుంది. పొద్దున్నుంచీ కడుపులో ఏమీ పడనుకూడా పడలేదు. ఆమె తల్లి సరోజిని కాస్త వేడినూనె పట్టుకొచ్చి గుండెలుకి రాస్తోంది. అదృష్టవశాత్తు హీరేన్ ఇంటికొచ్చాడు. అతడు ప్రక్కనుండి విసన కర్రతో విసురుతున్నాడు. ఇల్లంతా నిశ్శబ్దంగావుంది. కాని అది అసహజమైన నిశ్శబ్దత. ఎవరికివారు ఏమీ మాట్లాడకుండా ముభావంగా కూచున్నారు. ఇంతలో ఏమయినా మాట్లాడ దామన్నా పీల్లేసంత పెద్దదగ్గు తెరవచ్చింది ప్రద్యోతనుడికి. బయట చీకట్లో ఎక్కడో విమానా లెరుగుతున్నాయి.

కొంతసేపటికి దగ్గు కాస్త తెరపిచ్చింది. ప్రద్యోతనుడి కోపం ఆ యెగిరే విమానాల మీదికి పోయింది. పళ్లు పటపట కొరుకుతూ "హూఁ. పడెయ్యండి; పడెయ్యండి. కాసిని బాంబులు నా నెత్తిన పడెయ్యండి. ఛస్తే బ్రతికిపోతాను. హూఁ. హూఁ." అని హైరానపడటం మొదలెట్టాడు.

"కాసిని మంచినీళ్ళివ్వనా" అని అడిగింది సరోజిని.

"మంచినీళ్లా ? ఇయ్యి"

గ్లాసునిండా వున్నాయి నీళ్లు. సరోజిని ఆ గ్లాసు తీసుకుని అతడినోటికి అందించింది. ఆబకొద్దీ ఒకగుక్క తాగి, వెంటనే ముఖం వికారంగాపెట్టి, థూ థూ అని తుపుక్కున నీళ్ళన్నీ ఉమ్మేసి, "క్లోరిన్ కంపు. కొళాయి నీళ్ళిచ్చావేం?" అని అడిగాడు ప్రద్యోతనుడు.

సరోజిని మాట్లాడకుండా ఊరుకుంది. "నువ్వు నన్నేం చంప తలచుకున్నావా ఏం?" అని అడిగాడు మళ్ళీ.

"మరి ఆ ట్యూబ్‌వెల్ నీళ్లెవరు తెస్తారు?" అన్నదీసారి సరోజిని. గీత లేదుకదా అన్న సంగతి ఆమెమాటలో ధ్వనించింది. అక్కడినుంచి రోజూ గీతే తెచ్చేది నీళ్లు.

ప్రద్యోతనుడా నీళ్లుతప్ప త్రాగడు.

అతడు తలవంచుకుని బరువుగా నిట్టూర్చి. చెయ్యి నుదుటి కేసి కొట్టుకుని 'హారి భగవంతుడా!' అంటూ ఆక్రోశించాడు.

సరోజినికళ్ళ నీళ్లొట్టుకుంది. ఆమె చెక్కిళ్ళ మీద కన్నీటి జాలు పర్పడింది. హిరేన్‌కూడా కళ్ళ నీళ్లొచ్చాయి. చేతిలో వున్న విసనకర్ర కిందపెట్టి, అతడు ముంజేత్తో కన్నీళ్లు తుడుచు కుంటున్నాడు. ప్రద్యోతనుడికి పట్టలేని కోపం వచ్చింది. "నువ్వు తీసుకురాలేవురా? రాస్తా పక్కనేగా టూబ్‌వెల్ ? నవాబుపోకిళ్లు పోక పోతే కూజాడునీళ్లు తీసుకురాలేవేం?" అంటూ ఆ విసన కర్రని తిరగేసి హిరేన్ నెత్తిని ఒక్క వేశాడు. హిరేన్ మళ్ళీ దెబ్బ పడకుండా ఒక్కగంతుతో వెనక్కి తప్పుకుని "ఉహూం. నేను తీసుకురాలేను" అని గర్జించాడు.

హిరేన్ గర్జనకి తల్లీతండ్రీ ఇద్దరూ గతుక్కుమన్నారు. "కిరసనాయిల్ కొట్టు ముందూ క్యూలో నిలబడాలి. పంచదార కొట్టు ముందూ క్యూలో నిలబడాలి. పైన డబ్బులు కూడా నేనే ఎక్కడినుంచైనా తెచ్చి ఇవ్వాలి. ఇంకా పైగా కొట్టను కూడా కొడుతున్నావా?" అంటూ మొదలెట్టాడు.

హిరేన్ ఇప్పుడు సొంతంగా సంపాయించటం నేర్చు కున్నాడు. ఓసారి యెప్పుడో ఇంట్లోగూట్లోవున్న డబ్బులు ముప్పావలాదాకా ఎత్తుకుపోయాడు. ఆ డబ్బుల్ని పెట్టుబడిగా చేసుకుని రోజూ పెందరాళే సినిమాహాల్సు దగ్గిర హాజరవుతూం టాడు. నాలుగణాలన్నర టికెట్లు ముందుకొనేసి, తర్వాత వాటిని ఎక్కువధరకి అమ్ముతూంటాడు. ప్రస్తుతం ప్రభుత్వంవారి కట్టడిప్రకారం పంచదార మనిషికింత చొప్పున కొన్ని కొట్లలోనే అమ్ముతున్నారు. ఆ కోట్లముందు జనం క్యూలో నిలబడతారు. హిరేన్‌కూడా ఆ క్యూలోకిపోయి నుంచుని కంట్రోలుధరకి పంచ దారకొని, దాన్ని ఎక్కువధరకి టీ దుకాణాల్లో అమ్ముతూ వుంటాడు శ్యాంబజారు లగాయతు కాళీఘాట్ వరకు అంతా అతడి ఇలాకాయే. టికెట్టుఖర్లేకుండా నడుస్తూన్న ట్రాముల్ని

అవలీలగా ఎక్కేస్తూ ఓ ఇరవై ట్రాముల్ని మారుతూ తిరుగుతూంటాడు. అతడికి కొంతమంది బస్సుకండక్టర్లతో సావాసం వుంది. వాళ్ళ బస్సులు కనుక తటస్థపడితే అవే ఎక్కుతూ వుంటాడు. ఫుట్‌బోర్డుమీద నిలబడి, 'లేక్' 'కాళీఘాట్' రండిబాబూ రండి అని కేక లెడుతూ కండక్టర్లకి సహాయ పడుతూంటాడు. నడిచే నడిచే బస్సుల్ని ఎక్కే నవనాగరికుల్ని జబ్బపట్టుకుని పైకి లాగుతూ సహాయపడుతూ వుంటాడు. డబుల్ డెక్ బస్సులు కనుకయితే 'పైకి వెళ్ళండి బాబూ పైకి వెళ్ళండి. పైన అంతా ఖాళీయే' అంటూ వాళ్ళని పై అంతస్తులోకి పంపుతూంటాడు.

క్రూరమైన హీరేన్ చూపుల్లో ఘాతుకత, ద్రోహబుద్ధి వ్యక్తమవుతున్నాయి. పేదరికంమూలంగా ఇంట్లో పడుతున్న పాట్లు అతడికి కిప్పుడంతగా అనుభవంలోకి రావటంలేదు. అతడేపూట తిండి తినకుండా ఉండడు. బయటే ఎక్కడో తిని వస్తూంటాడు. అతడి లాగూ చొక్కాకూడా ఎప్పుడూ మాసి ఉండవు. దొంగ వస్తువుల్ని అమ్మే కొట్లలోంచి కొన్ని పొట్టి లాగూలు, పొట్టి చొక్కాలూ సంగ్రహించుకు వచ్చాడు. ఏమయినా ఇంట్లో ఉన్నంతసేపూ—తల్లితండ్రులు పడుతున్న బాధలూ, ముఖ్యంగా గీత పడుతున్న కష్టాలూ చూస్తూంటే అతడికి బాధగానే వుండేది. మనస్సుకు మరీ కష్టం తోచినప్పుడు ఇహ ఇంట్లోంచి యెప్పుడు బయటపడదామా అని తపనపడుతూండేవాడు. అతడికి ఇంట్లో ఎవరి మీద ఏం కోపంలేదు—ఉన్న కోపమల్లా తండ్రి మీదనే. ఈ యమయాతనల కన్నిటికే, అశక్తుడూ, అప్రయోజకుడు, జబ్బువంటి వాడూ అయిన తన తండ్రే కారకుడనుకునే వాడు. ఇంట్లోంచిపోయి తిరిగి తిరిగి, మళ్ళీ ఎప్పుడో ఇంటికిరాగానే, తండ్రి అతడ్ని పట్టుకుని చావకొడుతూంటాడు. హీరేన్ పళ్ళ బిగువున ఆ దెబ్బలన్నీ ఓర్చుకుంటూనే వుంటాడు. కాని మనస్సులో మాత్రం తండ్రి చావుని కోరుకుంటూ ఉంటాడు. మొన్నటి వరకూ అతడింతకిమించి యేమీ చెయ్యలేదు. గీత ఎవరికీ తెలియకుండా

ఎక్కడికో వెళ్ళి పోయింది మొన్నరాత్రి. ఈ రెండు రోజుల్నుంచీ ఆమెకోసం ఊరంతాతిరిగి గాలించాడు. ఆమె ఇలా వెళ్ళిపోవటానికి కారణం కూడా తన యీడుకితోచే ఆలోచనలకి తగినట్టు ఊహించుకున్నాడు. గీతకోసమని ఇవాళ సందులు గొందులన్నీ కూడా గాలించి, చివరికి విసుగెత్తి ఇంటికి తిరిగివచ్చాడు. ఇందుకు గీతనీ, కానాయ్‌నీకూడా మనస్సులో మహా తిట్టుకున్నాడు. అయినా దీనికంతకీ కారణం అశక్తుడైన తండ్రేనని ఖాయపరచుకున్నాడు అవునుమరి! అతడు గీతకెందుకు పెళ్ళి చెయ్యాకపోవాలి!... ఈ స్థితిలో నెత్తి మీదపడ్డ ఆ ఒక్క దెబ్బకే అతడు చిచ్చు బుడ్డిలా బుస్సుమంటూ లేచాడు.

కొన్నిక్షణాలు గబగబా గడిచిపోయాయి. సరోజిని కొంచెం తెప్పరిల్లుకుని భయపడుతూనే 'హీరేన్ ! హీరేన్ !' అని బ్రతిమాలటం మొదలెట్టింది.

"ఊహుఁ." అని ఉరిమాడు హీరేన్.

రోగం ఎక్కువవటం. బక్కకోపం, అవమానం—ఇవన్నీ కలసిరావటంవల్ల ప్రద్యోతనుడు తాను తండ్రిననే అధికారాన్ని ఊతంగా తీసుకుని "ఇవాళ నీ నెత్తురుకళ్ళ చూస్తాను ఏమనుకున్నావో !" అంటూ ఆ విసనకర్ర పట్టుకుని పక్కమీదినుంచి లేచాడు.

"వద్దు, వద్దండీ వద్దు" అని కాళ్ళావేళ్ళా పడి బ్రతిమాలుకుంటూ సరోజిని భర్తని ఇవతలికి రానీకుండా రెండు చేతులు అడ్డం పెట్టింది.

హీరేన్‌మాత్రం తండ్రిని చీల్చబోతాడా అన్నట్టు కోర చూపులు చూస్తూ అక్కడే నుంచున్నాడు. పీసమంతైనా వెనక్కి తగ్గలేదు. అతడి వైఖరిచూస్తే ఇహ విరుచుకుపడతాడేమో అనిపిస్తోంది. ఇహ అతడిమీదికి పోవటానికి ప్రద్యోతనుడే రవంతపస్తాయించక తప్పలేదు. సరోజిని ఇంకొంచెం ముందుకు జరిగి, "మీ

కాళ్ళు పట్టుకుని వేడుకుంటాను-సర్వనాశనంతల పెట్టకండి" అంటూ భర్త కాళ్ళను చుట్టేసుకుంది.

దాంతో ప్రద్యోతనుడి కోపమంతా భార్య మీద విరుచుకు పడింది. "నువ్వా—నువ్వే అసలీ దౌర్భాగ్యాని కంతటికీ కారకు రాలివి—నువ్వే—నువ్వే" అంటూ ఆ విసనకర్రతో ఆమెనే కొట్టటం మొదలెట్టాడు.

హీరేన్ రెప్పపాటులో తండ్రిమీది కురికాడు. ఆ ఉరకటం తోనే తండ్రి క్రిందపడ్డాడు. పడగానే తండ్రి చేతిలోవున్న విసన కర్రని గుంజిలాక్కుని హీరేన్ దాంతో అతణ్ణే కొట్టబోయాడు.

"హీరేన్! హీరేన్! ఒరేయ్!" అని కేకలెడుతూ సరోజిని చటుక్కునపోయి, కొడుకుని కావిలేసుకుంది. హీరేన్ ఇటుతిరిగి ఒక్కసారి తల్లి ముఖంకేసి చూసి, కోపంగా నిట్టూర్చి, విసనకర్ర విసిరి పుచ్చుకు పారేసి "విడిచిపెట్టు నన్ను" అన్నాడు.

"ఉహుఁ. పారిపోతావు నువ్వు" అన్నది.

హీరేన్ బలవంతాన ఆమెపట్టు విడిపించుకుని, 'హ్యాఁ' అంటూ ముఖంమీద పడ్డ క్రాప్‌ను మునివేళ్ళతో వెనక్కితోసు కుంటూ బయటికి వెళ్ళిపోయాడు. ఎక్కడికి వెళ్ళటమా, ఏం చెయ్యటమా అన్న ఆలోచన అతడ్ని ఒక్క క్షణమయినా కలత పెట్టలేదు. ఆ విషయంలో అతడికి నిశ్చింత. డబ్బు సంపాయించ టంలో చాలా ఉపాయాలు తెలుసతడికి. అవికాక మరికొన్ని ఉపాయాలు వినికూడా ఉన్నాడు. చీకటిలో ఒంటిపాటుగా పోతున్నవాళ్ళని పట్టుకుని, వాళ్ళదగ్గిర ఉన్నదంతా ఊడలాక్కో వచ్చుట! లోకాన్ని మోసం చెయ్యటం చేతయితే ఎంతైనా సంపా యించవచ్చుట! సానివాడల్లో సందులు గొందులు పట్టుకు తారట్లాడే జారులకు దారులు చూపినా డబ్బిస్తారట! నిశిరాత్ర ప్పుడు నుంచున్న పళ్ళంగా సారాయి కావాలని తపంతహ లాడే వాళ్ళకి, దొంగచాటుగా అమ్మేవాళ్ళదగ్గిర నుంచి తీసుకొచ్చి సప్లయ్‌చేస్తే ఓహ్! కావలసినంత డబ్బు!...

హీరేన్ చీకట్లో కలసిపోయి, సందులు గొందులన్నీ తిరిగి తిరిగి, చివరికి ఓ రోడ్డు ప్రక్కనున్న ఖాళీజాగాకి చేరుకున్నాడు. అక్కడక్కడ స్లిట్ ట్రెంచెస్, ఎయిర్ రైడ్ షెల్టర్స్ కట్టివున్నాయి. అతడు మెదలకుండా ఓ షెల్టర్లోకిపోయి దూరాడు. లోపలంతా ఇరుకూ, చీకటిమయం. అడుగులో అడుగువ్వేసుకుంటూ మెల్లిగా లోపలికి వెళ్లాడు. లోపలినుంచేదో కంపు కొడుతోంది. క్రిందంతా చిత్తడిగా వుంది. ఆమూల ఏదో మెరుస్తోంది. బుసకొడు తున్నట్లు ఏదో ధ్వనికూడా విన్పిస్తోంది. హీరేన్ ఒక్కనిమిషం గాభరా పడ్డాడు. మరునిమిషంలోనే 'ఆసి దీందుం పతెగా! ఇంతాచేసి చీంబోతేనే!' అనుకున్నాడు. బయట చలి జాస్తిగా ఉండటం మూలంగా నేమో అదికూడా వచ్చి లోపల దూరింది. జేబులోని అగ్గిపెట్టితీసి వెలిగించి, చూసి, తన అనుమానం యథార్థమేనని తెలుసుకున్నాడు. ఆ అగ్గిపుల్ల వెలుతురులో అటూ ఇటూ పరిశీలనగా చూసుకుని, ఆ చీంబోతు చీకట్లో లసనివచ్చి కుమ్మకుండా—ఓ ప్రక్కగా పొడిగా ఉన్న జాగాలోకు పోయి చేరగిల పడ్డాడు.

పైన విమానాలు తిరుగుతున్నాయి. "వాటి దుంపతెగిరి! బాంబులుపడి ప్రపంచమంతా పాడుపడిపోనీ—చూద్దాం" అని విసుక్కుంటూ హీరేన్ ఓ బీడీ ముట్టించాడు. తండ్రిమొదలాగానే అతడికి ప్రపంచమంతటి మీద కోపం వచ్చింది. ప్రస్తుతం అతడి జీవితంలో ఆశలకీ ఆశయాలకీ, శుభానికీ, శాంతికీ ఉన్న అడ్డంకు లన్నీ నుగ్గునుగ్గయి పోయాయి. అతడిహా నిరభ్యంతరంగా తన కోరికలన్నీ తీర్చుకోగలడు: అతడికీవాంఛ ఇవాళ క్రొత్తగా కలిగిందికాదు. ఏ భూకంపమైనా వచ్చి ఈ భూప్రపంచమంతా బుగ్గి అయిపోతే బావుండుననీ, లేదా ఏ మహామారిలాంటి జాడ్యమయి నావచ్చి జనంయావత్తూ నశిస్తే బావుండునని అతడు చాలాకాలం నుంచి కోరుకుంటున్నాడు. ఒకొక్కప్పు డతడికి ఇంతకంటె విచిత్ర

మైన ఊహాలుకూడా పుట్టుకొస్తూ ఉంటాయి. తనలో ఏదో అద్భుత మైన అలౌకికశక్తి వుండి, తుపాకి గుండ్లయినా తనగుండెకి తగిలే సరికి పూలచెండ్లులా అయి పోవాలని, తాను చావు అని శపిస్తే చచ్చిపోయి, మళ్ళీ 'లే' అని స్పృశిస్తే ఆ చచ్చినవాడు బ్రతకాలని— ఇలా ఎన్నెన్నో అసంగతమైన ఊహాలు కలుగుతూంటాయి. ఇవాళ నెత్తిమీద విమానాలధ్వని జోరు అయేసరికి మళ్ళీ ఆ అసందర్భపు ఊహాలే కలగ సాగాయి.

# ౧౨

కానాయ్ కి నిద్రమెళుకువ వచ్చేసరికి చాలా ప్రొద్దెక్కింది. అప్పటికైనా విజయదా వచ్చి నిద్రలేపటం మూలంగా లేచాడు. క్రితం రాత్రిలాగానే వాళ్ళు ఈ రాత్రికూడా బయట వరాండాలోనే పక్కలేసుకున్నారు. గీత మాత్రం గదిలో పడుకుంది.

విజయదా పిలుపులతో నిద్రలేచి, "ఉష్! చాలా ప్రొద్దెక్కిందే!" అంటూ కళ్లు నులుముకుంటూ కూచున్నాడు కానాయ్.

విజయదాకి సహజంగా నవ్వుతూ మాట్లాటం అలవాటు. అతడికది 'మానరిజం' అన్నా అనొచ్చు. సంతోష మొచ్చినప్పుడు నవ్వటమనేది ఎవరికయినా సహజం. కాని విజయదా మాత్రం దుఃఖ మొచ్చినప్పుడు, కోపం వచ్చినప్పుడూకూడా నవ్వుతూనే మాట్లాడతాడు. అయితే ఇహ ఏడుపువచ్చినా కూడా నవ్వుతాడా అంటే—అది ఎవరికీ తెలియదు. అసలింతవరకెప్పుడూ అతడికి ఏడుపు రాగా ఎవరూ చూడలేదు. "నువ్వొక "స్లీపింగ్ గౌనూ ఒజత బెడ్‌రూం స్లిప్పర్సుకూడా కొనుక్కో భాయీ! అప్పుడైతే ఎనిమిదిన్నరకి నిద్రలేచినా నువ్వేం సిగ్గుపడాల్సిన పనిలేదు—పైప్ కాల్చటంకూడా అలవాటు చేసుకున్నావంటే—అప్పుడిహ పదింటికి నిద్ర లేచినా వచ్చేప్రమాదం ఏమీ వుండదు. క్రింది తరగతిలోంచి ఒకసారి పై తరగతిలోకి అమాంతం గంతేస్తావు. అచ్చమైన ఒకటో రకం పెటీబూర్జువావి" అన్నాడు విజయదా నవ్వుతూ.

తాను వ్యాపారంలోకిదిగిన సంగతి కానాయ్ నిన్న రాత్రే విజయదాకి చెప్పేశాడు.

"సరే రేపు చూద్దాంగా—నువ్వు పెందరాళే లేస్తావో—నేను పెందరాళే లేస్తానో!" అన్నాడు కానాయ్ అప్రియత్నంగా.

"పందెం వెయ్యకు—ఓడిపోతావ్"

"సరే నువ్విలా అంటున్నావు కనుక నిజంగా పందెమే"

"ఇదుగో చూడు—ఆయుర్వేద వైద్యులంటూ వుంటారు. ఏ రోగానికైనా సాధారణంగా రెండురకాల లక్షణాలుంటాయిట! బాధకలిగించే లక్షణాలొకరకం. అవి మామూలుగా వైద్యులకయినా తెలిసేవే. మరోరకం లక్షణాలుంటాయి. అవి పైకి కన్పించవు. వాటిని మామూలుగా తెలుసుకోటంకూడా కష్టమే. అగ్నిమాంద్యమే ఉందనుకో—కడుపులో నొప్పి, ఆహారం జీర్ణంకాకపోవటం, పులిత్రేనుపులురావటం—ఇవన్నీ పైకితెలిసే లక్షణాలు. పుల్లని వస్తువులు తినాలనిపించటం. బొప్పాయి పండ్లన్నా ఆకుకూరలన్నా అసహ్యం ఏర్పడటం—ఇలాంటివి పైకి తెలియని లక్షణాలు. అలాగే డబ్బుజాడ్యం పట్టుకున్నవాడికి, బట్టతల కావటం, ఒళ్ళు నునుపెక్కటం—లాంటివి పైకి కన్పించే వ్యాధిలక్షణాలు. ఎప్పుడూ డబ్బునుగురించే ఆలోచనలు పెట్టుకోవటం. పనివున్నా లేకపోయినా ఇనప్పెట్టె తీసుకుని డబ్బు చూసుకుంటూ వుండటం యితరులకి తెలియని లక్షణాలు. సంతోషంగావున్నా అలాగే చేస్తాడు. ఇబ్బందుల్లో వున్నప్పుడు యిహ వేరే చెప్పనక్కర్లేదనుకో...అలాగే బూర్జువాకి డాంబికం, ప్రతి దానికి తానే కర్తృత్వం వహించాలని ప్రాకులాడటం లాంటివి పైకితెలిసే లక్షణాలు, ఇహ పైకి తెలియని లక్షణాలు—ఆలస్యంగా నిద్రలేవటం, పెద్దపెద్ద కబుర్లుచెప్పటం, పైప్—స్లీపింగ్ గౌను లాంటివి. లక్షరూపాయలు విలువైన నిద్ర అని మాటవరుసగా అంటారు కాని, నీ 'అరవై రెండున్నర విలువంత నిద్ర' అయినా అంతకన్న తక్కువదేంకాదు."

కానారామ్ రెప్పవాల్చకుండా విజయదా ముఖంకేసి అలాగే చూస్తూ వూరుకున్నాడు.

"ఏం? కోపంవచ్చిందా యేం!" అని అడిగాడు విజయదా.

"ఉహూఁ. కాని నువ్వనేదేమిటి? ఈ పని నన్ను చెయ్యొద్దంటావా?"

"వెళ్లు. ముందు మొహంకడుక్కునిరా గీత టీ తీసుకొస్తోంది."

కానాయ్ వెనక్కి తిరిగిచూశాడు. గీత టీ తీసుకొస్తోంది. ఆమె రెండుచేతుల్లో పొగలు వస్తున్న రెండు టీ కప్పులున్నాయి.

"గీతకి యివాళ పని ఒప్పగించాను. ఎంత బుద్ధిమంతురాలో, ఎంత నిమ్మదళస్తురాలో చూశావా?" అన్నాడు విజయదా.

కానాయ్ సౌహార్ద్రంగా నవ్వాడు. చలికాలమయినా గీత ప్రొద్దున్నే అప్పుడే స్నానం చేసేసింది. నిన్నరాత్రి తాను కొనుక్కువచ్చిన డోర్యాల చీరె కట్టుకుంది. ఆమె వచ్చి టీ కప్పులు రెండూ అక్కడ పెట్టింది.

"మొహం కడుక్కుని వస్తాను" అంటూ కానాయ్ ఆదరాబాదరా లేచి వెళ్లాడు.

కానాయ్ మొహం కడుక్కుని వచ్చేసరికి నేపీ హాజరయినాడు. ఓ టీ కప్పు అతడి చేతిలో ఉంది. నేపీముఖం ఎంచేతనో కందిపోయింది. ఏదో వైపరీత్యం జరిగిఉంటుంది. అతడికేదో పరమదుఃఖమో, పరమానందమో కలిగిఉంటుంది! సాధారణంగా ముభావంగా కూచునుండే నేపీ ఇవాళేమిటో మహా మాట్లాడేస్తున్నాడు. విజయదా మెదలకుండా వింటూ కూచున్నాడు. గీత ప్రక్కగదిలోంచి మళ్ళీ వచ్చింది. ఆమె చేతిలో మరో టీ కప్పు ఉంది. అది ఆమె కానాయ్‌చేతి కందించింది.

నేపీ తన అనుభవాల్ని వర్ణిస్తున్నాడు. అతడు రిలీఫ్ క్యాంపులకి స్వయంగా వెళ్ళి చూసివచ్చాడు. తుపానులో సర్వస్వమూ పోగొట్టుకున్న ఓ గౌరవకుటుంబం భవిష్యత్తులో బిచ్చమెత్తుకోవాల్సి వచ్చినందున, ఆ అవమానానికి పాల్పడటం ఇష్టంలేక ఆత్మహత్య చేసుకుందిట! భార్యా, భర్త, పెళ్ళి యిడొచ్చిన కూతురు ముగ్గురూ మెడకి బిందెలు కట్టుకుని చెర్లోదూకి చచ్చిపోయారట!

విజయదా పెదవులమీద ఓ విలక్షణమైన నవ్వు కన్పించింది. నిశ్శబ్దంగా సిగరెట్ కాల్చుకుంటూ కూచున్నాడు. గీత కళ్లు యింతింతచేసుకుని వింటోంది.

"కొంతమంది గృహస్థులు పిల్లల్ని—ముఖ్యంగా పసిపిల్లల్ని—కూడా అమ్మకుంటున్నారని విన్నాను విజయదా!" అన్నాడు నేపీ.

కానాయ్‌కి ఒళ్లుగగరిపొడిచింది.

"గీతా! కానాయ్ ఆఫీసుకి వెళ్లాలి. నువ్వెళ్లి పప్లీని తొందరచెయ్యి. లేకపోతే వాడు భోజనానికి పన్నెండయేట్లు చేస్తాడు" అన్నాడు విజయదా.

గీత వెళ్లిపోయింది.

"ఆ ప్రాంతాలకింకా సహాయం పంపాలి విజయదా" అన్నాడు నేపీ.

విజయదా నవ్వాడు.

"విజయదా!" అని మళ్ళీ పిలిచాడు నేపీ.

"అలాగే" అన్నాడు విజయదా.

నేపీ ఆ ఒక్కమాటతో సంతృప్తిపడి వెళ్ళిపోయాడు. కానాయ్‌తో ఏమీ మాట్లాడలేదు. వెళ్లేటప్పుడు అతడికేసి తిరిగి మర్యాద సూచకంగా ఓ చిరునవ్వుమాత్రం నవ్వాడు. అది నేపీ స్వభావం!

"విజయదా!"

విజయదా నవ్వుతూ కానాయ్‌కేసి చూశాడు.

"ఏమంటావ్ నువ్వు? వ్యాపారం చెయ్యటం మంచిదికాదంటావా?

"నీకేం పిచ్చాయేం? నేను ఊరికే ఎగతాళికలా అన్నాను. డబ్బుతోటి అవసరం యెంతైనావుందిభాయీ! ప్రపంచమంతా దేనికోసం పరుగెడుతోందో, దాంతోపాటు నువ్వుకూడా అక్కడకు పరుగెత్తకపోతే అందులో నీకు రావలసిన భాగమేదో పోతుంది.

చివరికి నువ్వే నష్టపడాల్సి వస్తుందం తే! అందాకా యెందుకు నా సంగతి చూడరాదూ— నాకు వచ్చేజీతం నూటయాభై రూపాయలు, ప్రెస్ కంపోజిటర్ కివచ్చే జీతం ముప్పై రూపాయలు,ప్యూన్‌కి వచ్చేజీతం పదిహేనురూపాయలే! అక్కడ నేనూ ఒక నూలుపోగునే నిన్ను అలా.ఊరికే యెగతాళికి అన్నాను'' కానాయ్ మెదలకుండా వూరుకున్నాడు.

''డబ్బు చాలా అవసరం భాయీ! ముందు ముఖ్యంగా నేనో ఉలెన్ రగ్గు కొనుక్కోవాలి'' అన్నాడు విజయదా.

కానాయ్ ఆ మాటకి కొంచెం నవ్వాడు.

''అదీకాక గీత భవిష్యత్తుసంగతి ఒకటుంది. ఆమెకేదో యేర్పాటు చెయ్యాల'' అన్నాడు విజయదా మళ్ళీ.

అవును, నిజమే. గీతకేదో ఓ యేర్పాటు తానే చూడాలి. కాని అంత అణకువ, అంత శాంతం— సంస్కార ప్రభావంవల్ల— జీవితంలో యేమార్గాన్నయినా ఒంటరిగా సంచరించటానికి ధైర్యం చాలక—కుంటిదానిలా అయిపోయిన ఆమెకి తాను ఏం యేర్పాటు చూడగలడు! రాత్రంతా అతడీ సంగతినిగురించే ఆలోచించాడు. తెల్లవార్లూ ఇంచుమించు నిద్రేపట్టలేదు. తెల్లవారకట్ల ఓ కునుకు వచ్చింది. అంచేతనే ఇవాళ నిద్రలేచే సరికి ఆలస్యమయింది.! ''రాత్రంతా ఈ విషయాన్ని గురించే ఆలోచించాను విజయదా. నిద్రకూడా పట్టలేదు. ఆమెని ఏంచేద్దామంటావ్ చెప్పు? ఆమె ఏం చెయ్యగలదో నాకేం తోచకుండా ఉంది'' అన్నాడు కానాయ్.

విజయదా తాపీగా చిరునవ్వు నవ్వుతూ—''ఆమె కన్నివిధాలా శ్రేయోదాయకమైన పద్ధతేదో, అది నీకు మొదట్లోనే చెప్పానుకానూ! కాని దాన్ని నువ్వే కాదంటున్నావ్!'' అన్నాడు.

విజయదా చెప్పిన పద్ధతేదో,కానాయ్‌కి గుర్తుకొచ్చింది. గీతని తనని పెళ్ళిచేసుకోమని చెప్పాడప్పుడు. అది గుర్తుకురావటంతోపాటు నీల విషయంకూడా గుర్తుంకొచ్చింది. ఇవాళ

శుక్రవారం. రేపు శనివారం ఆఫీసు అయిపోగానే తాను నీలని కలుసుకోవాలి. అప్పటిలో కొంచెం తొందరపాటు కన్పించింది.

"ఆ సంగతి ఇంకోసారి ఆలోచించుకానూ!"

"ఉహూఁ. అది వీలుకాదు విజయదా!"

విజయదా ఇంకేమీ మాట్లాడలేదు.

గీత వచ్చి "వంటయింది, వచ్చి స్నానం చెయ్యి కానూదా!" అని చెప్పింది.

అమలబాబు కానాయ్‌ని చూసి, "ఓహ్! చాలా బాగున్నారివాళ" అన్నాడు.

కానాయ్ నిన్నసాయంత్రం కొనుక్కున్న కొత్త చొక్కా, కొత్త పంచె కట్టుకుని వచ్చాడివాళ. అమలబాబు అన్న మాటకి అతడికి కొంచెం నవ్వొచ్చింది.

"కాని ఇవి మీకు ఆఫీసుకి అనువైన దుస్తులుకావు. సూట్ వేసుకోవాలి"

"అవసరమైతే యెందుకు వేసుకోను?"

"అవసరమెంతైనా ఉంటుంది. నిజానికివాళే అలాంటి అవసరం ఉంది. ఇప్పుడు మిమ్మల్ని కొన్నిచోట్లకి పంపుతున్నాను."

కానాయ్‌కి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. అమలబాబు ఆదేశించిన పనులు చేసుకురావటానికి అమితానందంతో బయలుదేరి వెళ్ళాడు. మళ్ళీ నవ్వుమొహంతో, నాలిగింటికల్లా తిరిగివచ్చాడు. వెళ్ళినపని సక్రమంగానే నిర్వర్తించుకు వచ్చాడు. అతడు వచ్చేసరికి అమలబాబు టేబిల్ ముందు జితూబోస్ కూడా ముఖం గంభీరంగా పెట్టి కూచుని ఉన్నాడు. కానాయ్ నవ్వుతూ అతడికి నమస్కారం చేశాడు. బోస్ ప్రతినమస్కారం చేశాడు.

అమలబాబు కానాయ్‌ని "వెళ్ళినపని అయినట్లేనా?" అని అడిగాడు.

కానాయ్ అంతా విశదీకరించి చెప్పాడు. అమలబాబుకి అపరిమితానందం కలిగింది. "ఇహనిప్పుడు మీపనే ఉంది. నాన్న రు చెప్పినప్రకారం మీచేత బియ్యంవర్తకం ప్రారంభింపచేస్తాను. చోండి మీరు." అని అమలబాబు తన పని ముగించుకున్నాడు. అంతలో అతడి ముఖకవళిక మారిపోయింది. ఓ సిగరెట్ ముట్టిం కుని, బేరర్‌ని పిలిచి, గుఁయీబాబుని పిలుచుకురమ్మని పం డు.

తర్వాత జితూబోస్‌కేసి తిరిగి నవ్వుతూ "ఇవాళ నిన్నో చోటుకి తీసికెడతాను జితూదా!" అన్నాడు.

జితూదా కొంచెం కంగారుగా "అరె అంత కన్నానా? అది అదృష్టం" అన్నాడు.

"కాని ఇవాళ ఇహ ఇంటికి వెళ్ళటానికి వీలుండదు. ఇక్కడే లి"

"ఇల్లా! నాకు ఇల్లేమిటి? నే నెక్కడుంటే అదే నా యిల్లు"
"దానికేంగాని ఇహనైనా పెళ్ళి చేసుకుందూ"
"పెళ్ళా? చంపేశారు"
"ఏం?"

"ఏమా! చెబుతా వినండి. ఉర్దూలో ఓ సూక్తి ఉంది తెలుసా? ని విలాస మేమిటి? అని అడిగాట్ట! 'ఉదయ మెక్కడో, న్న మెక్కడో, సాయంత్ర మెక్కడో, రాత్రియెక్కడో ూ ఉంటుంది నాకు. బ్రతికిఉన్నన్నాళ్లూ హోటల్లోనే చచ్చేవేళకి ఆస్పత్రికి చేరుకుంటాను" అని సమాధానం మనకి ఇల్లూ-ఇల్లాలూ నిషిద్ధం భాయీ!"

అమలబాబు నవ్వటం మొదలెట్టాడు. కానాయ్ ముఖంలో న నవ్వు కన్పించిది. 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' అన్న క్తి వినటాని కింపుఅయినదేకాదు-అర్థవంత మైందికూడా.

జరీఅంచు ధోవతి, ప్రక్కగుండీల లాల్చీ, సైన ఓ సిల్కు శాలువా ధరించిన ప్రౌఢ వయస్కుడొచ్చి చేతులుకట్టుకుని నిల బడ్డాడు. "వీరు మిస్టర్ చక్రవర్తి, మా క్రొత్త ఏజెంటు, వీరిని రేపటినుంచి నీవెంట బజారుకి తీసుకెడుతూఉండాలి. వర్తకంలో లోతు పాతులు, గుట్టుమట్లూ అన్నీ వీరికి స్పష్టంగా చెప్పాలి, తెలి సిందా ?" అన్నాడు అమలబాబు ఆ వచ్చిన వ్యక్తితో.

"చిత్తం" అంటూ గుయీబాబు సవినయంగా కానాయ్‌కి నమస్కారంచేశాడు. కానాయ్‌కూడా మర్యాదగా అతడికి ప్ర సమస్కారంచేశాడు. అమలబాబు చటుక్కున కాయితమ్ముక్క మీదేదో రాసి కానాయ్‌చేతికి అందించాడు. అందులో Retu his salute by nod only అని రాసిఉంది.

"నాబిజనెస్ కూడా వారే చూస్తూఉంటారు. నా పార్ట కాబోతున్నారు' తెలుసా?" అన్నాడు అమలబాబు మళ్లీ.

"చిత్తం. నేను వారికి అన్ని విషయాలూ చూపుత బోధిస్తాను. వారు తెలుసుకో గలిగితే—"

"ఆయన యమ్. యస్‌సి. ఏమనుకున్నావో!" అని బాబు నవ్వాడు - "అదీకాక శ్యాంబజారులో సుఖమయచక్ర గారని ఓ పెద్ద భాగ్యవంతులుండేవారు, వారిపేరు వినలా?" అడిగాడు.

"అరె వారిపేరు వినకపోవటమేమిటి? వారి అశ్వ గుర్రపుబగ్గీ చిత్పూర్ రోడ్డు వెంట బయలు దేరిందంటే ఓహ్ ! ఎంత కోలాహలం బయలుదేరే దని ! జానెడు బో పూలదండ కొన్నా ఆయన రూపాయి తీసి యిచ్చేవాడట డబ్బు అనేది ఆయన చేత్తో తాకియెరగ డనుకోండి!"

"వారి మునిమనుమలు వీరు"

"అరె! అలాగా!" అంటూ గుయీబాబు కానాయ్ పా ధూళి శిరస్సున ధరించటానికి కొంచెంముందుకు రాబోయాడు.

"అహఁ ఎందుకు! వద్దులే, ఆగు" అన్నాడు కానాయ్.

అమలబాబు మొదట్లో కొంచెం విస్మితుడైనాడు. కాని అంతలో మళ్ళీ నవ్వుతూ కానాయ్‌ముఖంకేసి చూసి, గుఁయీబాబు స్తోత్రపాఠం అతడికి రుచించలేదని గ్రహించాడు.

గుఁయీబాబు తెల్లబోతూ, "ఛిఛీ, అదేమిటి నేనేం అపరాధంచేశానని!–" అన్నాడు.

అమలబాబు చటుక్కున ఏదో పనికల్పించి, ఆ ప్రసక్తినంతా అత్యాశ్చర్యకరంగా ఒక్కక్షణంలో మారిపోయేట్లు చేశాడు. నూరు మణుగుల బియ్యం అమ్మినట్లు ఓ రసీదు రాయించి తీసురా—స్టాంప్ వేసిన రసీదు ఆ రసీదు తీసుకెడితే మా రెండో నెంబరు గోడౌన్‌నుంచి సరుకు డెలివరీ ఇస్తారు. ఆ సరుకు మేము రాయ్‌బాబుకి అమ్మేశామన్నమాట!" అన్నాడు అమలబాబు.

గుఁయీబాబు తెల్లబోతూ "నూరు మణుగులా?" అంటే ఖై బస్తాలు—?" అని అడిగాడు.

అమలబాబు నవ్వుతూ "ఆఁ. అవును. కానాయ్‌బాబు గారు స్పెషల్ పర్మిషన్ ఇచ్చారు" అన్నాడు.

గుఁయీబాబు అక్కడికీ "మళ్ళీ చిల్లర మల్లరయితే మా క్కు సార్! ఓసారే ఏకంగా ఓ వెయ్యి బస్తాలయినా ఇప్పిస్తే టుందేమో!" అన్నాడు.

"అదంతా కాదులే కాని ముందు వంద మణుగులకీ రసీదు రా"

సీదు వచ్చాక అమలబాబు కానాయ్‌తో, "రండి, బియ్యం ం. గుఁయీఁ బయల్దేరు" అన్నాడు. అమలబాబుతో అతడి కారులోనే కానాయ్, జితూ, గుఁయీ అంతా దేరివెళ్ళారు. ఆశ్చర్యమేమంటే ఆ బియ్యాన్ని ఓగంటలో గుకి రెండున్నర ఎక్కువచేసి గుఁయీ బజార్లో ఓ కొట్లో మ్మేశాడు. అప్పుడే అమ్మిన డబ్బంతా అణాపైసలతోసహా

నగదు తెచ్చి కానాయ్‌చేతికిచ్చాడు. అమలబాబు నవ్వుతూ "మీకు మణుగుకి రెండున్నర చొప్పున లాభం వచ్చింది. నూరు మణుగులకీ వచ్చిన లాభం రెండువందలయాభై రూపాయలూ మీరు తీసుకుని, మిగిలినది సరుకుకొన్న ఖరీదుకింద నాకిచెయ్యండి" అని తర్వాత మెల్లిగా "మీ లాభంలో మణుగుకి పావలచొప్పు గుఁయీకి పాతికరూపాయలూ కమీషన్‌కింద ఇవ్వండి ఎదుటమాత్రం ఇవ్వవద్దు. అతణ్ణి చాటుకు పిలిచి యివ్వండి అన్నాడు.

కానాయ్ గుఁయీకి పాతికరూపాయలూ యిచ్చార గుఁయీ అతడి పాదధూళి నెత్తిన రాచుకుని, రహస్యంగా "న మణుగులేమి టండీ? ఏకంగా ఓ అయిదువంల మణుగులై తీసుకోండిసార్! వారిచ్చే క్రెడిట్‌కి ఓ వారంరోజులు గడువుం మనండి. అప్పుడు చూడండిహ—ఎంత వ్యాపారంచేయిస్తా అన్నాడు.

కానాయ్ చిరునవ్వు నవ్వాడు. అది ప్రయత్నపూర తెచ్చుకున్న కృత్రిమమైన నవ్వు. నిన్న, యివాళ ఈ వ్ ధోరణంతా చూస్తూంటే తన సహజ జీవితమంతా మరుగ పోయినట్టుంది అతడికి. తలకాయలేని అమలబాబు అత కేదో అత్యద్భుతవ్యక్తిలాగా కనిపిస్తున్నాడు. సాధార లాటరీలో అదంతా ప్రక్కనున్నవాడి నుడిలేవోయ్ అన్న విషయంలోకూడా యిదంతా అలాంటిదే. అంతకన్న వి లేదు. విజయదా ఘాటుగా గేలిచేస్తూ మాట్లాడినమా డికి గుర్తుకొచ్చాయి

"మిస్టర్ చక్రవర్తీ! రండి, మిమ్మల్ని మీ య దింపే వెడతాను నేను" అని అమలబాబు కారులో కూ చాడు.

కానాయ్ సవినయంగా "వద్దులెండి. మీరు వెళ్ళండి. ట్రాములోనో, బస్సులోనో వెడతాను" అన్నాడు.

"ఎందుకు? నాకు అటువైపున పనుంది. అటే వెడుతున్నాను" అంటూ అతను కారు కానాయ్ ఇంటివైపుకి వెళ్లే వీధికేసి త్రిప్పి ఆపాడు.

"నేనిప్పుడు ఆయింటికి వెళ్ళను" అన్నాడు కానాయ్.

"మరెక్కడికి వెడతారు?"

కానాయ్ విజయదా విలాసం చెప్పాడు. "అచ్ఛా! అయితే అక్కడే దింపి వెడతాను" అన్నాడు అమలబాబు.

కారు బయలుదేరింది. "ఇప్పుడు పెట్రోలు దొరకటం పెద్ద ...క్కు అయింది. బ్లాక్ మార్కెట్లోనైనా కావలసినంత దొరటంలేదు. లేకపోతే ఏజెంట్ హోదాలో కంపెనీ తరఫున మీకో ...కండ్ హాండ్ కారయినా కొని ఇచ్చేవాణ్ణి" అన్నాడు అమల...ు.

"ఇక్కడే, ఇక్కడే. ఈ యెడంవైపున ఆపండి. ఈసందు...కే వెళ్ళాలి?"

అమలబాబు అతి సునాయాసంగా కారును త్రిప్పి సందులోకి ...చ్చాడు. కానాయ్ కారుదిగి తటపటాయిస్తూ నుంచున్నాడు. ...బాబుకి సమానస్థాయాలో ధన్యవాదాలని చెప్పేసి వెళ్ళి...సాహసం అతడిలో యిగుర్చుకుపోయింది. అమలబాబే ...ంచి ముఖం బైటికిపెట్టి నవ్వుతూ" రేపు సరిగ్గా పదింటికి ... అన్నాడు.

అతడితోపాటు జీతూబోస్ కూడా ముఖం బయటికిపెట్టి, ...య్‌కి ఓమిలిటరీ సాల్యూట్ కొట్టాడు.

సరిగ్గా అదేసమయానికి విజయదా ఇంటి తలుపులు విడి...యి. కానాయ్ కారుదిగటం గీత మేడమీదనుంచి చూసిందల్లే ...వుంది.తలుపు తెరచి ప్రక్కనే నుంచునివున్నగీత ముఖం హఠాత్తుగా

వివర్ణమైపోయింది. ఆమె నిలువునిలువునా కంపించి పోతోంది. ఇంకో క్షణం ఆటా గేవుంటే క్రింద పడిపోయేట్లుంది. కానాయ్ చప్పునముందుకువచ్చి, ఆమెను పడిపోకుండా పట్టుకుని, 'గీతా! గీతా' అనిపలకరించాడు.

గీత కళ్లు రెండూ పెద్దవిచేసుకుని కారుకేసి చూస్తూ ఉండి పోయింది. కానాయ్ వెనక వైపుకి చూడటంలేదు, గీతకేసే చూస్తున్నాడు.

అమలబాబు కళ్ళలోనూ అపరిత మైన ఆశ్చర్యం వ్యక్తమవు తోంది. "ఈ అమ్మాయి ఎవరు మిస్టర్ చక్రవర్తి?" అని అడిగాడు.

"నాచెల్లెలు" అన్నాడు కానాయ్.

రెప్పపాటులో కారు హారన్ బోయ్‌న మ్రోగింది. కనీ మలి పేసరికల్లా అమలబాబు కారు రయ్‌న ఆ సందులోంచే వెళ్ళిపోయింది.

"ఆయనెవరు? ఆయనెవరు కానూదా?" అని అడిగింది

"ఆయనే అమలబాబు. నేను వ్యాపారంలో పైకి అవుతున్నది వారిదగ్గిరే. నువ్వు యెరుగుదువా ఆయన్ని?" అడిగాడు కానాయ్.

గీత వెలవెలబోతూ "ఆరోజున ఘటక్ యింట్లో...ఆయ ఆయనే....ఆయనే కానూదా!" అన్నది.

ఆమె ఆమాట అనగానే కానాయ్‌కి ఒళ్లు ఝల్లుమంది. మనస్సులో రేగిన తుపానుకి, కలిగిన ఘూకంపానికి డల్ స్క్వేర్‌లోని విశాలమైన భవంతులన్నీ ఊగిసలాడుతూ పేక కూలిపోతున్నట్లు కన్పిస్తున్నాయి. అమలబాబు! అమలబాబు యింత మహాతాపం గడ్డకట్టుకుని వుందా! కానాయ్ బుర్ర కెక్కింది. క్షణంలో తన పూర్వవంశీయుల చరిత్రలన్నీ గుర్తు చ్చాయి. ఎవరివంశ చరిత్రచూసినా ఒక్కటే...కొన్నాళ్లు

# ౧౩

విజయదా రోజూ నియమంగా ఒకేవేళ కింటికిరాడు. రాత్రి
, పదయినా అయితేనే కాని అసలతడి కింటికి వెళ్ళాలనే ఆలోచనే
రాదు. అలాంటి వాడివాళ ఇంకా ఎనిమిదైనాకాక మును
ఇంటికొచ్చేశాడు. అతడొచ్చేటప్పటికి కానాయ్ ఇంకా స్తబ్ధు
అలాగే కూచునివున్నాడు. అవతల గదిలో గీత ముఖాన్ని రెం
చేతుల్తో కప్పుకుని బోర్లగాపడుకునివుంది .... తలవనితలంపు
కానాయ్‌వెంట అమలబాబు రావడం చూసేసరికి ఆమె ఒళ్లుఝ
మంది. దానికితోడు ఇంటికివచ్చినప్పట్నుంచీ కానాయ్ గడ్డక
పోయినట్లు ఇలా కూర్చోటం చూస్తూన్నకొద్దీ ఆమె భయ
ముడుచుకుపోయింది. అతడ్ని ఏమడగటానికీ సాహసంకలగ
ఇహ నేం చెయ్యటానికీ చేతకాక, పైకి వినిపించకూడా లోపల
కుమిలికుమిలి ఏడుస్తూ అవతల గదిలోకిపోయి పడుకుం
శక్యంకాని ఉద్వేగంలో ఆమె గొంతు పట్టుకుపోయింది.
గాన్ని దిగమింగలేకుండానూ వుంది. బిగ్గరగాఏడ్చి పైకి
లేకుండానూ వుంది. ఇహముందు జరగవలసిందేమిటి? !
కానూదాతో ఏమని చెప్పివుంటాడు! నాఅంతట నేనే అతడి
వచ్చి ప్రాథేయపడ్డానని అపవాదు వేశాడేమో! ఆ సంగతి ని
ఘటకీకూడా సాక్ష్యం చెప్పిందేమో! ఆమె గుర్తుకొచ్చేస
గజగజలాడిపోయింది...ఆ భయంకర దృశ్యం కళ్ళ
కన్పించసాగింది. తానప్పుడు నిస్సహాయ స్థితిలో ప
ఏంచెయ్యలేక ఎక్కెక్కి ఏడుస్తోంది. ఘటకీ ఎన్ని తియ్యనిమా
నూరిపోసినా, ఎన్నివిధాల ప్రలోభపెట్టినా తన ఏడుపు కట్టుపె
లేదు, 'పిచ్చి పిచ్చి వేషాలెయ్యకు పిల్లా! ఇట్లాంటి పగలన్నీ నేను
చాలాచూశా. నోరు మూసుకుని పడివుండు' లేకపోతే ఈ

ూనవుల్ని వంచించి కూడబెట్టే సంపదంతా భయంకరమైన వ్యాధి ాంటిదే. ఆ వ్యాధి లక్షణాలు ప్రస్తుతం అమలబాబులో ్పష్టంగా కన్పిస్తున్నాయి. రేపు వారి వంశంకూడా తమ వంశం ాగా—అంటే చక్రవర్తుల వశం లాగానే తయారవుతుంది. అతడు టూరుగా లేచి నుంచున్నాడు; చెయ్యిచొక్కా జేబులోకిపోయింది. ేబులోవున్న రెండువందల పాతికరూపాయల నోట్లకట్టా—అప్పటి ప్పుడు ప్రేలటానికి సిద్ధంగావున్న బాంబులాగా అతడి చేతికి తగి ది. వెంటనే లోపలి గుమ్మంలోనుంచి బయటికివచ్చి ఆ నోట్లను ెడు చేతుల్లో వుండలాగా నలిపి నలిపి, యెదురుగా రోడ్డుమీద ి డస్ట్‌బిన్‌లోకి విసిరిపారేశాడు.

ట్టు మొహాన్ని వరుడు తనకి నచ్చలేదన్నాడని—
దొంగపడుపు లేడుస్తోందో చూశారా యిది! అని నలుగుర్నీ
పుతాను, జాగ్రత్త!' అని భయపెట్టింది.అప్పుడామె మొహం
కారంగా ఉండాలో అంతవికారంగావుంది. ఆతనాబీలాంటి
అసాధ్యమైనపని అంటూ యేదీ ఉండదనిపించింది!

హా ఇంట్లోవున్న మూడోమనిషి షష్ఠీచరణుడే.అతడిది ప్రతి
ోనూ అంటిపట్టని స్వభావం. అయినా ఒక్కసారిమాత్రం
దగ్గిరకొచ్చి "టీ తీసుకురానా?" అని అడిగాడు.

నాయ్ ఏం మాట్లాడకుండా ఉహూఁ అన్నట్లు తలమాత్రం
ు.

ష్ఠి ఇంకేమీ అడగలేదు. బయటికిపోయి బీడీ కాల్చు
ూచున్నాడు. ప్రొద్దుకూకిందగ్గిర్నుంచీ వంటప్రయత్నాలు
ే వున్నాయి. గీత అలా ఏడుస్తూ పడుకుని ఉండటం
ష్ఠి ఓసారి ఆమెదగ్గిరకెళ్ళి, "ఏం జరిగిందమ్మా?" అని

లేదులే' అన్నట్లు తల ఊగించింది గీత.

'ఏంలేదు' అన్నదానికి నిజంగా ఏమీలేకపోవటమూ
'చ్చు! లేదా, 'ఏం జరిగితే యేం, నే చెప్పనులే' అని
కావొచ్చు. ఏమైనా షష్ఠీమాత్రం ఇంక ఆ విషయాన్ని
ి అడగలేదు. కాని కాసేపయాక మళ్ళీవచ్చి "ఇదుగో
ఉప్పంతా వెయ్యనా!" అని అడిగాడు.

ఁ. వెయ్యి" అన్నట్లు గీత ఈసారి కూడా తలే ఊగిం
మాట్లాడలేదు

ాయ్ అలా కూచునిఉండటం చూసి, "ఏమిటోయ్? ఏం
ి?" అని అడిగాడు విజయదా.

ాయ్ ఓ పెద్దనిట్టూర్పు విడిచాడు. విజయదా నవ్వుతూ
ోయ్! అంత పెద్ద నిట్టూర్పే! ప్రాణాయామం ఏమైన

అభ్యాసం చేస్తూన్నావా యేం'' అంటూ చేతిలోని బాగ్
పడేసి, తానుకూడా అక్కడే కూచున్నాడు. కానాయ్
ధానం ఏమీ చెప్పకపోయినా అతడు తన సంభాషణ వ
''పొద్దుననగా వెళ్ళావు ఇంట్లోంచి, మళ్ళీ ఎక్కడా అం
ఏదో లాభసాటి బేరం చేస్తూ ఉండిపోయవ్ కాబోలు! ఇక
చాలా ఇరుకునపడ్డాను. ఒక వైపునగీత, ఒక వైపున నే
నువ్వు వెళ్ళిం దగ్గిర్నుంచీ గీత మళ్ళీ ఏడుపు మొదలెట్టింది.
అనుకోకుండా నేపీకూడా సిద్ధమయినాడు. పాపం వస్తూ
ఇటూ చూసి మొహంపేలేశాడు. అప్పుడతడి మొహం
ప్రపంచమంతా భగ్గున ఒక ప్రక్కనుంచీ తగలడిపోతోం
పించింది. 'ఏమిటి విశేషం?' అని అడిగా. 'ఏంలేదు
కానూదా ఎక్కడికి వెళ్ళాడు?' అనిఆదుర్దాగా అడిగాడు.
డులేవోయ్. బెంగెట్టుకోకు. కానూ మీ గోపబృంద
త్యజించి, మధురానగరం ఏలటాని కేమీ పోలేదులే'
నేపీ అమాయకంగా నవ్వి, 'అదికాదు. ఇవాళ జనసేవ
మీటింగు. కానూదా వస్తానని మాటిచ్చారు' అన్నాడు.
భయపడకు. వచ్చాక నేచెపుతానులేకాని' నీకెంద
నిశ్చితంగావెళ్ళు నృపేంద్రచంద్రమా!' అన్నాను.
కదల్లేదు. కూచున్నవాడు కూచున్నట్లే ఉన్నాడు. ఇటు
మా కట్టలు తెగినట్లు— గీతకళ్ళు కాల్వలు కడుతున్నాయి
ఏదైనా ఎంగిలి పడమని ఎన్నివిధాల చెప్పినావినవేదు.
'భోంచెయ్యి భాయి!' అంటే 'సనేమిరా' అన్నాడు.
సకల యాతనలూపడి' 'హాసిభాయి!'(నవ్వుల చెల్లి!)అని
ఖుషీభాయి!' (కులాసా తమ్ముడూ!) అని నేపీతోనూ కొత్త
పెట్టుకుని వాళ్ళని రాజీకి తెచ్చుకున్నాను. నువ్వు
టంమూలంగా నీ పనికూడా నేనే నెత్తి నేసుకుని ఆ
వేళ్ళాల్సి వచ్చింది. పోనిలే, అయిందేమో అయిపోయిం
అసలింతకీ ఏం జరిగిందో చెప్పు? ఇలా కూచున్నావేం? ఇ

తా నష్టమేవచ్చిందా? లేక పూటగాలాభం సంపా
పైయెత్తులికి పథకం ఆలోచిస్తూ కూచున్నావా?'
నవ్వటం మొదలెట్టాడు.

గాలో ఓ విచిత్రమైన ఆకర్షణశక్తివుంది. తనతో
కాస్సేపట్లోనే ఎదుటివారిని తన వైపుకి తిప్పుకొగలడు.
రుండటంవల్ల కానాయ్‌లోని జడత్వమూ, మూగ
పోయాయి. ఇంతసేపయాక అతడు మళ్ళీ బరువుగా
గ్లాట్టం మొదలెట్టాడు—"అదృష్ట మనేది ఒకటుందని
విజయదా! కర్మఫలితంకొద్దీ ఇవాళ నేనెంత నిష్ఠుర
రురిఅయినానో, దాన్ని కేవలం దైవికమని అనలేను.
ఆలోచించి తయారుచేసిన పద్మవ్యూహంలాంటిదది.
ఎవరో ప్రాంప్టర్ వుండి నిర్దేశించినట్టు—ఇవాళల్లా
ాంలోనే చిక్కుకుని తిరగసాగాను. అదీ ఆశ్చర్యం!"

ుదా తాపీగా నిట్టూర్చి, "అదికాదుభాయీ! అదృష్ట
ుందని ఒప్పుకున్నావంటే, నువ్వొక్కడివేకాదు, నీతో
ి ఇద్దరం గీతా—నేనుకూడా కష్టాల్లోంచి తప్పుకోగలం.
త్యు—వివాహాలు మూడు ముఖ్యంగా అదృష్టాన్నను
టాయి. కనుక అదృష్టాన్ని ఒప్పుకుని, దానిఫలితాన్ని
దాల్చి గీతని పెళ్ళిచేసుకో".

నాయ్ ఇంక సహించలేక "నీ కాళ్ళు పట్టుకుంటాను.
హాట్లాడక ఊరుకో విజయదా!" అన్నాడు.

యదా కొంచెంసేపు ఊరుకుని, "హాపిభాయీ!" అని

ోయిన ముఖంతో గీత వచ్చి నుంచుంది. విజయదా
అంతలో కనుబొమలు చిట్లించుకుని కానాయ్
గాశాడు. మళ్ళీ గీతవైపుకి తిరిగి, "మనం ఇలా
ు చేసుకున్నది హాపిభాయీ!" అన్నాడు.

గీత మెదలకుండా నుంచుంది.

"హాపీభాయీ అని చుట్టరికం కలుపుకున్న
యులం ఎక్కడెదురైనా సరే నవ్వుకోవాలి అని ని
కున్నాం మనం. ఊఁ. ఏదీ—నవ్వూ... నవ్వా
మరి...ఊఁ. అలా..."

గీత పెదవులమీద రవంత చిరునవ్వు తొణికింది.

"ఏదీ? కాస్త టీ ఏమయినా తాగిస్తావా మాచే
రెండురూపాయల ధర వుంటే, రూపాయన్నరచేసి,
వంతా చూపించి తీసుకొచ్చిన దుమ్ములాంటి టీపొ
చూశావ్; వాటిని కాస్త బయట పారేసెయ్యమ
ఏం?" అన్నాడు విజయదా.

ఆ మాటలకి కొంచెం నవ్వురావటంతో గీతమ
చెం వికసించింది. ఆమె నెమ్మదిగా 'అలాగే' అ
నుంచి వెళ్ళిపోయింది. విజయదా ఇహనేం మాట్లా
రెట్ కాల్చుకుంటూ కూచున్నాడు.

"విజయదా!"

"ఊఁ."

"ఇవాల్టిసంఘటన నీకు చెప్పాలనుకుంటున్నాను"

"చెప్పు అయితే"

కానాయ్ ఉద్రేకంతో చెప్పటం మొదలెట్టాడు.
గానే చెప్పానుగా విజయదా! కర్మఫలితంకొద్దీ—"

విజయదా అతడి మాటకి అడ్డంవచ్చి "నేను ప్ర
చానికి చెందినవాణ్ణి కానూ! ఇలాంటి పీఠికలూ—ఉపో
పనికిరావు మనకి. జరిగినదేదో సూటిగా చెప్పేసెయ్"

కానాయ్ ఈసారి చిరునవ్వునవ్వి, మళ్ళీ మొ
గిన సంగతంతా పూస గుచ్చినట్లు చెప్పేసి చివరికీ
"నిన్నరాత్రి నీతో మాట్లాడుతూ గీత భవిష్యత్తు



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA116B155 |
| పుస్తకం పేరు | మన్వంతరం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 161 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rohith |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |